# శిష్ట సాహిత్యంలో జానపద విజ్ఞాన ధోరణులు

బి. రామాచార్యులు



# శిష్టసాహిత్యంలో జానపద విజ్ఞాన ధోరణులు



బి. రామాచార్యులు

ప్రథమ ముద్రణ : 1990

ప్రతులు : 1000

మూల్యం : రూ. 50/-



ప్రతులకు :
**వి. సుందరవల్లి**
7-1-400/25/2,
శ్రీనివాసనగర్ (తూర్పు),
హైదరాబాదు - 500 038.



ముఖచిత్రం :
**కె. కరుణాకర్**

ముద్రణ :
**శ్రీలక్ష్మీ వేంకటేశ్వర పవర్ ప్రెస్**
హిమాయత్‌నగర్, హైదరాబాదు - 500 029

---



ఈ గ్రంథం శ్రీ తిరుమల - తిరుపతి దేవస్థానం వారి
ఆర్థిక సహాయంతో ముద్రింపబడింది.

---

# అభినందన

జానపద విజ్ఞానం ఆంధ్రప్రదేశ్‌లో ఈనాడు మంచి ఊపు నందుకుం టున్న అధ్యయనాంశం. ఎంతోమంది పరిశోధకులు, అన్ని విశ్వవిద్యాలయాల లోనూ, దీనిపై అపేక్ష చూపిస్తూ, కొత్త వెలుగుల్ని ఈ రంగంలో ప్రసరించ డానికి ఉద్యుక్తులవుతున్నారు.

శ్రీ బి. రామాచార్యులు, ఈ రంగంలో ఆసక్తి మాత్రమేకాక, లోతైన శోధన దృష్టిని చూపిస్తూ మంచి గ్రంథాన్ని తెలుగు పరిశోధకులకు అర్పించ గలిగారనడానికి ఈ గ్రంథమే తార్కాణం.

ముఖ్యంగా జానపద సాహిత్యంలోని వివిధ ప్రక్రియల చొరబాటు నాగర సాహిత్యంలో ఏ రకంగా ఉన్నదో ఈ గ్రంథం వివరించి చూపుతున్నది. పాటలు. కథాగేయాలు, సామెతలు, ఆటలు, వ్రతాలు మొదలైనవన్నీ శిష్టులు ఏ రకంగా చెప్పుకొన్నారో, ఏ కవి ఏ విధంగా వర్ణించాడో ఇందులో వివరింప బడ్డాయి.

ప్రక్రియా భేదాలు, వాటి నిర్మాణ విశేషాలు గ్రహిస్తే జానపద, నాగర భేదాలను బట్టి వాటిని వేరు చేయవచ్చు. కాని, ఆటలు, వ్రతాలు, సామెతలు మొదలైనవి రెండు పక్షాలకూ చాలా వరకు సమానంగానే ఉంటాయి. వీటిల్లో మనం వేరుగా, స్పష్టంగా చూపించగలిగిన భేదక లక్షణం బాహ్యమైనదిగా ఉంటుందే తప్ప, ఆంతరమైనదిగా ఉండదు. ఉదాహరణకు 'సామెత' అనేది రెండు వర్గాలకూ సమానమే. కాని దానిని స్పష్టం చేసే భాష విషయంలో రెంటికీ మధ్య భేదాలను గుర్తించవచ్చు.

శ్రీ రామాచార్యులు నాగర సాహిత్యం నుండి ఏరి కుప్పవోసిన సామెతలు పై విషయాన్ని అధ్యయనం చేయడానికి చక్కగా అక్కరకు వస్తాయి.

జానపద విజ్ఞాన రంగంలో నిరంతర కృషి జరుగవలసి ఉంది. ఇటు వంటి గ్రంథాలు ఎన్నో ప్రకటితం అయితే కాని, పరిశోధకులకు ఆకర గ్రంథాలు తయారు కావు.

ఈ కృషిని అభినందిస్తూ ఈ గ్రంథానికి స్వాగతం పలుకుతున్నాను.

హైదరాబాదు
16-4-1980

నాయని కృష్ణకుమారి

# కృతజ్ఞతలు

జాతి జీవన విధానానికి దర్పణంలాంటిది జానపద విజ్ఞానం. ప్రభువుల పరిపోషణలో పీఠమెక్కినా కవులు తమ సమకాలీన జీవన విధానాన్ని తమ కావ్యాల్లో వర్ణించక తప్పలేదు. నేలవిడిచి సాము చేయలేమన్నట్లుగా జానపద విజ్ఞానాంశాల్ని ఎన్నింటినో తమ రచనల్లో ప్రాసంగికంగా చొప్పించడానికి ప్రయత్నించారు. కొందరు కవులు తాము జానపద కవులమేమో అన్నట్లు జానపద ధోరణుల్ని విశేషంగా తమ కావ్యాల్లో ప్రయోగించారు. శిష్టసాహిత్యంలో అపారమైన జానపద విజ్ఞానాంశాలెన్నో నిక్షిప్తమై ఉన్నాయి. వాటిని వెలికితీసే ప్రయత్నం ఈ గ్రంథంలో చేయబడింది. ఒక్కొక్క అంశంపైననే ప్రత్యేక పరిశోధనా గ్రంథం రావాల్సిన అవసరం ఉంది. పరిశోధకులు మున్ముందు ఆ ప్రయత్నం చేయగలరని ఆశిద్దాం.

ఈ గ్రంథం రూపుదిద్దుకోవడానికి రూపకల్పన చేసి వెన్నుతట్టి ప్రోత్సహించిన మాన్యులు డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారికి, మిత్రులు డా॥ చిగిచర్ల కృష్ణారెడ్డిగారికి, కావలసిన కావ్యాల్ని అందించిన తెలుగు విశ్వవిద్యాలయం గ్రంథాలయాధికారులకు హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథం వెలుగు చూడడంలో తమ వంతు సహకారాన్ని అందించడమేగాక అభినందనలు పలికిన డా॥ నాయని కృష్ణకుమారిగారికి హృదయపూర్వక నమోవాక్కులు.

ఈ గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానం అధికారులకు, సకాలంలో పుస్తకాన్ని చక్కగా ముద్రించిన శ్రీ లక్ష్మి వేంకటేశ్వర పవర్ ప్రెస్ మేనేజరు పి. శ్రీనివాస్‌గారికి, వారి సిబ్బంది వి. ప్రభాకర్, పి. దాస్ గార్లకు, ముఖపత్ర చిత్రాన్ని మనోహరంగా చిత్రించి ఇచ్చిన ప్రముఖ చిత్రకారుడు, మిత్రుడు కె. కరుణాకర్‌గారికి,

ఇంకా ఈ గ్రంథ ప్రచురణకు తమ వంతు బాధ్యతగా భావించి సహాయ సహకారాలందించి తోడ్పడ్డ సోదర మిత్ర శ్రేయోభిలాషులందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

వి. రామాచార్యులు

# అంకితం



సౌజన్యమూర్తులు

అవ్యాజానురక్తులు

అయిన

**అత్తమామలకు**



**బి. రామాచార్యులు, ఎం.ఏ., ఎం.ఫిల్.**

పుట్టింది : 1-7-1951, గుళ్లదుర్తి, కోవెలకుంట్ల, కర్నూలు జిల్లా

తల్లిదండ్రులు : శ్రీమతి బి. తిరుమలమ్మ, శ్రీ బి. రాఘవాచార్యులు

విద్యాభ్యాసం : ప్రాథమిక ఉన్నత విద్యలు : గుళ్లదుర్తి
కళాశాల విద్య : వి.ఆర్. కళాశాల, నెల్లూరు
ఎం.ఏ., ఎం.ఫిల్. : శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం.

పరిశోధన : పిహెచ్.డి. శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం.
"జానపద నృత్యకళ - గొరవ సంప్రదాయం"

వృత్తి : ఆంధ్రోపన్యాసకుడు, జి. పుల్లారెడ్డి జూనియర్ కళాశాల,
హైదరాబాదు - 28

ముద్రిత గ్రంథాలు : తెలుగు సామెతలు - మానవ స్వభావం
(ఎం.ఫిల్. సిద్ధాంత గ్రంథం)
శిష్టసాహిత్యంలో జానపద విజ్ఞాన ధోరణులు

అముద్రితాలు : జానపద గేయాలు - కుటుంబ జీవనం,
జానపద విజ్ఞానం - జాతర్లు,
జానపద కళారూపం - గంగిరెద్దులాట

# విషయసూచిక





# జానపదశబ్ద నిర్వచనం - ప్రయోగం

"జనానామ్ పదమ్ జానపదమ్" అని జానపద శబ్దానికి నిర్వచనం చెప్పబడింది. జానపదం, జనపదం, జానపదుడు, జనపదుడు అనేవి తెలుగు సాహిత్యంలో జానపద వాఙ్మయాన్ని గూర్చి చెప్పేటప్పుడు ప్రయోగించడం కలదు. జనపదం అన్నా జానపదమన్నా ఒకటే "జానపదమన్నా యిదే అర్థమని విశ్వ నిఘంటువులోని 'భవేజ్జనపదోఽపి జనపదేశయో' అన్న వాక్యంవల్ల సిద్ధిస్తుంద"న్ని[1] డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారి అభిప్రాయం.

జనపద, జానపద శబ్దాలకు దేశం, గ్రామం, పల్లె, జనులుండుతావు అని వివిధ నిఘంటువులు అర్థాల్ని సూచించాయి. జనపదుడు, జానపదుడు అనే శబ్దాలకు మనుష్యుడు, గ్రామ్యవాసి, పల్లెయందుండువాడు అనే అర్థాలు నిఘంటువుల్లో కన్పిస్తాయి.

సంస్కృతంలోనూ తెలుగులోనూ కవులు, పండితులు జనపద, జానపద శబ్దాల్ని దేశం, విషయం, గ్రామం అనే అర్థాల్లో వాడినట్లు తెలియవచ్చును.

## సంస్కృతంలో జనపద/జానపద శబ్దం :

"ఆర్యావర్తః పుణ్యభూమిర్మధ్యం విన్ధ్యహిమాగయోః, నీవృజ్జనపదో దేశవిషయౌ తూపవర్తనమ్" అని అమరంలో చెప్పబడింది. జనపదం అనగా పల్లెటూరు, జానపదులనగా జనపదాలందుండువాళ్లు అని అనుకోవడం కలదు. జానపదులనగా పామరులు, అనాగరికులు, పల్లెటూరివాళ్లు అని సర్వసాధారణంగా ప్రయోగింపబడుతూ వచ్చింది. కాని నేడు జానపదులకు సంబంధించిన అంశాలెన్నో గ్రామాల్లోనే కాకుండా పట్టణాల్లో నగరాల్లో కన్పిస్తుండడం వల్ల జానపద శబ్దానికున్న అర్థం విస్తృతపరచవలసి ఉంటుంది. సంస్కృతభారతంలోని "కృతయజ్ఞశ్చ మేధావీ బుధో జానపదశ్శుచిః"[2] అనే శ్లోకం కూడా జానపదుల్ని

---

1. 'ఓగేటి వ్యాసపీఠి' - పుట. 48. సాహిత్యసభా ప్రచురణ : 1986.
2. భారతం - 88 అ. 41 శ్లోకం.

యజ్ఞం చేసిన వాళ్లతో, పండితులతో సమానంగా చేసింది.

జనపద శబ్దం జాతిపరంగా, ప్రజలపరంగా, విషయపరంగా ప్రయోగింప బడిందని యాజ్ఞ్యవల్క్యంలోని "కులానిజాతీః శ్రేణీశ్చగణాన్ జనపదానపి" అనే శ్లోకం చెబుతుంది.

సంస్కృత భారతంలో 'జనపద శబ్దం' విషయం, దేశం, నాడు అనే అర్థంలో వాడినట్లు "అత ఊర్ధ్వం జనపదాన్ని బోధగదతే మమ తత్రమే కురు పాంచాలాః సాల్వా మాద్రేయ జాంగలాః శూరసేనాః పుళిందాశ్చ"[3] అనే శ్లోకం చెబుతుంది. భారతంనందే మరోచోట "వర్షమైరావతం రాజన్నానా జనపదా వృతమ్, ధనుస్సంస్థే మహారాజద్వేవర్షే దక్షిణోత్తరే"[4] అనే శ్లోకంలో 'జనపద' శబ్దం ప్రయోగింపబడింది.

భవభూతి ఉత్తమ రామచరిత్ర ప్రథమాంకంలో "ఉపస్తువంతిదేవం పౌర జానపదాః" అని జానపద శబ్దాన్ని గ్రామం అనే అర్థంలో వాడాడు. మాలతీమాధవంలోని చతుర్థాంకంలో "శ్రేత్రే శంకరపురజానపదాః" అని ప్రయోగించాడు. ఇచట శంకరపురం పురం కావచ్చు లేదా గ్రామం అయినా కావచ్చు. పై నాటకంలోనే పల్లెపడుచును సంబోధిస్తూ 'జనపదప్రమదా' అని అన్నాడు.

కాళిదాసు మేఘసందేశంలో పల్లెపడుచు అనే అర్థంలో 'జనపదవధూ' (1-16) అని సంబోధించాడు. జనపదం అంటే దేశం అనే అర్థంలో "బ్రహ్మావర్తం జనపదం" (1-52) అంటూ జనపద శబ్దాన్ని ప్రయోగించాడు.

శ్రీహర్షుడు ప్రియదర్శికలోని ప్రథమాంకంలో "వింధ్య శిఖరాశ్రితేషు జనపదేషు" అంటూ గ్రామం అనే అర్థంలో చెప్పాడు.

విశాఖదత్తుడు తన ముద్రారాక్షసంలోని ఆరవ అంకంలోని 'చంద్రగుప్తస్య జనపదేన నృశంసా ప్రతిపత్తిః' అనే శ్లోకంలో జనపద శబ్దాన్ని గ్రామం, దేశం, రాజ్యం అనే అర్థంలో ప్రయోగించాడు.

---

3. భారతం : భీష్మ - 9 అ.
4. భారతం ; భీష్మ - 6 అ.

కవిత్రయంలోని ఎర్రన పురజనులు, జానపదులు అని పేర్కొంటూ జానపద శబ్దాన్ని గ్రామీణులనే అర్థంలో వాడినట్లు తెలియవచ్చును :

"జానపదుల్ పురీజనులు సంతసముం బ్రమదంబెలర్పనీ
దైనశుభోదయంబు హృదయంబుల గోరుచున్నవారన
మ్మానము నొంది కౌరవసమాజము నిన్ను భరింప భూరితే
జోనిధివై వెలింగెదవు సూర్యుని చాడ్పున నీవఖిమ్మహిన్"[5]

"భవభూతివాడిన "పౌరజానపదాః ప్రజాః" అనే దాన్నే ఎర్రన స్వీకరించి అటూఇటూ మార్చి "జానపదుల్ పురీజనుల్" అన్నాడేమో[6] అని డాక్టరు ఓగేటి అచ్యుతరామశాస్త్రిగారి అభిప్రాయం.

అల్లసాని పెద్దన 'మనుచరిత్ర'లో 'దేశం' అనే అర్థంలో జనపద శబ్దాన్ని ప్రయోగించాడు ;

"ఓ చతురాస్య వంశ కలశోదధి పూర్ణశశాంక ! తీర్థయా
త్రాచణ శీలివై జనపదంబులు పుణ్యనదీ నదంబులున్"[7]

తెనాలి రామలింగడు తన 'పాండురంగ మహాత్మ్యం"లో కాపు కోడల్ని గూర్చి చెప్తూ 'జానపదాగ్రగామి' అని అంటాడు.

"కానప్రసంగముల్ దిగిచి తత్సరణిం దనపెంపుపెద్దగా
బూని వచించు నక్కపట పూరుషునిక్క మనమ్మెనెమ్మదిన్
జానపదాగ్రగామి తన జాతియు నాతియుగూడి దేవునిం
గానిజదేశికోత్తమునిగా బరమాప్తునిగా దలంచున్"[8]

పాలవేకరి కదిరీపతి 'శుకసప్తతి' అనే కావ్యంలో జనపద శబ్దాన్ని గ్రామం అనే అర్థంలో వాడాడు :

---

5. ఆంధ్ర మహాభారతం : ఆర. 5-346.
6. ఓగేటి వ్యాసపీఠి : పుట. 44. సాహిత్య సభాప్రచురణ 1986.
7. మనుచరిత్ర : 7-70 ఆ.ప్ర.సా. అకాడమీ :
8. పాండురంగ మహాత్మ్యం : 3-58 ఆ.ప్ర.సా. అకాడమీ

"దధి తక్ర విక్రయంబు లుపదేశ మాత్రంబులుగా జారాన్వేషణంబులు ప్రధాన కార్యంబులుగా సమీప జనపదంబుల నుండి వచ్చియున్న యాభీరవుల పరిభాషలా నావః బెళికింగి"[9]

అయ్యలరాజు నారాయణకవి 'హంసవింశతి'లో 'గ్రామం' అనే అర్థంలో జనపద శబ్దాన్ని ప్రయోగించాడు.

"జనపదములు పురగిరులున్
గనులు వనులు నదులు నిధులు కట్టల్ మిట్టల్
కనుమలు పేటలు తోటలు
మునుకొని కనుగొనుచు బోయ్యమోలన్ లీలన్"[10]

మరోచోట భారతదేశపురగ్రామాల్ని పేర్కొంటూ;

రాయదుర్గము గుత్తి రాయవేలూరానె
గొంది మాహురి కాశిగోలకొండ

.... .... .... .... .... ....
.... .... .... .... ....

రామచంద్రాపుర మామూరు బెజవాడ
కొండపూరు కాండపూరు కోటకొండ

మొదలుగాగల్గు జనపదమ్ములను దుర్గ
ములను బేటల బాళెంబురులవెలయ
వర్తకులు వచ్చిరచ్చట వస్తుతతులు
బేరసారంబులాడెదు పేర్మిమెఱసి"[11] అంటూ జనపద శబ్దాన్ని ప్రస్తావించాడు. పై పేర్లన్నీ గ్రామాలేకాక, పట్టణాలు, నగరాలకు సంబంధించినవి. కావున జనపదం అంటే గ్రామమే కాదని నగరాలు పట్టణాలనీ కూడా గ్రహింపవచ్చు.

కవులూ, పండితులేకాక జానపద విజ్ఞానంపై పరిశోధన చేసిన వాళ్లందరూ జానపద గేయాలనీ, జానపద సాహిత్యమనీ, జానపద కవిత్వమనీ, జానపద కళలనీ, జానపద నృత్యాలనీ పేర్కొనడమేగాక, జానపదమనేది వ్యవహారంలోను ఎక్కువ ప్రసిద్ధమైంది.

---

9. శుకసప్తతి 3-450 - ఆ.ప్ర.సా. అకాడమీ
10. హంసవింశతి - 5- 347 ఆ. ప్ర. సా. అకాడమీ
11. హంసవింశతి - 5- 359 ఆ. ప్ర. సా. అకాడమీ

# జానపద విజ్ఞానాంశాలు

జానపదులందు ప్రచారంలో ఉండేది, జానపదుల జీవన విధానానికీ, ఆచార వ్యవహారాలకూ సంబంధించినది అంతయూ జానపదమే అవుతుంది. మానవ జీవితానికి సంబంధించిన ప్రతి అంశాన్ని కలుపుకొని 'జానపద విజ్ఞానం' అని చాలా మంది పరిశోధకులు ప్రయోగించడం జరిగింది. **'Folklore'** అనే ఆంగ్ల పదానికి సమానార్థకంగా తెలుగులో 'జానపద విజ్ఞానం' అనే పదం ప్రాచుర్యాన్ని పొందింది. జానపద విజ్ఞానాన్ని గూర్చిన పరిశోధకుల అభిప్రాయాల్ని పరిశీలిద్దాం.

జానపద విజ్ఞానం మానవుని సంస్కృతిలో ఒక భాగమంటారు డాక్టరు ఆర్వీయస్. సుందరంగారు. "జానపదుల జీవనానికి సంబంధించిన గేయాలు, కథలు, సామెతలు, భాష, నమ్మకాలు, దుస్తులు, ఆటలు, వంట, వైద్యం, కళలు మొదలైనవన్నీ జానపద విజ్ఞానంలో భాగాలే"[1]

డాక్టరు నాయని కృష్ణకుమారిగారు జానపద విజ్ఞాన విభాగాల్ని గూర్చి వ్రాస్తూ "మనుష్యుని కౌటుంబిక జీవనం, నిత్యాచార పద్ధతులూ, వావివరుసలు, విధినిషేధాలు, జనన మరణాలు, సాంఘిక శాస్త్రానికి సంబంధించినవి, మనుష్యుని మేధోవికాసం, పరిణామక్రమం, నృశాస్త్రవిజ్ఞానానివి. ఆదికాలం నుండి వచ్చే ప్రభుత్వ విధాన పద్ధతులు, నాయకుడు వానికి సంబంధించిన గుంపులమీద ఆధిక్యత, రాజుకు మనిషికీ మధ్య నిర్ణయింపబడిన సంబంధాల సామాన్య సూత్రాలు, సుఖలబ్ధినిచ్చే మానవుని నైతిక జీవనపద్ధతి అన్ని రాజనీతికి సంబంధించినవి. ప్రతి వ్యక్తి జీవితంలో విడదీయరాని విధంగా పెనవేసుకుపోయిన మతసిద్ధాంతాలు, వ్రతాలు, పూజలు, ఆచారకాండలు, శకునాలు, నమ్మకాలు, మంత్రతంత్రాలు, దయ్యాలు, అజేయ శక్తులను గురించిన ఊహల పారమ్యం ఇవన్నీ జానపద విజ్ఞానంలో భాగాలే"[2] అన్నారు.

---

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం : ప్రవేశిక పుట - 1
2. పరిశోధన - పుటలు 157, 158

డాక్టరు తంగిరాల వెంకట సుబ్బారావుగారు జానపద విజ్ఞానాన్ని ఐదు ప్రధాన భాగాలుగా విభజించారు.

1. జానపద సాహిత్యం లేక శాబ్దిక కళలు
2. జానపద భాష
3. జానపద కళలు లేక శాబ్దిక కళలు
4, జానపద శాస్త్రములు
5. వస్తు సంస్కృతి లేదా జానపద పరికరములు[3]

ఆచార్య బి నాగయ్యగారు జానపద విజ్ఞానాన్ని గూర్చి వివరిస్తూ "జానపదులకు సంబంధించిన వాఙ్మయమేకాక జానపద కళలు, భాష, నృత్యము, సంగీతము, నాటకము, జానపద వైద్యవిధానము, జానపదుల ఆచార వ్యవహారాలు, వేషభూషణములు మొదలయినవన్నియు చేరును"[4] అని అన్నారు.

డాక్టరు బిట్టు వెంకటేశ్వర్లుగారు జానపద విజ్ఞానాన్ని మూడు ముఖ్య భాగాలుగా విభజించారు :

**1. శబ్దసహిత కళలు లేక వాక్సహితకళలు (Verbal arts) :-**

వాక్సంబంధమైన అన్ని ప్రక్రియలు ఇందులో చేరును. గేయాలు, వచనం, పొడుపు కథలు, సామెతలు, జానపద భాష.

**2 శబ్దరహిత కళలు లేక వాగ్రహిత కళలు (Non-Verba artsl) :-**

చిత్రలేఖనం, శిల్పం, ఆటలు, మందులు, వస్తువాహనాలు, వేషభూషణాలు, ముగ్గులు మొదలైనవి.

**3. మిశ్ర కళలు (Mixed arts) :-**

నాటకం, వీధిభాగవతం, కోలాటం, పగటివేషాలు, గారడి విద్యలు, విప్రవినోదాలు, జాతరలు, పూనకాలు మొదలైనవి.[5]

---

3. ఎల్లోరాగారి 'జానపద సాహిత్యంతో ఉదాహృతం : పు - 30
4. తెలుగు సాహిత్య సమీక్ష - 2వ సంపుటం : పుట 754
5. పల్నాటి సీమలో కోలాటం - తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ : పుట 76

అలెగ్జాండర్ క్రాప్ట్ తమ 'Science of Folklore' అనే గ్రంథంలో జానపద విజ్ఞానాన్ని ఎనిమిది విధాలుగా వింగడించారు.

1. జానపద సాహిత్యం - కిన్నరకథ, వినోదకథ ప్రాణికథ, స్థల ఐతిహ్యం, సంచార ఐతిహ్యం, గద్యకథలు, సామెత, గీతాలు.
2. సస్య సాహిత్యం (Plant Lora)
3. మూఢ నమ్మకాలు
4. ప్రాణి సాహిత్యం (Animal Lore)
5. ఖనిజ సాహిత్యం
6. సంప్రదాయాలు ఆచారాలు
7. మంత్ర విద్యలు
8. నృత్యం, నాటకం

రిచర్డ్ ఎం. డార్సన్ జానపద విజ్ఞానంలోని నాలుగు స్థూల విభాగాల్ని పేర్కొన్నాడు:

**1) మౌఖిక జానపద విజ్ఞానం (Oral Folklore) :-** జానపదగేయాలు కథా గేయాలు, జానపద పురాణాలు, ఐతిహ్యాలు, గద్యకథలు, సామెతలు, పొడుపు కథలు, మాండలికాలు. నుడికారాలు, తిట్లు, ఒట్లు మొదలైనవి.

**2) సాంఘిక జానపదాచారాలు (Social Folk Coustoms) :-** పుట్టుక, వివాహం, మరణం మొదలైన వానికి సంబంధించిన ఆచారాలు, కుటుంబం సంబంధ బాంధవ్యాలు, పండుగలు, వినోదాలు, ఆటలు జానపద వైద్యం, మతం, నమ్మకాలు మొదలైనవి.

**3) వస్తు సంస్కృతి (Material Culture) :** భౌతిక జీవిత సంబంధి వస్తువులు. వస్తురూప కళలు, చిత్రకళ, శిల్ప, వాస్తుకళ, వృత్తి పని ముట్లు, దుస్తులు, అలంకరణ, ఆభరణాలు, ఆహార సామగ్రి, పూజా సామాగ్రి శిలావిగ్రహాలు, దారు విగ్రహాలు మొ॥

# శిష్టసాహిత్యంలో జానపద వాఙ్మయం

**జానపదగేయాలు** :- వాగ్రూపమైన జానపద కళల్లో జానపద గేయా లొక విభాగం **'Flok Songs'** అనే ఆంగ్ల పదానికి సమానంగా 'జానపద గేయాలు' అని తెలుగులో అనేకమంది సాహిత్య పరిశోధకులు వాడడం జరిగింది. "**Folk Songs, Folk Literature, Folk-Lore** అను మాటలకు జానపద గీతములు, జానపద సాహిత్యం లేదా జానపద సారస్వతం, జానపద విజ్ఞాన మను మాటలు వాడుట పరిపాటి" 1 అని ఆచార్య రామరాజుగారి అభిప్రాయం.

జానపద గేయాలని బహుళ ప్రాచుర్యాన్ని పొందిన వానిని పండితులు, విమర్శకులు అనేక పేర్లతో పిలవడం జరిగింది. "శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం గారు 'ప్రజా వాఙ్మయమనీ,' శ్రీ తల్లా వఝ్ఝుల శివశంకరశాస్త్రి, శ్రీ అడిదము రామారావు ప్రభృతులు 'పద వాఙ్మయమనీ', శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు 'అనాదృత వాఙ్మయమనీ', శ్రీ వావిలాల సోమయాజులుగారు 'గేయరచనలనీ', శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'మధుర కవితలనీ', శ్రీ శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారు 'దేశి సారస్వతమనీ' పిలువగా శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణ గారు శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు గారు శ్రీహరి ఆదిశేషువుగారు. శ్రీ నేదునూరి గంగాధరంగారు శ్రీ తూమాటి దొణప్ప గారు 'జానపద గేయాల'ని పిలిచిరి."2 మొత్తం మీద జానపద గేయాలనే ఎక్కువమంది పరిశోధకులు ప్రయోగించడం జరిగింది. జానపద గేయాలనే ఔత్తరాహులు లోక సాహిత్యమనీ, లోక్‌గీత్ అని పిలుస్తారు. 'జనపదగీతె' అని కన్నడంలో పిలువగా తమిళంలో 'నాట్టుప్పురప్పాల్గళ్' అనీ 'వాయ్ మొళి ఇల క్కియం' అనీ పిలుస్తారు.

జానపద గేయాలు కథారహితాలు, కథా సహితాలు, అని రెండు విధాలుగా ఉంటాయి. కథా రహితగేయాలే జానపద గేయాలుగా, కథా సహిత

---

1. తెలుగు జానపదగేయ సాహిత్యము ప్రవేశిక - పుట 8
2. తెలుగు జానపదగేయ సాహిత్యము ప్రవేశిక - పుటలు 1, 2

గేయాలు జానపదగేయ గాథలుగా విమర్శక లోకంలో ప్రాచుర్యాన్ని పొందాయి. ప్రస్తుతం కథా రహిత జానపద గేయాల్ని గూర్చి చర్చించబడుతుంది.

జానపద గేయాలను గూర్చి పరిశోధన చేసినవాళ్ళు జానపద గేయాల్ని అనేక విధాలుగా విభజించిరి. జానపదగేయ సాహిత్యంపై తొలుత పరిశోధన గావించిన వారు ఆచార్య బి. రామరాజుగారు. వీరు తమ "తెలుగు జానపద గేయ సాహిత్యము" అనే పరిశోధన గ్రంథంలో జానపద గేయాల్ని పౌరాణిక గేయాలనీ, చారిత్రక గేయాలనీ, మత సంబంధ గేయాలనీ, పారమార్థిక గేయాలనీ, స్త్రీలపాటలనీ, శ్రామిక గేయాలనీ, పిల్లల పాటలనీ, శృంగార గేయాలనీ అద్భుత రస గేయాలనీ, కరుణరస గేయాలనీ, హాస్యపు పాటలనీ వర్గీకరించి విపులమైన పద్ధతిలో ఒక్కొక్క విభాగాన్ని పరిశీలించారు.

డాక్టర్ ఆర్వీయస్, సుందరంగారు ఆంధ్రుల జానపద విజ్ఞానం అనే గ్రంథంలో జానపదగేయాల్ని జాపర్గీకరిస్తూ "ఆశయాన్నిబట్టి పాటల్ని పురుషుల గీతాలు, స్త్రీలపాటలు, ఉభయుల గీతాలు, పిల్లల పాటలు అని నాలుగు రకాలుగా విభజింపవచ్చు. రసాన్నిబట్టి చూస్తే వలపు పాటలు, హాస్యగీతాలు మొదలైన విభాగాలు ఏర్పడుతాయి. గేయాల క్రియాత్మక గుణాన్ని తీసుకుంటే పని పాటలు, క్రీడాగీతాలు, నృత్యగీతాలు మొదలైన విభాగాలేర్పడుతాయి. ఇట్లే లయను గాయకులను వాద్యాలను తీసుకొని విభాగాలు చెయ్యవచ్చు"అని విభజిస్తూ అన్ని రకాల గేయాల్ని కలుపుకొని క్రింద విధంగా విభజించారు.

1. పని పాటలు
2. పారమార్థిక గేయాలు
3. దాంపత్య గీతాలు
4. పిల్లల పాటలు
5. వేడుక పాటలు
6. వలపు పాటలు
7. హాస్యగీతాలు
8. కన్నీటి పాటలు

(పుట. 50, 51)

పద్యానికంటే ముందే పదం పుట్టిందని విమర్శకుల అభిప్రాయం. "చిత్ర విచిత్ర కార్యకమనీయమైన ప్రకృతి దేవతా చిద్విలాసమును చూచి యానంద పరవశుడై ప్రాకృత జీవియగు ప్రాక్తన మానవుడు చిందులు త్రొక్కుచూ పాడిన పాటయే మానవలోక కవిత్వావిర్భావమునకు శ్రీకారము. ఆ కవిత్వము ఆడుచు పాడినది కనుక దానికి 'ఆటపాట' లేక 'నృత్యగీతము' అని పేరు. కనుక పద, పద్య కవిత్లో పదమే ప్రాచీనమనీ పదకవిత నుంచి పద్యకవిత్వ మావిర్భవించినది.[3] పేర్కొనబడింది.

తెలుగులోని దేశిపారస్వతమంతా జానపద గేయాలే అని పరిశోధకుల అభిప్రాయం. ద్విపదలు, రగడలు, తరువోజలు, మధ్యాక్కరలు, దరువులు, ధవళములు మొదలైన దేశి రచనలన్నీ జానపద గేయాలుగా చెప్పబడ్డాయి శ్రీ ఎల్లోరాగారు 'జానపద సాహిత్యం' అనే గ్రంథంలో దేశిరచనల్ని గూర్చి ఇలా వివరించారు. "దేశిరచనలు రెండు విధములు. ఒకటి పాట. రెండు పదములు. పదములు- తుమ్మెద, ప్రభాత (మేలుకొలుపులు) వెన్నెల (చందమామ) కోవెల, చిలుక, కిరాశి, గొబ్బి, నివాళి (హారతులు మంగళములు) మువ్వ గోపాల, హరిహరీ పదాలుగా చెప్పవచ్చును. ఇక పాటలు- లాలి, జోల, ఏల, సువ్వి, ఉయ్యాల, జాజరి, ఐరేని, అప్పగింతలు, శ్రావణ శుక్రవారాలు, అక్కల, శోభనం, ధవళములు, చద్దులు, సుద్దులు, చిందులు, కీర్తనలు, సంవాదాలుగా చెప్పవచ్చు."[4]

డాక్టరు బి. రామరాజుగారు కుప్పలు తెప్పలుగానున్న జానపద రచనల్ని పేర్కొన్నారు. "ఊయెల పాట, గొడుగీతము, రోకటిపాట, తుమ్మెద పాట, మేలుకొలుపులు, గొబ్బిపదము, వెన్నెల పదము, జాజర, కోలాటపు పాట, ఏల పదము, చిలుకపదము, సువ్వాల, గౌరీకల్యాణము, ధవళము, లాలి, జోల, తలుపు దగ్గర పాట, చందమామ పదము, బతుకమ్మ పాట, తెల్లపాట."[5]

అప్పకవి యక్షగానాలలోని పాటలకు లక్షణాలను వ్రాస్తూ పెండ్లిపాట, లాలిపాట, శ్రీధవళము, సువ్వారేసువ్వి, అర్ధచంద్రికలు, ద్విపదభేదాలు, రగడలు పేర్కొనెను (4వ ఆశ్వాసం).

---

3. గౌతమ వ్యాసాలు : క్షేత్రయ్య పద సాహిత్యము
4. జానపద సాహిత్యం : పుట 77
5. తెలుగు జానపదగేయ సాహిత్యము : పుటలు - 322, 323

## శిష్టసాహిత్యంలో జానపదగేయ ధోరణులు :

తెలుగు సాహిత్యంలో మార్గ కవిత్వమనీ, దేశికవిత్వమనీ రెండు మార్గాలు కనిపిస్తాయి. నన్నయ తిక్కనాది కవుల కావ్యాలు మార్గకవితా రీతికి చెందినవి. అయితే నన్నయకు ముందే దేశకవితా రీతులు శాసనాల్లో ఉన్నట్లు ఆధారాలు కనిపిస్తాయి.

"కడప జిల్లా పొట్లదుర్తి, మాలెపాడు శిలాశాసనం క్రీ. శ. 8వ శతాబ్దానికి చెందిన శాసనం. ఇది వచనమే అయినా ఇందులో ద్విపదగతి, రగడగర్భితమై ఉంది. ఇది చోడమహారాజు పుట్టించిన దేశికవిత కాకపోదు"[6]

యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో రగడలు కనిపిస్తాయి గుణగవిజయాదిత్యుని అద్దంకి శాసనం (9వ శతాబ్దం)లో తరువోజ కలదు. నన్నయ భారతంలో తరువోజ, మధ్యాక్కర, అక్కర, మధురాక్కరలు కనిపిస్తాయి. "నన్నయ 11 తరువోజలు, 83 మధ్యాక్కరలు, 1 అక్కర, 1 మధురాక్కర రచించెనని డాక్టరు బి. రామరాజుగారు పేర్కొనిరి. (చూడు తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట. 49)

**నన్నెచోడుడు :** తెలుగు సాహిత్యంలో దేశికవులను స్తుతించి దేశికవితా మార్గాన్ని కొనియాడిన ప్రథమ కవి నన్నెచోడుడు. కుమార సంభవంలో కవిస్తుతి యందు

"మును మార్గకవిత లోకం
బున వెలయగ దేశికవిత బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బున జనజాశుక్య రాజు మొదలుగ బలువుర్"[7] అంటూ దేశికవితను గూర్చి చెప్పడమేగాక నన్నెచోడుడు తన కాలంలో ప్రజల్లో ప్రచారం పొందిన అంకమాలికల్ని ఊయెల పాటల్ని, గౌడుగీతాల్ని, రోకటి పాటల్ని పేర్కొనడం జరిగింది.

---

6. పరిశోధన ప్రథమ సంచిక : తొలి తెలుగు శాసనం-దేశికవిత వ్యాసం
7. కుమార సంభవం - 1-23

పార్వతీదేవి బాల్యంలో శివార్చన చేయు సమయంలోనే వివిధ క్రీడల్ని ఆడుచు వివిధ విద్యల్ని అభ్యసించిందని వర్ణించు సందర్భంలో అంకమాలికల్ని ప్రస్తావించాడు :

"హరు మ్రోల సద్భక్తి నాడుచోటన నాట్య
విషయమ్ములన్నియు వెలయ గఱచె
లీల నీశ్వరు నంకమాలికల్ పాడుచో
గీతి భేదంబుల రీతులెఱిగె"[8]

'అంకమాలికలు' అనగా 'స్తోత్రము' అని శబ్ద రత్నాకరంలో చెప్పబడింది. బహుశా ఈశ్వరుని సమీపంలో స్తోత్రం చేస్తూ పాడిన పాటలే అంకమాలికలయి ఉండవచ్చు. "అంకమాలికలు రాగయుక్తములై యుండున"ని[9] శ్రీరామరాజు గారి అభిప్రాయం.

మధుమాస సమయంలో స్త్రీలవిరహ బాధను వర్ణించు సందర్భంలో కొందరు స్త్రీలు ఊయెల పాటలు పాడినట్లు వర్ణించబడింది :

"నెలమి ఱింకపండు బొలుమేన జేసిన
దపము పండబండె దరువనంబు
లువిదలింపుమిగుల నూయల పాటలు
పాడు మధుమదమున బాడెనళులు"[10]

మద్యపానమత్తులైన ఎఱుక స్త్రీలు 'గౌడుగీతాల్ని' పాడినట్లు వర్ణించబడ్డ పద్యం :

"జీఱిక కల్లుద్రావి మదసింధురగామినులన్ని కేఱియల్
వాఱుచు గౌడుగీతములు పాడుచు బొల్పుగ గాలి యాడుచున్

8. కుమార సంభవం - 3-38 : ఆ. ప్ర. సా. అకాడమి
9. తెలుగు జానపదగేయ సాహిత్యం : పుట 48. జానపద విజ్ఞానప్రచురణ
10. కుమార సంభవం - 4-89.

గోఁడదమాడుచున్ జతులకు పరవర్తులుగాక మీరకున్
మీటుచు వన్నెకాంతలు రమింతురు తద్విపినాంతరంబునన్"[11]

"గౌడజాతివారు పాడుకొను గేయములను గౌడుగీతములందురని"[12] ఆచార్య రామరాజుగారు పేర్కొనిరి. కాని కుమారసంభవంలో నన్నెచోడుడు ఎఱుకస్త్రీలు గౌడుగీతాల్ని పాడినట్లు వ్రాయడం జరిగింది.

మరో సందర్భంలో శబరస్త్రీలు పటికపు రోటిలో వెదురు బియ్యాన్ని పోసి గౌరుకొమ్ముతో దంచుచు రసోత్కటంగా పెక్కు రాగాలతో రోకటి పాటల్ని పాడినట్లు వర్ణించాడు :

"పటికపుఱోల ముత్యెదురు బ్రాలొగి బోయుచు గౌరుకొమ్ము రో
కటగొని దంచుచున్ శబరకామిని వెక్కులు రాగముల్ రసో
త్కటముగ బాడెజుట్టిన మృగంబులు సోమ మనుష్యరూప ధూ
ర్జటి ముని ముఖ్యలోకగురు జంగమలింగము మల్లికార్జునున్"[13]

రోకటి పాటలు నన్నెచోడుని కాలం నుండి ఈనాటివరకు వినిపిస్తూనే ఉన్నాయి. జొన్నలు, వడ్లు మొదలైన ధాన్యాల్ని దంచే సమయంలో శ్రమను మరచిపోవుటకై పాడు పాటలనే రోకటి పాటలని పేర్కొనడం జరిగింది.

మరికొందరు ఎఱుకస్త్రీలు పాటలు పాడుచూ వాణీధరుని పూజించినట్లు క్రింది పద్యం వ్యక్తం చేస్తుంది :

"వేణుజ మౌక్తికముల్ దొడి
పీణులకింపెసగ నెఱుకు వెలదులు ప్రీతిన్
వాణీధరు బాడిరి గి
ర్వాణాధిపభోగి భువన వంద్యున నింద్యున్"[14]

---

11. కుమార సంభవం - 6-45
12. తెలుగు జానపదగేయ సాహిత్యం పుట. 521
13. కుమార సంభవం : 6-47 ఆ. ప్ర. సా. అకాడమీ
14 కుమార సంభవం : 6-48 ఆ. ప్ర. సా. అకాడమీ

ముదితలందరూ వివిధ రాగాల్లో వినవింపుగా పాడుచూ విశ్వేశుడైన ఈశ్వ రుని ప్రార్థించిరని వర్ణించబడిన సన్నివేశం :

"ఆన నక్కజంబుగా నన్నిమే యెఱుగ
కొడుచు శంకరు నంకమాలికలు
పనిగొన సాహుళి ఫలమంజరమున
భైరాళి నాందోలి భైరవినాట
ననుపార నాలతుల్ నూల్కొనజేసి
మనురీతి తోడ మనోరాగలీల
వినవింపుగా బెక్కు విధములబాడి
వినుతించి రింతులా విశ్వేశునీశు"[15]

జేశరచనయైన "తరువోజ"లో వర్ణించడం మరో విశేషమని చెప్పుకోవచ్చు, అంక మాలికల్ని సాహుళిఫల మంజరమున పాడినారట.

**పాల్కురికి సోమన :** పండితారాధ్య చరిత్రం, బసవపురాణం సోమన ప్రసిద్ధ రచనలు. నన్నెచోడుని తర్వాత జానపదగేయ ధోరణుల్ని అధికంగా పేర్కొన్నవాడు పాల్కురికి సోమనాథుడు. నన్నయ తర్వాత తెలుగు సాహి త్యంలో దేశికవితకు, అందులోనూ ద్విపదకు పెద్ద పీఠం వేసినవాడు సోమ నాథుడు. ద్విపద ప్రాశస్త్యాన్ని సోమన 'బసవపురాణం'లో ఇలా అంటాడు :

"ఉరుతర గద్యపద్యోక్తుల కంటె
సరసమై పరగిన జానుదెనుంగు
చర్చింపగా సర్వసామాన్యమగుట
గూర్చెద ద్విపదలు గొర్కిదైవాఱ"[16]

"ఆతత సకల పురాతన భక్త
గీతార్థ సమితియే మాతృకగాగ" బసవపురాణాన్ని రచిం చాడు. కావుననే డా॥ జి వి. సుబ్రమణ్యంగారు బసవపురాణాన్ని గూర్చి

15. కుమార సంభవం : 9-135 ఆ. ప్ర. సా. అకాడమీ

16. బసవ పురాణం : ప్రథమ-పుట 7 : ఆ. ప్ర. సా. అకాడమీ

"పురాణకల్పము నందును, వస్తుసంవిధానము నందును, ఛందోనిర్వహణము నందును, భాషాప్రయోగమునందును, దేశీయములైన సంప్రదాయములను, నవీన గుణములను మేళవించి ప్రథమాంధ్ర స్వతంత్ర ద్విపద పురాణముగా సోమనాథుడు నిర్మించెను"[17] అని ఉల్లేఖించారు.

మాది రాజయ్య వివిధ పుష్పఫలాలతో పూజించు సమయంలో వివిధ రాగాలతో గీతాల్ని ఆలపిస్తూ పాడి ఆడినట్లు వర్ణించబడింది :

శివదేవు సంస్తుతి సేయుచున్నంత
రమణ బత్తీసాది రాగంబులకును
నమర నన్నియు దండియలు నియోగించి
యే రాగమున సకలేశు నకర్థి
యాతాగవీణ దానలరి ధ్వనింప
ఘితచిత స్త్రీరాగ పురుషరాగములు
నలసమై లక్ష్యలక్షణ నిర్వితార్థ
పూరిత నాదగంభీర విస్ఫూర్త
పారోక్తి గీతంబులారఁ బాడుచును
దమతమ కభిం వాద్యంబులు మ్రోయ
గ్రమమొందఁ గేళికగతి నటింపుచును"[18]

బసవేశ్వరుని పెండ్లి సమయంలో ఆనందగీతాలు, శంకరగీతాలు జతి గీతాలు అత్యంత భక్తితో పాడినట్లు సోమనాథుడు వర్ణించాడు :

"నలిరేగి వేణువీణా వాద్యవితతు
లులియుచు లీలతో నొక్క మ్రోయ
నానందగీతంబులఁ గ్గించు వారు
పూని శంకరగీతములు పాడు వారు

17. బసవ పురాణం : పీఠిక - పుట xxii ఆ. ప్ర. సా. అకాడమీ
18. బసవపురాణం : తృతీయ - పుట 125

జతి గీతములమీద జప్పటలిడుచు
నతిశయ శివభక్తి నాడెడు వారు"[19]

"పండితారాధ్య చరిత్రం"లో కావ్య కళను గూర్చి చెప్పుచూ నవరసాలు తోలు కాడుచుండగా తేటతెనుగున ద్విపదను రచింతునని ద్విపద ప్రాశస్త్యాన్ని మరో సారి సోమన కొనియాడుట జరిగింది :

"సత్కృతి యననూత్న సంగతిదనర
దొమ్మిది రసములు దులుకాడు దాని
యిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణ
మగు నలంకారంబుల సరారు దాని
ద్విగుణార్థ భావముల్ దీటుకొనగ
దేట తెనుంగున ద్విపద రచింతు"[20]

దీక్షా ప్రకరణంలో శైవభక్తులు అత్యంత భక్తితో అంబపాదాబ్జాల మీద పడి ప్రణుతిస్తూ పదాల్ని, పద్యాల్ని కూర్చి పాడుచుండిరట :

"ముదిత సద్భక్తి సమున్నత మహిమ
పద పద్యముల గూర్చి పాడెడువారు
ప్రకటించి దండనాయకుని గీతములు
సుకరోక్తి పాడుచు సోలెడువారు
మఱియు బురాతన మహిత గీతములు
దఱితఱి బాడుచు దమకించువారు"[21]

'వాదప్రకరణం'లో సోమనాథుడు తనకాలం నాడు ప్రచారంలో ఉన్న తుమ్మెద పదాలు, ప్రభాతపదాలు, పర్వతపదాలు, ఆనందపదాలు, శంకరపదాలు, నివాళి పదాలు, దాలేశు పదాలు, గొబ్బిపదాలు వెన్నెలపదాలు మొదలైన పదాల్ని గూర్చి ప్రస్తావించాడు.

---

19. బసవపురాణం : ప్రథమ - 39 పుట
20. పండితారాధ్య చరిత్ర - దీక్షా ప్రకరణం : పుటలు 18, 19.
21. పండితారాధ్య చరిత్రం : దీక్షాప్రకరణం : పుట - 160.

"హృద్యంబుగా సత్కవీశ్వరుల్ వొగడ
మదినుబ్బి సంసారమాయా స్తవంబు
బదములు దుమ్మెద పదముల్ ప్రభాత
పదములు శంకర పదముల్ నివాళి
పదములు వాలేశు పదములు గొబ్బి
పదములు వెన్నెలపదములు సంజ
వర్ణన మతిగుణవర్ణన పదము
లర్థవఘోష ఘూర్ణిలుచుండ
బాడుచు నాడుచు బరమహర్షమున
గూడి సద్భక్త సంకుల మేగుదేర"[22]

సోమనాథుడు పేర్కొన్న పై పదాల్ని గూర్చి డాక్టర్ బి రామరాజుగారు ఇట్లు వివరించిరి. "సోమనాథుడు పేర్కొన్న సంసార మాయా స్తంబు పదములు వైరాగ్య గీతములై యుండును తుమ్మెద, నివ్వాళి, వాలేశు, గొబ్బి, వెన్నెల పదములీమాటలనే పాదాంతములందు గలిగిన ఈనాటి పాటలవంటివే కాబోలు. ప్రభాత పదములనగా మేలుకొలుపులు స్ఫురించుచున్నవి. పర్వత పదములు శ్రీశైల పర్వత ప్రశంస జేయునవి కాబోలు. శంకర పదములు భక్తి గీతములై యుండును. సంజవర్ణన, గుణవర్ణన పదములు మాయమైపోయినవో లేక మారు వేషమున నజ్ఞాతవాసము గడుపుచున్నవో తెలియదు."[23]

శ్రీ ఎల్లోరా "వెన్నెల పదములనగా చందమామ పదములనీ, నివాళిపదము లనగా హారతులు, మంగళములనీ"[24] వివరించిరి.

"గొబ్బి పాటల్ని సంక్రాంతి పండుగ సమయంలో ఆడపిల్లలు, స్త్రీలు, మండలాకారంగా తిరుగుతూ నృత్యం చేస్తూ పాడతారని."[25] డాక్టర్ పి. లీలా వతమ్మగారు పేర్కొన్నారు.

---

22. పండితారాధ్య చరిత్రం : నాద ప్రకరణం పుట - 513
23. తెలుగు జానపదగేయ సాహిత్యం : పుట : 50
24. జానపద సాహిత్యం - పుట : 77
25 అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు : పుట : 88

పర్వత ప్రకరణంలో భక్తులు ఆటలాడుచూ పాటలు పాడుచు పోవుచున్న సందర్భంలో బసవగీతాల, ఏలల, నాళతుల ప్రస్తావన కలదు.

"అత్యంత భక్తి సమగ్రత మెఱసి
నిత్య లింగార్చన నియమముల్ దీర్చి
యిష్టలింగ ప్రసాదేచ్ఛో భోగ
పుష్ట సుఖవాప్తి బొంద నంతంత
బసవన్న గీతముల్ వసరించువారు
బసవపురాణ మొప్పగ జదువువారు
భరతోక్తి నేలలు వాడెడువారు
నరు దంద జిందులకాడెడువారు
నాళతుల్ సేయుచు నలరెడువారు"[26]

'బసవగీతములు' బహుశా బసవనికి సంబంధించి భక్తులు పాడు భక్తిగీతాలు అయి వుండవచ్చు. ఏలలను గూర్చి పరిశోధకుల అభిప్రాయాలు ప్రచారంలో ఉన్నాయి. తాళ్ళపాక చినతిరుమలయ్య ఏలలక్షణాన్ని గూర్చి చెప్పిన పద్యాన్ని చూడండి:

"నాయకాహ్వాన పూర్వమై నయముగలిగి
మ్లేచ్ఛపరిభాష దగిరాగ మిశితమైన
యేలపాట పదంబునా నిలజెలగు
మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు"[27]

ఏలల్లో తాత్త్విక భావాలు, లౌకిక శృంగార సన్నివేశాలు, మధురభక్తి పూరితాలు కలవు. ఏలలను గూర్చి ఆచార్య బి రామరాజుగారి అభిప్రాయం: "జానపద గేయ రీతులలో ఏలలదొక విశిష్ట స్థానము. ఎత్తుగడలోను, మధ్యసంబుద్ధిలోను, ముక్తాయింపులోనూ ఏలలను త్రిభంగి ధనుస్సుతో పోల్చవచ్చును. మొదటి పాదపు ఎత్తుగడతో విల్లెక్కు బెట్టి మధ్యపాదపు సంబుద్ధితో బాణము సంధించి,

26. పండితారాధ్య చరిత్రం: పర్వతప్రకరణం: పుటలు 365, 366 ఆంధ్ర గ్రంథమాల
27. తెలుగు సంకీర్తన లక్షణం: 65 వ పద్యం

నారిసారించి, మూడవ పాదపు ముగింపుతో ఎదుటివారి గుండె గూడులందు భావములను బాణములను నాటవచ్చును. అవి భక్తిభావములు కానిండు, శక్తిభావములు కానిండు. ఆ రెండింటికిని కావలసినంత శక్తి ఏలపాట యను విల్లునుండి లభించును"[28]

భక్తులందరూ నక్షత్ర పర్వతాన్ని ఎక్కుచూ మిక్కిలి భక్తితో 'చేదుకో మల్లయ్య చేదుకో' అంటూ వివిధ పాటల్ని పాడుకుంటూ పోవడాన్ని పాల్కురికి సోమన వర్ణించాడిలా :

"చేదుకో చేదుకో శ్రీగిరినాథ
చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు
చేదుకో చేదుకో శ్రీశైలనిలయ
చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు
చేదుకో చేదుకో చేనేత నొడయ
చేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు
గనుకని పాటలు గట్టివాడుచును
జనిచని చిందుల జతులవాడుచును"[29]

అచ్చమైన జానపదగేయ బాణిని సంతరించుకొని ద్విపద రచనలో సాగినది.

**నాచన సోముడు :** ఉత్తర హరివంశం రచించిన సోమనాథుడు "వసంత విలాసం" అనే గోష్ఠివిషయక ఏకాశ్వాస ప్రబంధాన్ని రచించాడని లక్షణకారుల ఉదాహరణాన్నిబట్టి తెలుస్తుంది. ఆ గ్రంథంలోని జాజరపాటను లక్షణకారు లనేకులు ఉదాహరించుట జరిగింది. ఆ పాట యిది.

"వీణాగానం వెన్నెలతేట
రాణమీరగా రమణుల పాట
ప్రాణమైన పిన్నబ్రాహ్మణపీట
జాణలు మెత్తురు జాజరపాట"[30]

28. అన్నమయ్య పాటలలో జానపద రీతులు (వ్యాసం)
29. పండితారాధ్య చరిత్ర. పర్వత ప్రకరణం : పుట 370
30. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట. 78 లో ఉదాహృతం

జాజర పాటల్ని గూర్చి ఆచార్య రామరాజుగారు "ఇప్పటికిని తెలంగాణమున జాజర పాటలు 'కాముని పున్నమ' పండుగ దినములందు జానపదులు పాడుదురు. నేటి జాజర పాటలకిది మాతృకయై యుండనోపు" అని వివరించిరి (తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట. 51).

'తెలుగు - కన్నడ జానపద గేయాలు' అనే గ్రంథం నందు ఆర్వీయస్. సుందరంగారు జాజరపాటను గూర్చి వివరిస్తూ "ఈ జాజర పాటలను కోలలు తడ్తూ పాడుతారు. వీటిని పాడేటప్పుడు కస్తూరి, గంధప్పొడి, పుప్పొడి మొదలైన వాటిని చల్లుతారు. ఈ పొడికి 'జాజర' అని పేరు. జాజరపాటలు శృంగార హాస్యరస ప్రధానములై ఉంటాయి" అని పేర్కొన్నారు. (పుట. 162)

జాజర పాటల్ని వర్గీకరిస్తూ డాక్టరు పొన్నా లీలావతమ్మగారు "లోక వ్యవహారంలోని జాజర పాటల్ని రెండు విధాలుగా వర్గీకరింపవచ్చు. వివిధ భావాత్మకాలు, శృంగార పూరితాలు" అని విభజించిరి. (అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు - పుట. 45)

"ఒల్లని నినుగని వుడికేను నీ
చిల్లర చేతల జమిడేను
కల్లగంధవొడిగా గేనుపై
జల్లకు చల్లకు జాజర" అనే అన్నమయ్య సంకీర్తనంలో గంధపు పొడిని ప్రేయసిపై ప్రియుడు చల్లుటను వర్ణించబడింది. జాజర పాటలు పాడుతూ పరిమళ ద్రవ్యాలు చల్లుకుంటారని వెల్లడవుతుంది.

జాజర పాటలు వసంతకాలంలో పాడుట ప్రసిద్ధి అని శబ్దరత్నాకరం చెబుతుంది. "జాజర, జాజర అను పల్లవితో పాటలు వసంతకాలమున పాడుట సంప్రదాయ సిద్ధమే. శ్రీతిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులలో ప్రథములగు తాళ్ళపాక అన్నమయ్యగారు తమ శృంగార సంకీర్తనలలో నీజాజర పల్లవిగా గల పాటను రచించి యున్నారు"[31] అని పేర్కొంటూ తాళ్ళపాకవారి క్రింది చరణములను ఉదాహరించిరి.

---

31. శబ్ద రత్నాకరము : పుట 842 : 1969 ప్రచురణ

మొల్లలు దురుమల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపము నా
జల్లనపుప్పొడి జారగపతిపై
చల్లిరతివలు జాజార

ఈ జాజర పాటలను జాజరీ, జాజరి అనుపల్లవితో తెలంగాణ మందు వ్యవసాయ కూలీలు నేటికి పాడుచుండుట కలదంటూ సురవరం ప్రతాపరెడ్డిగారు వరంగల్ జిల్లా మానుకోట తాలూకాలోని ఒక పాటను ఉదాహరించిరి.

"జాజీరి జాజీరి జాజీరి పాపా
జాజులాడవె గాజుల పాప
తూర్పుమండి వచ్చెరా తుప్పతలనక్కా
పడమటినుండి వచ్చెరా పర్వతాలనక్కా
ఆ నక్క యీనక్క తోడెరా బొక్కా"32

పోతనామాత్యుడు : పోతన భాగవతంలో గోవిందు పాటల్ని, ఊయెల పాటల్ని గూర్చి ప్రస్తావించాడు.

చూడుడు నా కళ్యాణము
పాడుడు గోవిందుమీది పాటలు దయతో
నాడుడు వారి భక్తుల కథ
లే దహములలోన ముక్తికేగగ నిచ్చటన్"33

గోవిందు పాటల్ని గూర్చి డాక్టర్ బి. రామరాజుగారి అభిప్రాయాన్ని పరిశీలిద్దాం. "గోవింద నామములమ పేరు ఈ పాటలలో ప్రతిచరణము చివర గోవిందాయను పదముండుట వలన గలిగినది. స్త్రీలు (అధికముగా వితంతువులు) గోవింద నామ స్మరణము చేయుచు రామాయణగాధను చెప్పుకొను పాటలివి"34 గోవిం

32. ఆంధ్రుల సాంఘిక చరిత్ర పుట-80 ఆంధ్ర సారస్వత పరిషత్తు
33. ఆంధ్రమహా భాగవతము. 10-505
34. తెలుగు జానపద గేయ సాహిత్యం : పుట 92

దుని మీద పాడిన పాటలైనా రామాయణ సంబంధి పాటలైన విష్ణుతత్త్వమును ప్రతిపాదించునవే కదా !

'ఊయెల పాట' అని పేర్కొనక పోయినా యశోదను వర్ణించు సందర్భంలో బాలుడైన శ్రీకృష్ణుని జోకొట్టి పాటలు పాడెడిదని పోతన్న వ్రాశాడు :

"బాలు నంకించి పాడెడి పాటవలన
దరవులిగురొత్త బెరుగింత దరువ జొచ్చె"[35]

శ్రీనాథుడు :- శ్రీనాథుకు భీమేశ్వర పురాణం, శివరాత్రి మాహాత్మ్యం, పల్నాటి వీరచరిత్రలోనూ జానపద ధోరణుల్ని ప్రవేశపెట్టాడు. అందుకే కాటోలు శ్రీహరి ఆదిశేషవుగారు శ్రీనాథ మహాకవిని జానపద కవి అని పేర్కొన్నాడు. "శ్రీనాథుని జానపద కవులలో చేర్చినందుకు కొందరు విమర్శకులు తమ అనంగీకారమును వెలిబుచ్చారు. కాని జానపదులు రచించినవీ, జానపదులకోసం రచితమైనవీ జానపద రచనలనుట ఉచితమని నా అభిప్రాయము. అందువలన శ్రీనాథుని విద్వత్కవులలో విద్వత్కవియనీ, జానపద కవులలో జానపదకవియనీ పరిగణించుట సబబని నా యుద్దేశము"[36]

శ్రీనాథుడు 'భీమేశ్వర పురాణము'లో యక్షగానాన్ని, జాజరపాటను పేర్కొన్నాడు. వ్యాసాదులు దక్షారామములో ప్రవేశించు సందర్భంలో దక్షారామమును వర్ణిస్తూ యక్షగానాన్ని ప్రస్తావించాడు;

"కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు
గాంధర్వమున యక్షగాన సరణి"[37]

యక్షగానానికి సంబంధించిన గేయభేదము తెన్నో శ్రీనాథుని కాలానికి బహుళ ప్రచారం చెందాయని ఊహింపవచ్చు.

భీమేశ్వర పురాణములోనే వసంతర్తు వర్ణనంలో జాజర పాటను పేర్కొన్నాడు :

---

35. ఆంధ్ర మహాభాగవతము - 10-854
36. జానపదగేయ వాఙ్మయ పరిచయము పుట-7, 1967
37. భీమేశ్వర పురాణము 3-65

"జాదుర జాదురంచు మృదు చర్చరి గీతులు వారుణీ రసా
స్వాదయ దాతిరేకముల జంద్రిక కాయగ దక్ష వాటికా
వేదుల మీదటన్ గనక వీణలు మీటుచు బాడిరచ్చరల్
మోద మెలర్పగా భువన మోహన విగ్రహ భీమనాథునిన్"[38]

జాదుర జాజర ఒకదేనని శబ్దరత్నాకరము సూచిస్తుంది. "తెలుగున జాదము, జూజము - విరవాది, విరవాజి - జాది-జాజి మొదలైన పదములవలె జాదర జాజర అయినది"[39]

నాచన సోమనాథుడు జాజర పాట బ్రాహ్మణ వీట ధాణించెనని పేర్కొనగా శ్రీనాథుడు అప్సరసలు పాడిరని చెప్పెను. వసంతకాలంలో భీమేశ్వరునికి మోదం కలిగించుటకై అప్సరసలు పాటను (జాజర) పాడుచుండిరి. ఈ జాజర పాటను తెలంగాణ ప్రాంతంలో నేటికి పాడుచుండడం గలదని పూర్వమే ఉదాహృతం.

'శివరాత్రి మాహాత్మ్యము'లో శ్రీనాథుడు ఎత్తిలి, పంజళము, ధవళ గీతాల్ని పేర్కొన్నాడు. గర్భవతియైన సుశీలకు సీమంత పుంసవనాలు జరిపిన సందర్భంలో పట్టణంలోని ప్రజలు నృత్యం చేస్తూ పాటలు పాడిరని వర్ణించబడింది.

"వేడ్క నృత్యంబు లాడిరి వీధులందు
బాడిరెత్తిలి, పికకుహూ పంచవమున
బంజళంబున ధవళ ప్రబంధగీతి"[40]

పై పద్యంలోని "ఎత్తిలి ఒక విధమగు దేశిగానమని తోస్తున్నదని"[41] సురవరం ప్రతాపరెడ్డి గారు పేర్కొనిరి. "పంజళము" అనగా 'పంచాలి' అని శబ్దరత్నాకరం అర్థాన్నిచ్చింది. "పాంచాలి గీతికా విశేషమని"[42] సురవరం ప్రతాపరెడ్డి

38. భీమేశ్వర పురాణము 6-108
39. శబ్దరత్నాకరము పుట - 842 - 1969
40. శివరాత్రి మాహాత్మ్యము 2-64 ఆంధ్ర సారస్వత పరిషత్తు 1968
41. ఆంధ్రుల సాంఘిక చరిత్ర : పుట 174 ఆంధ్ర సారస్వత పరిషత్తు.
42. ఆంధ్రుల సాంఘిక చరిత్ర : పుట 178 ఆంధ్ర సారస్వత పరిషత్తు

గారి అభిప్రాయం. ధవళగీతాల గురించి పలువురు విమర్శకులు నిర్వచించారు. శబ్దకల్పద్రుమంలో.

"ధవళః రాగవిశేషః పరతమతే
హిందోళ రాగస్య అష్టమ పుత్రః
ఇతి సంగీత శాస్త్రమ్" అని చెప్పబడింది. ధవళముల గూర్చి ఆచార్య యస్వి జోగారావుగారి అభిప్రాయమిది : "ఇది యొక మంగళగీతము. ప్రాచీన కాలమునుండియు బహు యక్షగానములందు ప్రయుక్తమగుచు వచ్చినది. ముత్తైదువలు హారతిపట్టు సందర్భమున గన్పట్టును. దీనినొక హారతి పాట యనవచ్చును. ధవళ శబ్దమునకు కర్పూర విశేషమనియు నర్థము. కర్పూరము తెల్లనిది. ఆరాత్రిక ముఖ్యద్రవ్యము. అందులకే హారతి పాటలకును ఆ పేరు వచ్చియుండును."43

"ధవళగీతాలు జయాన్వితంగా వుండడం, ఆశీర్వాదాత్మకంగా వుండడం వివాహ సమయాల్లో పాడబడడం షష్ఠ్యంతాలుగా వుండడం"44 అనేవి ధవళ గీతాల లక్షణాలుగా డాక్టర్ పొన్నా లీలావతమ్మగారు పేర్కొనిరి. పద కవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యుడు ధవళాల్ని రచించి కీర్తన చేయడం జరిగిందని విమర్శకుల అభిప్రాయం.

శ్రీనాథుడు కాశీఖండంలో కూడా 'పంజళము'ను పేర్కొన్నాడు.

"పాడిమెచ్చించె నొకయింతి పంజళమున"45

**పెదపాటి ఎఱ్ఱనార్యుడు :** 'మలహణ చరిత్ర'లో మల్హణ పుష్పగంధులు శ్రుతిగూర్చి పదములు, చిందులు, గీతప్రబంధాల్ని పాడుకొందురనీ, దేశీ రచనలని పేర్కొనబడ్డ మంజరుల్ని, ద్విపదల్ని చదువుకొందురని క్రింది పద్యంలో వర్ణించబడెను :

"స్వరమండలంబును జంత్రంబు నొకవేళ
నింపుమీఱగ వాయించు చుంద్రు

43. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర పుట- 334
44. అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు - పుట 122
45 కాశీ ఖండము. 6-265 వావిళ్ళ ప్రతి

కిన్నెరవీణెయు గేలిమై నొకవేళ
ముట్టి చూతురు జగన్మోహనముగ
సొంపుదండెలు శ్రుతిగూర్చి యొకవేళ
పదములు జిందులు బాడుకొంద్రు
గీత ప్రబంధముల్ కేళికిక్కిణి పంతు
లనుకొందు రొకవేళ మనములలర

నార్యవృత్తంబులును జూర్ణికావళియును
మంజరులు ద్విపదలును సమంజసముగ
జదువుకొనుచుందు రొకవేళ సరసలీల"[46]

**పాలవేకరి కదిరీపతి :** శుకసప్తతిలో సువ్వాలు, శోభనములు, ధవళములు, గొబ్బిపాటలు, జోలపాటలు, ఏలపాటలు సందర్భానుగుణంగా పేర్కొనబడ్డాయి. మంత్రసాని ఒకతె శుభవతి అనే స్త్రీకి తన అక్కరనిమిత్తమై సువ్వాలు, శోభనములు, ధవళములు మొదలైన పాటలు నేర్పినదని వర్ణించబడిన పద్యమిది :

"ఆ లలనామణి కాగ
య్యాళి యొకానొక్కవేళ నక్కఱతో సు
వ్వాలు న్శోభనములు ధవ
ళాలు న్మొదలైన పాటలం దగనేర్పున్"[47]

సువ్వాలి, శోభన, దవళాలు స్త్రీలు పాడే పాటలని పై పద్యాన్నిబట్టి తెలుస్తుంది. "సువ్వాల' అనగా ఆడువారు పెండ్లిండ్ల యందు 'సువ్వి' అను పదముతో ఆలాపము చేసి పాడెడు పాట" అని శబ్దరత్నాకరం తెలుపుతుంది.

సోబాన, సోబనము, శోభనము అనే మూడు పదాలు శబ్దరత్నాకరంలో కలవు. మూడింటికి వేరువేరు అర్థాల్ని ఇవ్వడం జరిగింది. 'సోబన' అనగా ఒక దినుసు పెండ్లిపాట అనీ, 'సోబనము' అనగా మంగళము అనీ 'శోభనము' అనగా

46 మలహణ చరిత్ర : పుట : 20 శృంగార కావ్య గ్రంథమండలి 1940

47. శుక సప్తతి - 1-625 ఆం.ప్ర.సా. అకాడమి 1979

గ్రహయోగము, సుందరం అనే అర్థాలుగలవు. 'శోభనము' పాటకు ఆచార్య యస్వీ జోగారావుగారి వివరణ ఇలా ఉంది :

"దాని పేరే చెప్పుచున్నట్టిది యొక శోభన గీతము తఱచు వివాహ సందర్భంములందు మంగళహారతుల వేళను, మంగళ స్నానాదిక సమయములందు ప్రయుక్తమునైనది తఱచు ధవళము తోడి జంటపాటవలె గన్పట్టును. ఇది యాదువారి వేడుకపాట. కాని విష్ణుమాయా విలాసమున "తాళ ధ్వనితో నెమలు నటియింపుచు వీణాముని నారదుడు శోభనము వినిపించెన్" అనియున్నది. ఇది సాధారణముగా షష్ఠ్యంతము. చివర 'శోభనమే' అనునదూతపదముగా వచ్చుచుండును. దీని రచనా ప్రక్రియకొక నియతిలేదు. గతి వైవిధ్యము బహుళము."[48]

ధవళాలను గూర్చి పూర్వమే చర్చించబడింది. మరొకచోట కూడా "జైట జార్పులును సౌబాన పాటలు" (3-348) అని ప్రయోగం కలదు.

రెడ్డిసాని మన్మథావస్థను వర్ణించు సందర్భంలో 'గొబ్బి పాటల్ని పేర్కొనెను :

"బెళుకునందములు గొబ్బిళ్ళ పాటల కొప్పు
నవరించు నేర్పు చేసన్నవగలు"[49]

గొబ్బి పాటల్ని గూర్చి సురవరం ప్రతాపరెడ్డిగారు "గొబ్బి యనునది గర్భ తద్భవమై యుండును. స్త్రీలు వలయాకారముగా చప్పట్లు చరచుచు పాడు పాటల్ని గొబ్బిళ్ళు అందురని"[50] వివరించారు.

శుక సప్తతిలోనే "బాపనమ్మ పాటల"ను పేర్కొన్నాడు. బహుశా ఆనాడు బాపనమ్మల పాటకు విశేష ప్రచారం ఉండేదేమో! ఆ పద్యమిది :

"మన్నపురుషుని జెడనాడు మగువమీద
బోయి పులుగాని పురువయి పుట్టునమచు

---

48. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర - పుట 347
49. శుకసప్తతి : 2-434
50. ఆంధ్రుల సాంఘిక చరిత్ర : పుట 360

బాపనమ్మలు చెప్పిన పాటమేతె
యనుచు నేనుందు సినుదూలుకొనగ వెలవి"[51]

ఏలపాటల ప్రస్తావన కూడా కలదు.

"పీధినేగెడు ప్రౌఢవిటుఁడు పాడెడు వింత
యేల పదాలట్టె యాలకించు"[52]

కొందరు పథికాంగనలు తమ పిల్లల పాలబుగ్గలపై ముద్దాడుచు పాడిన పాటల్లో జోలపాటల ప్రస్తావన కలదు.

"అగ్గలపు నిగ్గులు గల పాలబుగ్గలపై ముద్దాడి నిద్దంబులై
వైణవడోలికల బాలకుల నునిచి జోలలు పాడుచు"[53]

అని వర్ణించాడు. ఊయెలను ఊపుచు జోల పాటల్ని పాడడం నేటికి మనం చూస్తుంటాం.

హాలాంకుడను రెడ్డి భార్య ఏకులు వడికించు సన్నివేశాన్ని వర్ణించుపట్ల 'దూది పాటల్ని' పేర్కొనడం జరిగింది :

"ప్రాయంపు పడుచుల బనిగొంటివే దూది
యనెడి పాటలదేనె చినుకులీన"[54]

తేనెచినుకులీను నట్టివే దూదిపాటలని భావం. ఈ దూది పాటలనే ఆచార్య బి. రామరాజుగారు 'రాట్నముపాటలై యుండునని'[55] అన్నారు.

**కొఱవిగోపరాజు :-** "సింహాసన ద్వాత్రింశిక"లో వేసవి కాలమును వర్ణిస్తూ వెన్నెలగుడి పాటల్ని ప్రస్తావించాడు.

---

51. శుకసప్తతి 3-148
52. శుకసప్తతి 2 - 172
53. శుకసప్తతి 3 - 450
54. శుకసప్తతి 2-422
55. తెలుగు జానపద గేయ సాహిత్యము. పుట - 58

"బనిచేసి గంజియైనను నం బత్తైనను
నెనచల్లగా ద్రాగి యెచటనైన
బడియుండి వెన్నెల గుడి పాట
వాడగా బేదలకాత్మ సంప్రీతిగలుగు"[56]

**రామరాజ భూషణుడు :** 'వసుచరిత్ర'లో జోలపాటల్ని, గొనబు పాటల్ని ప్రస్తావించాడు.

గిరిక బాల్యక్రీడల్ని వర్ణించు సందర్భంలో జోలపాట పాడుటను వర్ణించాడు.

"జాఁంకం బార్చి పొందు జలజాద్భాద పాళికగప్పి తమ్మినం
కుల దెలిదేనెలుగ్గులిడి క్రొందరగల్ గదలించు కల్పతో
బైలల గుమారు సుతును ఘటించి భజించు నదీలలాను కో
మలకుము ధాగతాళికుల మంజురవంబున జోల వాడుచున్"[57]

పసిపిల్లల్ని నిద్రపుచ్చడంకోసమై తల్లులు పాడేపాటల్ని జోల పాటలని అంటారు "జో అచ్యుతానంద జో జో ముకుంద రావెపరమానంద రామగోవిందా" అని చిన్నపిల్లల్ని నిద్రపుచ్చుతూ పాడడం ఇప్పటికీ మన ఇండ్లలో చూస్తూనే ఉన్నాం. జోల పాటలను గూర్చి ఆచార్య రామరాజుగారు" గృహశ్రీ కవనమున జోల పాటలు ముఖ్యములు. లాలి పాటలు పిల్లల నాడించుటకును, జోల పాటలు పిల్లల జో కొట్టి నిద్ర పుచ్చుటకును పాడెదరు ఇవి శంకరాభరణ, నవరోజు, ఆనంద భైరవి, శ్రీరాగము లందుండునని అన్నారు.[58]"

మరో పద్యంలో గొనబు పాటల్ని పేర్కొన్నాడు.

"గొనబు పాటలు నేర్పు గుముదర సామోద
సామోద మధుపకుద్ధాంత సమితి" (8-28)

---

56. సింహాసన ద్వాత్రింశిక 9-5

57. వసుచరిత్ర 3-27, శేషాచలం అండ్ కో.

58. తెలుగు జానపద గేయ సాహిత్యము - పుట 472

'గౌనబు' అనగా 'మనోజ్ఞము' అనే అర్థాన్ని శబ్దరత్నాకరం సూచిస్తుంది. మనోజ్ఞమైన పాటల్ని పాడి ఆనందింపజేసే వారేమో

**పింగళి సూరన :—** 'కళాపూర్ణోదయము' నందు పల్లెపాటల్ని, పెండ్లి పాటల్ని, జోల పాటల్ని సందర్భానుగుణంగా ప్రస్తావించాడు. జా. బవతి వీణ ముట్టి వాయిస్తూ పాడిన పాటల్ని ఇలా వర్ణించాడు

"గ్రామ విశేష మూర్ఛనలేరు పడ మంద్ర
మధ్యమతార సామాగ్రి దనర
ధాతు మాతువులు గీత ప్రబంధములందు
నసమాన లీలమై నతిశయిల్ల" 59

"గ్రామ విశేషమూర్ఛనలు" అనగా పల్లెపాట విశేషమలని అర్థం చెప్పుకోవచ్చు.

మధురలాలసను నిద్రపుచ్చుటకై తల్లిదండ్రులు జోల పాటలు పాడిరట,

"పొలుపుగ దన్నువే నిదుర పుచ్చుటకై తమ తల్లిపైడి యు
య్యల నిడియూచ చో గువలయాధిపు పాటలు పాడినంగరం
బలరుచు గేరికేరినను నన్యుల పాటలు పాడినంగరం
బలయు నేడ్చులోకులవురాపతి భక్తి యటంచు నవ్వగన్" 60

కువలయాధిపుడైన చంద్రుని పాటలు పాడితే బాలిక సంతోషంతో కేరింతలు కొడుతుందని వర్ణించడాన్ని బట్టి చూడగా జోలపాటలు చంద్రునికి సంబంధించి నవై కూడా ఉంటాయని ఊహింపవచ్చు.

మధురలాలస కళాపూర్ణుల వివాహాన్ని వర్ణించే ఘట్టంలో పుణ్య స్త్రీలు పెండ్లి పాటల్ని పాడిరని చెప్పబడింది.

మంగళ సూత్రము గట్టెగు
రంగాక్షి నలతనంగ రాజేంద్రుడు పు

---

59. కళా పూర్ణోదయము 2-37

60. కళాపూర్ణోదయము 6-195 ఆం.ప్ర.సా. అకాడమి

జ్యాంగనల పెండ్లి పాటలు
మంగలికోళ్ళ మృదుగీతి మధురిమ నెనయన్"[61]

పెండ్లికి సంబంధించిన పాటలు ప్రచారంలో కలవు. ఆచార్య బి. రామరాజు గారు కొన్ని పెండ్లి పాటల్ని ఇలా వివరించారు." కల్యాణ పాటలు, గంధం పాటలు, కొట్నాల పాటలు, తలుపుదగ్గర పాటలు, బంతులాట పాటలు, బువ్వము పాటలు, వధూవరుల పాటలు, అలుక పాటలు, ముఖము కడుగుపాటలు, కట్నాల పాటలు, పతిభక్తి పాటలు, మిధున విడెముల పాటలు, అవిరేణి పాటలు, అప్పగింతల పాటల వంటివిగాక ప్రతిచిన్న విషయమునకు అనగా పసుపునకు, తిలకమునకు తలంటుకు, ఊయెలకు, వసంతము లాటకు, పానుపుకు కూడా పాటలు పాడుదురు."[62]

"ప్రభావతీ ప్రద్యుమ్నము"లో సూరన ఏల పాటల్ని పేర్కొన్నాడు.

"నానా తాళములు యథోక్త స్ఫూర్తి
బరగు నేలాది ప్రబంధచయము"[63]

**ముక్కుతిమ్మన :-** "పారిజాతాపహరణము"లో యక్షజాతి ప్రజలు 'మేళము'గా నేర్పడి పాటలు పాడుచున్నారని వర్ణించెను.

"యక్షులు వీరలో యతివ ! మేళము గూడి
పాడుచుందురు దిక్పాల సభల"[64]

'మేళము' అనగా గుంపుగా కలిసి ఆడుటలేదా పాడుట అని అర్థం. 'భోగము మేళము' అని ఒకప్పుడు ప్రచారంలో ఉండేది. ఇప్పటికీ కర్ణాట ప్రాంతంలో గొరవయ్యలు గుంపులుగా చేరి పాటలు పాడుతూ నృత్యం చేయుటను 'గొరవ మేళ' అని పిలుస్తారు.

---

61. కళాపూర్ణోదయము 7-75 ఆ.ప్ర.సా. అకాడమి
62. తెలుగు జానపద గేయ సాహిత్యము పుటలు 477, 478
63. ప్రభావతీ ప్రద్యుమ్నము 4-99 వావిళ్ళ వారి ప్రచురణ
64. పారిజాతాపహరణము 2-93

**చేమకూర వేంకటకవి :-** 'విజయవిలాసము'లో ధవళములను, ఐరేని పాటలను ప్రస్తావించడాన్ని బట్టి చూడగా ఆనాటి కాలంలో అవి బహుళ ప్రచారంలో ఉండేవని చెప్పవచ్చు. మణిపురంలో వనవిహారం చేయుచున్న రాజ తనయుల చేష్టల్ని వర్ణించు సందర్భంలో ధవళగీతాల ప్రస్తావన కలదు :

"మంగళ స్నాన సంభ్రమము దెల్పెడిరీతి
గెలన గెందామర కొలనదేలి
ధవళముల్ విని చొక్కు హవణుదెల్పెడు లీల
హొళి గోయిల పల్కులాలకించి" 65

సుభద్రార్జునులను పెండ్లికొడుకు పెండ్లికూతురుగ అలంకరిస్తూ ధవళములు పాడిరని వర్ణించాడు;

"కట్టిరి మంచిలగ్నమున గంకణముల్ కరపంకజంబులం
బెట్టిరి మేనులన్నలుగు మేలి మృగీమద కుంకుమంబులం
జుట్టిరి కైశికంబుల విశుద్ధ మనోహర పుష్పమాలికల్
పట్టిరి పేరంటాండ్రు ధవళంబులు పాడుచు సుల్లభంబులన్" 66

పేరంటాండ్రు పెండ్లి సమయంలో పాడిరని చెప్పడంవల్ల ధవళములు పెండ్లి పాటలకు సంబంధించినవని ఊహింపవచ్చు.

సుభద్రార్జునుల వివాహవర్ణన సందర్భంలోనే మరోచోట ముత్తైదువలు ఐరేని పాటలు పాడుచు ఐరేనికుండలు తెచ్చిరని వర్ణించబడింది.

"ఐరేని గొనివచ్చి రైదువుల్ పాటలు
పాడుచు శుభవేళ వేడుకలర" 67

అవిరేణి, ఐరేని రూపాంతరాలు. అవిరేణి పూజను గూర్చి ఆచార్య బి. రామరాజు ఇలా వివరించారు. "బ్రాహ్మణేతరులందరిలోను అవిరేణుల పూజించుట కలదు.

65. విజయవిలాసము 1-129 వావిళ్ళ ప్రతి 1965
66. విజయవిలాసము 3-76 వావిళ్ళ ప్రతి 1965
67. విజయవిలాసము 3-95 వావిళ్ళ ప్రతి 1965

లగ్నమునకు పూర్వమే యవిరేణుల నిల్పెదరు. ఇది లక్ష్మీ పూజ. వధూవరులకు శుభము ఆశించి చేయునట్టిది. కుమ్మరి క్రొత్త పెద్ద కుండలను అలంకరించును. కుండలపై నుండు చిత్రములం దొక్కొక్కప్పుడు పల్లకీపై నెక్కిన వధూవరులు గూడ చిత్రింపబడుదురు. పత్రములు, ఫలములు, పుష్పములు చిత్రింపబడును. లగ్నమునకు పూర్వము పురోహితునితో వధూగృహము నుండి కొందరు పోయి కుమ్మరికి కావలసినది యిచ్చి అవిరేణుల దెచ్చికొందురు. ఇంటికి తెచ్చి వానినొక చోట ధాన్యముపై నిలిపి లక్ష్మీదేవినావాహన చేయుదురు."[68] అట్లు నిలిపిన అవిరేణులను పూజించుచు పేరంటాండ్రు పాటలు పాడెదరు. వానినే అవిరేణి లేదా ఐరేణి పాటలని పిలుస్తారు. తెలంగాణంలో ఈ ఐరేణిపూజ ఈనాటికి పెండ్లి సమయంలో జరుపడాన్ని మనం చూడగలము.

ఇంతవరకు తెలుగు శిష్టసాహిత్యంలోని జానపదగేయ (కథారహిత) ధోరణుల్ని గూర్చి పరిశీలించడం జరిగింది.



68. తెలుగు జానపద గేయ సాహిత్యము పుట. 480

# జానపద కథాగేయాలు

గేయాలు, కథాగేయాలు రెండూ ఒకటే కాని వేరువేరు మాత్రం కావు. భావప్రధానమైనవి గేయాలు కాగా కథాంశాలు ప్రధానమైనవి కథాగేయాలు. రెండూ పాడబడేవే. ఏదో కథను ప్రధానంగా ఎన్నుకొని కథను తెలియజెప్పటకై గేయంగా పాడి విన్పించడంవల్ల వీటిని కథాగేయాలని పిలువడం జరిగింది. కథాగేయాన్ని డా. ఆర్వీయస్ సుందరంగారు ఇలా నిర్వచించారు. "వాగ్రూపమైన సంప్రదాయం కలిగి, తరతరాలుగా అనేక పాఠాంతరాలతో ప్రచారం పొంది, సామూహిక వికాసం కలిగిన కథాగేయాలే జానపద కథాగేయాలు"[1]

తెలుగు సాహిత్యంలోని జానపద కథాగేయాల ప్రస్తావనను గూర్చి పరిశీలిద్దాం.

## పాల్కురికి సోమనాథుడు

జానపద విజ్ఞాన విషయాలనెన్నింటినో తన కావ్యాల్లో ప్రవేశపెట్టినవాడు పాల్కురికి సోమనాథుడు. జానపదగేయ రీతుల్ని, నృత్యాల్ని, నృత్యభంగిమల్ని పాల్కురికి సోమన పేర్కొన్నట్లుగా మరే తెలుగు కవి పేర్కొనలేదన్న అతిశయోక్తి కానేరదు. "ఆతత బసవపురాతన భక్తగీతార్థ సమితియే మాత్రకగా" తాను బసవపురాణం రచిస్తున్నట్లు చెప్పుకున్నాడు.

'పండితారాధ్య చరిత్ర'లో శ్రీగిరి పరుసకై వచ్చిన శివభక్తులను గూర్చి సోమన వర్ణించెను. జంగమకోట్ల నడకల్ని, వృద్ధతపోధనుల నడకల్ని, మిండజంగముల, శీలవంతుల, విరక్తుల, శివయోగుల, అభ్యాసయోగుల, పుణ్యాంగనల, జోగుల, పిచ్చుకుంటుల, చెంచు ధర్మాత్ముల నడకల్ని వర్ణించు సందర్భంలో భక్తులందరునూ పాటలు పాడుచూ, ఆటలాడుచూ, శివభక్తుల కథల్ని పాటలుగా పాడుచూ పోవుచుండిరని చెప్పబడెను. కావుననే డాక్టరు నాయని కృష్ణకుమారిగారు "సోమన నాటికి శివభక్త కథలను పాటలరూపమున వెలార్చెడి పిచ్చుకుంట్లుండిరి"[2] అని పేర్కొన్నారు.

---

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పుట-266 అకాడమీ ప్రచురణ
2. జానపద గేయగాథలు - పుట-24 ఆంధ్ర సారస్వత పరిషత్తు.

'పర్వత ప్రకరణం'లో భక్తులు వివిధ కథల్ని పాటలుగా పాడేవారని వర్ణించాడు :

"..... ..... శ్రీ బసవపురాణంబు
నేలలు వెట్టంగ నింపుసొంపారు
శైలిచే గ్రాలుచు జదివెడువారు
చాతుర్యమెసగ బసవదండనాథు
గీతంబులాదిగా గీతాదులైన
సకల పురాతన చారుగీతములు
బ్రకటించి ప్రకటించి పాడెడువారు
జదువుల బాటల సంగతిలేమి
బొదలి మాటలయందు పొగడెడివారు"[3]

దండనాథుడైన బసవని కథల్ని పాటలుగా పాడుకొనెడివారని తెలుస్తుంది.

మరోచోట భక్తులు భారతాది కథల్ని తోలుబొమ్మలాటగా ఆడిపాడి వినిపించే వాళ్ళని సోమన వర్ణించాడు.

"భారతాది కథల క్రీరమబుగల
నారంగ బొమ్మల నాడించువారు
గడు నద్భుతంబుగ గంబసూత్రంబు
లడరంగ బొమ్మల నాడించువారు
నాదట గంధర్వ యక్షవిద్యాధ
రాదులై పాడెడు నాడెడువారు
వివిధ ప్రచ్ఛన్నవేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడనట్లాడు"[4]

భారతానికి సంబంధించిన కథలను తోలుబొమ్మలాటల ద్వారా ఆడుతూ పాటలు పాడుతూ నృత్యం చేయడం కన్పిస్తుంది. ఆట, పాటలతోకూడి ఉండి ప్రదర్శన యోగ్యంగా కథాగేయాలుంటాయని తెలుస్తుంది. కావుననే డాక్టరు నాయని కృష్ణ

---

3. పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణం పు-423
4. పండితారాధ్య చరిత్ర-పర్వత ప్రకరణం-పుటలు-435, 436

కుమారిగారు "జానపద గళనాళ వినిర్గతములై, యసంస్కృతములై యక్షరగణ నిబద్ధములు కానివై, కేవలము గేయగుణమును కలిగియుండుటయే కాక కించి న్నృత్త గుణమును కూడ కలిగి ప్రదర్శనార్హతను సంతరించుకొనిన కథలు కలిగినవే కథాగేయములనీ, కథకుడు కాలికి గజ్జెకట్టి చేతవాద్యములు ధరించి, వంతపాట గాండ్రు సహాయమున నావేశపూరితుడై, కించిదవయవ చాలనమున, పదవిన్యాసమును లయబద్ధముగ ప్రజాసమూహము నెదుట గానము చేయుచు"[5] అని వివరించారు.

పర్వత ప్రకరణంలో ఆంధ్రదేశము పరుసను గూర్చి వర్ణించు సందర్భంలో శివభక్తుల కథల్ని పాటల రూపంలో భక్తులు పాడుచూ నృత్యం చేస్తున్నట్లు చెప్పబడింది.

"జేదుకో మల్లయ్య చేదుకొమ్మనుచు
గనుకని పాటలు గట్టి పాడుచును
జని చని చిందుల జతుల కాడుచును"[6]

మరియు

"సంగద బసవన్న శరణని కొలుతు
బండితారాధ్య శ్రీపతి పండితయ్య
బండార బసవయ్య బాయక కొలుతు
శంకరదాసమయ్య తెంకమంచయ్య
బంకయ్య శివరాత్రి సంకయ్య శరణు
యేలేశుకేతయ్య యిండె శాంతయ్య
మోగశి మారయ్య మున్నయ్య శరణు
బాపూరి బ్రహ్మయ్య బాచి రాజయ్య
కోపూరి బ్రహ్మయ్య గొగ్గయ్య శరణు
కిన్నర బ్రహ్మయ్య కేశిరాజయ్య
కన్నడ బ్రహ్మయ్య గణదాసి శరణు

5. తెలుగు జానపద గేయగాథలు పుటలు-20, 21
6. పండితారాధ్య చరిత్రము : పర్వత ప్రకరణం పుట-370

బాచయ్య నవరద బాచయ్య బిబ్బ
బాచయ్య మడివాలు మాచయ్య శరణు
సిరిగిరి శరణు శ్రీగిరినాథ శరణు
సిరిగిరి మల్లయ్య శరణుల శరణు
అనుచు నీక్రియ నుబ్బియాడుచు బాడు
చును బేర్చిపేర్చి యుత్సుకతమైనడవ"[7]

శివభక్తుల కథల్ని పాటలుగా గట్టి పాడుచూ ఆడుచూ శ్రీపర్వతమునకు నడచు చుండిరట.

**శ్రీనాథుడు :** శ్రీనాథుని 'పల్నాటి వీరచరిత్ర' ఆంధ్రదేశంలో ప్రసిద్ధమైన వీరగాథా ద్విపదకావ్యం. అసలైన పల్నాటి చరిత్ర నేడు లభ్యమగుట లేదని విమర్శకుల అభిప్రాయం.

'పల్నాటి వీరచరిత్ర'లో బాలచంద్రుని తల్లి భారతాది కథల్ని వినమని చెప్పి విప్రులను పిలిపించి వాళ్లచేత భారత కథను వినిపించినట్లు వర్ణించబడింది.

"ఆటపాటలపైన అలసితివేని
వినవయ్య బాలుడ విశదంబుగాను
విబుధుల విప్రుల పిల్వ బంచి
వినుము భాగవతంబు విజ్ఞానమొదవ
భారత రణకథ పాటించి వినుము
భీష్మ ద్రోణార్చిన వివిధ శౌర్యముల
అచలితబుద్ధితో ఆలింపు పుత్ర
ద్రోణుండు నెరపిన దోర్బల గరిమ
మనమున బట్టింపుమానిత సుతుడ
కర్ణుండు జూపిన ఘనపరాక్రమము
సూక్ష్మబుద్ధితో జూడుమ తనయ
శల్యునియందున్న శస్త్రచాతురిని
జాగరూకతమెయి చర్చించుకొడుక

7. పండితారాధ్య చరిత్రము : పర్వత ప్రకరణం పుటలు-875, 876

దుర్యోధనుని మానధూర్వహ పటిమ
ఆసక్తి తోడుత అరయుమాత్మ జూడ
చాపంబు విడిచిన సవ్యసాచికిని
కృష్ణుడు చెప్పిన గీతలయందు
కర్మరహస్యముల్ గాంచు కుమార
నేర్చినవానిని నేరుపుమీర
దృఢ ధైర్యమున ఆచరింపగవలయు[8]

**వినుకొండ వల్లభరాయుడు :** క్రీడాభిరామంలో పల్నాటి వీరుల కథను వర్ణించడం జరిగింది. గోవిందశర్మ ఓరుగల్లులో ప్రవేశించనంత పల నాటి వీరపురుషుల పరమదైవమైన శివలింగ భవన వాటిలో వీరానీకంగా పాడుచు పలనాటి వీరుల ద్విపద ప్రబంధమును కథగా చెప్పడం విన్నాడట. సుమారు పది పద్యాల్లో పల్నాటివీరుల కథ చెప్పబడింది.

పల్నాటి వీరుల చరిత్రను తెలుపు ద్విపద ప్రబంధమును వీరానీకంగా పాడుచుండుటను వర్ణించిన పద్యాన్ని చూడుడు :

"ద్రుతతాళంబున వీరగుంభితక ధుంధుంకిటాత్కారసం
గతివాయింపుచు నాంతరాళిక యతిగ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడెనొ
క్కరత ప్రత్యక్షరముం గుమారకులు పీట్కారంబునందూలగన్"[9]

పల్నాటివీరుల కథను పాడునపుడు వాళ్లు చేయుచున్న అభినయాన్ని వర్ణించిన పద్యమిది :

గర్జించియరసి జంఘాకాండ యుగళంబు
వీరసంఘటకోల వ్రేయునొకడు
ఆలీఢపాద విన్యాస మొప్పగ వ్రాలి
కుంతాభినయము గైకొను నొకండు

---

8. పల్నాటి వీరచరిత్ర పుటలు-32, 33:2 వ భాగం
9. క్రీడాభిరామము 116 వ పద్యం. కాకతి పబ్లికేషన్స్, 1977

బిగువు గన్నుల నుబ్బు బెదరు జూపులతోడ
ఛీత్కార మొనరించు బెలుచనొకడు
పటు భుజావష్టంభ పరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాటునొకడు
ఉద్ది ప్రకటింప నొక్కరుండోల వాడు
బయలు గుబ్బుంబు భంజిల్ల బలుపు నొకడు
కొడుము దాటింపు చును బెద్దగొలువులోన
బడతి పల్నాటి వీరుల బాడునపుడు"[10]

పల్నాటి వీరచరిత్రాన్ని పల్నాటి వీర భారతం అని కూడా అంటారు. భారతంలో లాగే పల్నాటి వీరచరిత్రలో రాజ్యభాగం కోసం అన్నదమ్ములు యుద్ధం చేయడం ప్రధాన కథావిషయం. శైవ వైష్ణవ విభేదాలే పల్నాటి వీరుల యుద్ధానికి కారణమని శ్రీహరి ఆదిశేషువు గారంటారు. "వీరశైవానికే, అప్పుడే పల్నాటిలో కాలూనికొని ప్రబలమవుతున్న వైష్ణవానికే కలిగిన సంఘర్షణ కూడా ఈ వీర భారతంలో ద్యోతకమవుతుంది. ఈ శైవవైష్ణవ మత సంఘర్షణే వీర చరిత్రానికి మత ప్రాముఖ్యం కలిగేటందుకు కొంత కారణమేమోనని నా అభి ప్రాయం"[11].

అయితే పల్నాటి యుద్ధానికి కోడి పోరు, చాప కూడు సిద్ధాంతం ప్రథమ కారణాలని క్రింది పద్యం చెబుతుంది :

"అరువల్లి నాయురాలి దుర్మంత్రంబు
కోడిపోరు చాపకూటి కడుపు
ప్రథమ కారణములు పల్నాటియే కాంగ
వీర పురుష సంప్రహారమునకు"[12]

పల్నాటి వీర కుమారుల వేషధారణాన్ని గూర్చి పాడుచున్నదని వర్ణించ బడిన పద్యం ఈ విధంగా కన్పిస్తుంది :

---

10. క్రీడాభిరామము : 117వ పద్యం
11. జానపదగేయ వాఙ్మయ పరిచయము. పుట : 89, 1967 ప్రచురణ
12. క్రీడాభిరామము : 119వ పద్యం : కాకతి పబ్లికేషన్స్

"పచ్చని పిండి గంధమును బొలముసేసయు నెత్తి పూవులన్
గ్రుచ్చిన కంఠమాల్యములు గొప్పన గల్గిన వేణి బంధముల్
కుచ్చుల వీరసంబెటయు గ్రొత్త మణుంగగు కాసెపుట్టమున్
అచ్చల కెక్కినట్టి రవణంబులు వీర కుమార కోటికిన్"[13]

ధీరులైన వీర పురుషుల ఐతిహ్యాన్ని పల్లె దేశాలందు అనేక విధాలుగా చెప్పుకొందరని వర్ణింపబడిన పద్యం.

"ఇచ్చోట భుజియించి రేక కార్యస్థులై
సామంత నృపతులు చాపకూడు
ఇచ్చోట జింతించె నిచ్చనుపాయంబు
నళినాక్షి యార్వెల్లి నాయురాలు
నిజమను శుద్ధికై నిప్పుల యేటిలో
నోలలాడె నిచ్చోట బీలసాని
ఇచ్చోట బోరిరి యిల పణంబుగ గొల్ల
సవతి తల్లుర బిడ్డలవనిపతులు

ధీరులగు వారిదేవురు వీరపురుషు
లై మదోద్ధతి నిచ్చోట నాజిబడిరి
యనుచు జెప్పుదు రైతిహ్య మచట నచట
జనప పెద్దలు పల్లె దేశములందు"[14]

మగవారు సమరాగణంలో జగదేకస్తులంచు శ్లాఘింపబడగా ఆడవాళ్లు తమ ప్రఖా వంతో మగసింగాలని పొగడునట్లుగా ప్రసంగించుచుంటిరని కథకుడు చెప్పిన విషయాన్ని వర్ణించిన విధం :

"మగసింగంబులు సంగరాంగణములన్ మత్తిల్లిరున్మత్తులై
జగదేకస్తుతులంచు నేమిటికి సంశ్లాఘింప ! నా భూమిలో

---

13. క్రీడాభిరామము : 120 వ పద్యం : కాకతి పబ్లికేషన్
14. క్రీడాభిరామము : 122 వ పద్యం : కాకతి పబ్లికేషన్

జిగురుంబోడుల గాపుకబ్బెతల నక్షీణ ప్రభావంబునన్
మగసింగంబులుగా నెఱుంగుదురు పుంభావ ప్రసంగంబులన్''[15]

వీర పురుషుల చరిత్రను గచ్చుచేసి గద్దె పలకపై వ్రాసినారని చెప్పి కథ ముగించబడుతుంది :

"కోల దాపున త్రికూటి గూడియున్న
గచ్చుచేసిన చిత్రంపు గద్దెపలక
వ్రాసినారదె చూడరా వైశ్యరాజ
శిలబ్రహ్మోటి వీరనాసీర చరిత !"[16]

క్రీడాభిరామం నందే ఏకావీరాదేవి, మాహురమ్మ కథల ప్రస్తావన కలదు. "కాకతమ్మకు సైదోడు ఏకవీర" అని క్రీడాభిరామంలో చెప్పబడింది. కావున కాకతి దేవతతోపాటు ఏకవీరా దేవిని పూజించిరని చెప్పవచ్చు.

'ఏక వీరాదేవి'ని గూర్చి క్రీడాభిరామ పీఠికలో శ్రీ బి. ఎన్. శాస్త్రిగారిట్లు వివరించారు. "ఏకవీర-రేణుకాదేవి పరశురాముని తల్లి. ఆ కాలమున ప్రజలు మాహురమ్మను దేవతగా భావించి నర్చించుచు జాతరలు చేయుచుండిరి." మరియు "ఎర్రగొల్లలను వారు ఏక వీరాదేవి కథలను పాడుచుండిరని తెలియుచున్నదని" వ్రాస్తూ, ఇప్పటికీ వాడుకలో ఎర్రగొల్లలు పాడుచున్న ద్విపద ప్రబంధాల్ని పేర్కొన్నారు- అవి పరశురామ విజయము, పరశురామ రామాయణము, మాహురమ్మ కథ, ఏకవీరాదేవి కథ."[17]

ఏక వీరాదేవి కథను మాలలు కూడ చెప్పేదురని క్రీడాభిరామంలోని పద్యం వెల్లడి చేస్తుంది. మాలెత ఏక వీరాదేవి కథను చెప్పిన విధం :

"అలరుంబోడి జనంగమ ప్రమద మధ్యానద్ధ ఘంటాధ్వమల్
చెలగుంబాడె సమస్తలోక జననిన్ శ్రీ యేకవీరాంబికన్

---

15. క్రీడాభిరామము : 124 వ పద్యం
16. క్రీడాభిరామము : 125 వ పద్యం
17. క్రీడాభిరామము : పీఠిక : 42-పుట

వలరాజాకొక్క మూర్ఛనా స్వరమునన్ ప్రాణంబు గల్పింపగా
గలకంఠీకల కంఠకోమల కుహూకారంబు తోరంబుగన్"18

ప్రజలందరూ ఆనంద భావంతో తాళాల్ని జవనికల్ని వాయిస్తూ ఏక వీరమ్మను, మాహురమ్మను పూజిస్తారని, క్రిందిపద్యం వర్ణిస్తుంది.

"అకలంకస్థితి గోరి కొల్చెదరు బ్రహ్మానంద భావంబునన్
సకలానందమయైక మాతలగుచున్ సంతోషచిత్తంబునన్
తకదుందుమ్ములు తాళముల్ జవనికల్ తందానతమ్మ యమ్మకున్
ఏకవీరమ్మకు మాహురమ్మకు నథో హ్రీంకార మధ్యాత్మకున్"19

ఏకవీరాదేవి ఎదుట నిలుచుండి పవనీల చక్రవర్తి పరశురాముని కథను పాడెనట.

"అక్షు నిక్షిప్త వికస్వర స్వరవిలా
సశ్రీనివాసంబు జవనికందు
గట్టిన తంత్రికి గంత్రశ్రుతికి గూడ
జొక్కంబుగా నారిసొబగు మీఱ
నాలాపముల శుద్ధ సాళవ సంకీర్ణ
వివిధ రాగంబుల చవులు చూపి
ధమ ధమ ధ్వనుల బొటారించి యెడ నెడ
గత్తెర మార్గంబు బిత్తరిల్ల
వాద్య వైఖరి గడునెఱవాది యనగ
నేక వీరా మహాదేవి యెదుట నిల్చి
పరశురాముని కథలెల్ల ప్రౌఢిబాడె
జారుతర కీర్తి బవనీల చక్రవర్తి"20

"పవనీలకే బైండ్ల, పంబల అనియు పేరులున్నవని"21 "పరశు రాముని

18. క్రీడాభిరామం : 131 వ పద్యం. కాకతి పబ్లికేషన్స్ 1977
19. క్రీడాభిరామం : 132 వ పద్యం. కాకతి పబ్లికేషన్స్ 1977
20. క్రీడాభిరామం : 130 వ పద్యం. కాకతి పబ్లికేషన్స్ 1977
21. తెలుగు జానపదగేయ సాహిత్యము పుట-799

కథకే ఎల్లమ్మకథ అనియు రేణుకా కథ యనియు పేరు"[22] అని డా॥ రామరాజు గారు పేర్కొన్నారు.

జక్కుల పురంధ్రి "కామవల్లీ మహాదేవి" కథను పాడుచున్నదని క్రీడాభిరామంలో వర్ణించబడింది. గోవిందశర్మ ఏకవీరాదేవికి మ్రొక్కి ముందుకుపోగా జక్కులవనిత కామవల్లీ మహాలక్ష్మి కథను చెప్పుటను చూశాడట. 'కామవల్లీ మహాలక్ష్మి' కథను క్రీడాభిరామపీఠికలో ఇలా చెప్పబడింది. "ఈమెను కామేశ్వరి యని పిలుతురు. ఈమె లక్ష్మీదేవి అంశమున వెలసినదేవత. కామవల్లి యంశమున రుక్మిణీదేవి జన్మించినట్లు చెప్పుదురు. ఏడుగురు అక్కచెల్లెండ్రలో ఈ కామేశ్వరి చిన్నది. బ్రాహ్మణాదివర్ణములలో ననేకులకి కామేశ్వరి ఇల వేల్పుగా నున్నది. వీరి గృహములందు వివాహాది శుభకార్యములు జరిగిన వెంటనే "అక్కల కొలుపు" జరుగును. నేటికిని ఈయాచారమనేకుల యిండ్లలో నున్నది. ఉద్రేక జనకమైన గాన ఫణితిని, వీరవాద్యములతో కామేశ్వరీదేవి పాటలు పాడుదురు. ఏడుగురు ముత్తైదువుల కర్చన జరుగును. జక్కులవాండ్రీ కామవల్లి కథను కోవెలలందు పాడి ప్రజావినోదము కల్గించుచుండిరి"[23]

జక్కుల పురంధ్రి రాగం నుండి మరోరాగానికి లఘించుచూ కామవల్లీ మహాలక్ష్మి విష్ణువుల వలపును పాడుచుండెనని క్రింది పద్యంలో వర్ణించాడు :

కోణాగ్ర సంఘర్ష ఘుమఘుమ ధ్వనితార
కంఠ స్వరంబుతో గారవింప
మసిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను
కొదుపుచే దాటించు నెడపదడప
శ్రుతికి నుత్కర్షంబు జూపంగవలయు చో
జెవి త్రాడు బిగియించు జీవగట్టి
గిల్కుగిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళ మానంబుతో మేళవింప

22. తెలుగు జానపదగేయ సాహిత్యము : పుట 799

23. వి. ఎస్. శాస్త్రి. క్రీడాభిరామం పీఠిక. పుటలు-43, 44

రాగమున నుండి లంఘించు రాగమునకు
సురుచు యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటబారి
వలపువాడుచు వచ్చె జక్కులపురంధ్రి"[24]

కామేశ్వరిదేవికి అక్కచెల్లెండ్రు ఆమెతో కలిపి ఏడుగురు. అక్కలలో చివరిదైన కామేశ్వరిని వర్ణించుచున్న కథను కవి పద్యంలో ఇమిడించిన విధాన్ని పరిశీలించండి :

"ముద్రికామాణిక్యముల దీప్తి కెంగేలి
పించెంబు గుంచెతో బిత్తరింప
నుపవాసమున దద్దయును సన్ననగు కౌను
చనుదోయి భరమున జలదరింప
దోక చుక్కలబోలు తోరంపు దెలికన్ను
లావైళమున సిగ్గు నతకరింప
నిద్దంపు వెలపట్టు నెఱిక దూలినయప్డు
తొడల మించులు వెలి దొంగలింప
సురుచు చప్పుళ్ళకును బిల్లదురుల మ్రోత
కంతకంతకు బేరుబ్బు నావహింప
నాడె బీటలపై నోలి గూడియున్న
యక్కలేడుర్వరలో నొక యలరుబోడి"[25]

అక్కలు ఏడుమంది కలిసి మిక్కిలి వేడ్కతో నృత్యములాడుటకు ప్రారంభించిరని వర్ణింపబడిన పద్యం :

"హరహర యింత యొప్పునె మహారభటిన్ జగఝుంకృతస్వన
న్మరళి విమిశ్రితాంకరవ మూర్ఛల జిత్తము లుబ్బియక్క తే

---

24. క్రీడాభిరామము 136 వ పద్యం
25. క్రీడాభిరామము 137 వ పద్యం

డుత్తరునదె యాడ జొచ్చిరి కడుంగడు వేడ్క సమున్న మత్పయో
ధరయుగ భారభీరుతమ తన్వవలగ్నముతైన నృత్యముల్"[26]

సంతానము కోరినవాళ్ళు, ప్రతిబంధకాల్ని తొలగించుకొనుటకై కామవల్లీ మహాలక్ష్మి కథను చెప్పింతురని గోవిందమంచన శర్మ తన స్నేహితునితో చెప్పిన మాటల్నిబట్టి గ్రహింపవచ్చును. "ఇదే యీ యింటి యజమానుండు సంతాన కాంక్షియై ప్రతిబంధనోదనార్థంబు యక్ష కన్యలం బరీక్షారాధనంబు సేయుచున్నవాడు గావలయు. మాణిభద్రకులోద్భవులైన దేవతలు కామవల్లీ శ్రీ మహాలక్ష్మితో గూడి యపేక్షిత కార్యంబుమనకు నవ్యాక్షేపంబునం జేయుదురు గాక యనుచు విశ్వాసంబుతో నమస్కారంబుసేసి"[27]

**రామరాజ భూషణుడు :** 'వసుచరిత్ర'లో గిరికను గీతాల్ని పాడటం లోనూ, గీత ప్రబంధాల్ని పాడటంలోను వసురాజు విశారదగా చేశాడని వర్ణించాడు :

అన్నగ శేఖరుండును మహామణి కూట సమర్పణంబుచే
గిన్నెర కోటులన్నిటిపి గేయ విశారద జేసే గూతునుం
గిన్నెర మీట వీణ బలికింపగ గీతములుం బ్రబంధము
ల్వెన్నియ బాడ జెప్పినని వారిత చాతురిగల్గునట్టుగాన్"[28]

గీత ప్రబంధములన్నా గేయకథలనీ లేదా కథాగేయాలని భావింపవచ్చు.

**అయ్యలరాజు నారాయణామాత్యుడు :** "హంస వింశతి"లో కాటమరాజు కథను గూర్చి ప్రస్తావించాడు. "తెలుగువీర కథా వాఙ్మయంలో కథా విషయాన్నిబట్టి అతి ప్రాచీనమైంది కాటమరాజుకథే. నెల్లూరి మండల శాసన సంచయములో కాటమరాజుకీ, నుమసిద్ధికి క్రీ॥శ॥ 1170 ప్రాంతంలో యుద్ధం జరిగినట్లు కనిపిస్తోంది."[29] అని శ్రీహరి ఆదిశేషువుగారి అభిప్రాయం. కాటమరాజు కనిగిరిని పాలించే యాదవరాజు మహాపరాక్రమశాలి. మనుమసిద్ధి

26. క్రీడాభిరామము – పద్యం – 138
27. క్రీడాభిరామము – వచనం – 139
28. వసు చరిత్ర : 3–33.
29. జానపదగేయ వాఙ్మయ పరిచయం. పుట–28

నెల్లూరును పాలించేవాడు. పాలగొండ, నల్లమల మొదలైన అడవుల్లో యాదవ రాజు తన పశువుల్ని మేపుకొనెడివాడు. దానికి ప్రతిఫలంగా కొంత పుల్లరిని ఇచ్చేట్లు ఒప్పందం చేసుకొన్నాడు సిద్ధిరాజుతో. మనుమసిద్ధి మనుష్యులవల్ల తన గోవులకు నష్టం కలిగిందని తలంచి కాటమరాజు పుల్లరి ఇచ్చుటకు నిరాకరిస్తాడు. దానివల్ల మనుమసిద్ధికి, కాటమరాజునకు యుద్ధం జరుగుతుంది.

గుంటూరు మండలంలో పల్నాటి వీర చరిత్రకు ప్రజల్లో ఎంత ప్రాచుర్యం కలదో అట్లే నెల్లూరు మండలంలో కాటమరాజు కథకు అంతప్రసిద్ధి కలదు. "కాటమరాజు కథను మాదిగలలో నొకతెగవారగు కొమ్ము వారును, గొల్లల నొక తెగవారగు పిలికివారును ప్రచారము చేయుదురని శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారన్నట్లు ఆచార్య బి. రామరాజుగారు తమ 'తెలుగు జానపదగేయ వాఙ్మయము' నందు ఉదాహరించిరి (పుట. 225) శ్రీ రామరాజుగారే "తెలంగాణమున ఎఱ్ఱ గొల్లలును మందుచ్చవారును. బీరన్నలను వారును కాటమరాజు కథను చెప్పెదరని"[30] పేర్కొనిరి. కాటమరాజు కథను శ్రీనాథుడు ద్విపదగా వ్రాసెనని దాని ననుసరించియే గుఱ్ఱం కొండభక్తవత్సకవి కాటమరాజు కథను పద్య ప్రబంధముగా వ్రాసెనని ఆచార్య బి. రామరాజుగారు తమ సిద్ధాంత గ్రంథంలో ఉదాహరించారు (పుట. 328-329).

'హంసవింశతి' యందును గొల్లలు విజయుడను గొల్లవాని యింటికి వచ్చి కులముపెద్దల కథను చెప్పిరని వర్ణించెను. గొల్ల కులమునకు పెద్ద కాటమరాజే కావచ్చు. కాటమరాజు కథను చెప్పుటను సుద్దులు చెప్పుట అని కూడా అంటారు. 'గొల్ల సుద్దులని' ప్రసిద్ధికూడా. సుద్దులు చెప్పు గొల్లల వేషధారణను కడు రమణీయంగా నారాయణకవి క్రింది పద్యంలో వర్ణించాడు :

"కొమ్ములు వీరణాలు జిగిగుల్కెడు వ్రాతల కృష్ణలీలం
గ్రమ్ము గుడార్లు వీరుడగు కాటమరాజు కథానులాపనల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిక కట్టు రుమాలలున్ నెఱా
నొమ్ములు సాముముల్ నెలయు సుద్దుల గొల్లలు వచ్చి రెంతయున్"[31]

---

30. తెలుగు జానపదగేయ సాహిత్యము. పుట-225
31. హంస వింశతి. 2-89 ఆం. ప్ర సా. అకాడమి 1977

అట్లు వచ్చిన గొల్లలు వీరణాలు వాయిస్తూ, కొమ్ముల్ని ఊదుచు కృష్ణున కతి భక్తితో నమస్కరించి కాటమరాజు కథను చెప్పినట్లు వర్ణించాడు :

ఫెళఫెళ వీరణాల్ ఖళి ఫెళివాయించి
పోటు బో గొమ్ములు నాట నూది
దొనకొండ గంగను దొంతర సన్నుతి చేసి
కృష్ణున కతిభక్తి గేలుమోడ్చి
యాది కాలపు గొంగ్రదనందఱ గొనియాడి
తాత తండ్రుల పేళ్ల తలచిపొగడి
బిరుదుల నరుదుగా బేర్కొని మొదయించి
దీవించి వీరుల త్రోవలెన్ని
కులము పెద్దల కతలాము కొనగ జెప్పి
సివము పుట్టించి పుత్రుల జెందగలరు
వీరులను గొల్వుదని తెల్పి వీడుకొల్ప
జనిరి సుద్దుల గొల్లలు సంతసిల్లి"[32]

పాలవేకరి కదిరీపతి : "శుకసప్తతి"లో పవనీడు చెప్పిన కథల్ని, జోగు చెప్పిన 'పరశురాముని కథ'ను ప్రస్తావించాడు.

శుక సప్తతిలో బ్రాహ్మణస్త్రీ కథలు చెప్పడంలో నేర్పరని పొగడుతూ విక్రమార్కుడు బ్రాహ్మణ స్త్రీని కథలు చెప్పుమని అడిగినట్లు వర్ణించాడు.

"తెరమఱుంగున గూర్చుండి తేనె వాన
ప్రబల గథ జెప్ప నేర్చి బాపనమ్మ !
యిప్పుడైనను దెల్పుమా యేలనవ్వొ
బక్క మీనము లనుడు నప్పడతి పలికె"[33]

మరో సందర్భంలో హాలాకుందను రెడ్డి యింటికి వచ్చిన పవనీలుని వర్ణించిన పద్యమిది :

---

32. హంస వింశతి. 2-89 ఆ. ప్ర. సా. అకాదమి 1977
33. శుకసప్తతి : 3-432 ఆ. ప్ర. సా. అకాదమి 1979

"దుసికిల జాఱుకోరసిగ దుప్పటినీటు లలాట పట్టికం
బొసగు విభూతిపై బసుపు బొట్టును దొట్టిక కల్లుచొక్కవె
క్కసముగ నెఱ్ఱవాఱిన వికారపు జూపులుగా గనంబడ
న్వెస జనుదెంచె నొక్క బవనీడు తదీయ సమీప భూమికిన్"[34]

క్రీడాభిరామంలో ఏకవీరాదేవి ఎదుట నిలుచుండి పరశురాముని కథను చెప్పింది పవనీలుడే. అట్లు వచ్చిన పవనీడు జమలికను వాయిస్తూ వలయాకారంగా తిరిగెనని వర్ణించాడు :

"వచ్చి జమిలిక వాయించి వరుసతోడ
దాత తంద్రుల చౌదరితనము లెల్ల
నెన్నికైవార మొనరించి యింపు నెఱప
నతని గూర్చుండనిడు కొని యాదరమును"[35]

కాని యిందు పవనీడు కథను చెప్పినట్లుగా వర్ణించబడలేదు. సంతానప్రాప్తికై పవనీడునే కొలువవలెనని చెప్పుట జరిగింది :

"కలలో దేవర చెప్పెరేయి నెదుటం గన్పించి నెయ్యంబువా
టిల నీ పాలికి దేవుడింక బవనీడేయంచు దానాడగా
వలెనే బాపన మొప్పెలైన సరియే వారెల్ల సాత్కాలు నీ
వలె గోరించిరె నిన్నె కొల్తుననుచు న్వర్ణించుచో నంతటన్"[36]

14వశకతలో జోగు ఒకతె పరశురామునిపై కథను పాడుచు వచ్చిందని వర్ణించబడింది. క్రీడాభిరామంలో పసీల చక్రవర్తి పరశురాముని కథను పాడినట్లు వర్ణించబడిందని పూర్వమే చర్చించబడింది.

హాలాంకుడను రెడ్డి యింటికి మాతంగి యొకతె పరశురాముని కథను పాడుచువచ్చిన తీరు చూడండి :

---

34. శుకసప్తతి 2-414 ఆం.ప్ర. సాహిత్య అకాడమి 1979
35. శుకసప్తతి 2-415 ఆం.ప్ర. సాహిత్య అకాడమి 1979
36. శుకసప్తతి 2-416 ఆం.ప్ర. సాహిత్య అకాడమి 1979

"నునుపుగా దువ్వితీర్చిన కొప్పుబాలేందు
పసమీఱు నొసటి కెంబసుపుబొట్టు
మెడతోలు పావాలు నిడుదగవ్వలదండ
సన్నంపు జికిలి దర్శనపుబేరు
నెడమ చేబళ్ళిక నిడిన బండారన్వ
పాణిబట్టిన నాగ పడిగకోల
కటిగాసె కట్టుగా గట్టిన చెంగావి
నిద్దంపు గుబ్బలనీలి అవికె
పదయుగంబున గజ్జెలు బాగునెఱప
పరశురామునిపై బాట బాడికొనుచు
సొంపు మీఱంగ నెక్కలో జోగలంచు
ముంగిటికి వచ్చి నిలిచె మాతంగియొకతె"[37]

పరశురాముని కథను ఎఱ్ఱగొల్లలు బవనీలు చెప్పుచుండగా జోగినియైన స్త్రీ ఇందులో పరశురాముని కథను పాడుచు వచ్చినదని వర్ణించబడటం గమనార్హం.

**చంద్రశేఖర శతకము:** ఈ శతకకర్త ఎవ్వరో తెలియదట. ఈ శతకర్తను గూర్చి శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "చంద్రశేఖర శతకమును రచించిన కవి యెవ్వరో కాని బ్రాహ్మణుడని మాత్రము తోచును. అతడు నెల్లూరివాడని భాషనుబట్టి స్పష్టమగుచున్నది"[38] అని అభిప్రాయపడిరి. చంద్రశేఖర శతకంలోని పద్యాల్ని సురవరం ప్రతాపరెడ్డిగారు కొన్నింటిని ఉదాహరించారు. చంద్రశేఖర శతకకర్త బంగారు తిమ్మరాజు కథను, పల్నాటి చరిత్రను, నాయకురాలు నాగమ్మ శౌర్యకథను, పాండవుల కథల్ని వింటినని క్రింది పద్యంలో పేర్కొన్నారు.

"ఇంటిని తిమ్మరాజుకత, యింటిని యార్లకథా ప్రసంగముల్
ఇంటిని పాడులాలి, యిబమి:టిని నాయకురాలి శౌర్యమె

---

37. శుకసప్తతి 2-465 ఆం.ప్ర. సాహిత్య అకాడమి 1970
38. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 398

ప్పంటికి నందివాక్యములఁ పొందు చెరిత్రలఁ నామభాగ్యమే
న్నంటికి గల్గునో యను నవజ్ఞుడు మూర్ఖుడు చంద్రశేఖరా![39]

తిమ్మరాజు కతయే బంగారు తిమ్మరాజు కథ. ఇది చారిత్రక కథ. శ్రీహరి ఆదిశేషువుగారి దీన్ని 'సాహసిక కథావాఙ్మయం'లో చేర్చి చెప్పిరి. తిమ్మరాజుకు సంబంధించిన చారిత్రక కథకు సరియైన ఆధారాలు లేవని విమర్శకుల అభిప్రాయం. జనపరంపరలో ఉన్న కథలనే చెప్పుకుంటూ వచ్చారు. ఇట్టి కథను శ్రీహరి ఆదిశేషువుగారు ఇలా వివరించారు. "ఆ రాయలవారు కృష్ణదేవరాయలని జనసామాన్యంలో పుక్కిటి పురాణం ఉన్నట్లు మెకంజీ దొరవారు సేకరించిన గాథల్లో ఉందట! రాయలవారు పెనుగొండలో అప్పుడప్పుడుండే వారనీ, వారి రాణులలో ఒకామె పాళెగార్లందరిలో అత్యంత సుందరుడైన బంగారు తిమ్మనాయుడిని మోహించినదనీ, విఫలమనోరధురాలై పగతీర్చుకొనేటందుకు అతని మీద రాయల వారితో కొండేలు చెప్పిందనీ జనశ్రుతి. రాయలు ఆ మాటలు నమ్మి తిమ్మనాయుడి మీద కోపంతో అతన్ని ముక్కలు, ముక్కలుగా నరికించాడట! తిమ్మనాయుడి గోరీ ఇదిగోనని క్రిందటి శతాబ్దం వరకూ ఒకచోటు చూపించి జనం పరంపరగా చెప్పుకొనేవారట."[40] బంగారు తిమ్మరాజు కథకు సంబంధించిన గేయాలు మాత్రం ప్రజల వ్యవహారంలో ఈనాటికీ కన్పిస్తాయి. తందాన కథలనీ, జంగము కథలనీ, బుర్ర కథలనీ ఇట్టి కథలు ప్రజల కత్యంత ప్రతికరముల్తై ఉండెడివి. కావుననే శతకకర్త తన శతకంలో ప్రస్తావించడం జరిగింది.

భారత, భాగవత రామాయణాదుల నుండి కథను గ్రహించి కథలుగా పాడుకోవడం, బయలు నాటకాలుగా ప్రదర్శించడం జనుల వినోదాల్లో ప్రముఖంగా కనిపిస్తుంది. భాగవతులు భాగవత కథల్ని పాటలుగా పాడుచు ప్రదర్శించిన తీరును చంద్రశేఖర శతకకర్త ఇలా వర్ణించాడు :

"రాతిరి సూస్తియేసములు రమ్మొముగా గురులాసమొన్న బా
గోతుల సత్తెభామ, యనగూడని తాపముతెల్లసేసె, మా
పాతకురాలు రాద, వలపచ్చము రుక్మిణి సుద్ది కిష్టమం
టీ తెరుగానదంచు వచియించును మూర్ఖుడు చంద్రశేఖరా"[41]

39. తెలుగు జానపద గేయ సాహిత్యమున ఉదాహృతం (పుట. 285)
40. జానపదగేయ వాఙ్మయ పరిచయం. పుటలు 81, 82, 1967
41. ఆంధ్రుల సాంఘిక చరిత్రలో ఉదాహృతం పుట. 400

బయలాటలాడే భాగవతులనే దాసర్లని కూడా అంటారు. ఆచార్య బి. రామరాజు గారు దాసరులను గూర్చి వివరిస్తూ "నీచజాతులందు వైష్ణవము స్వీకరించి భిక్షకులైన వారందరును దాసరులుగనే పిలువబడుదురు. బుక్క దాసరి, పాగదాసరి, దండెదాసరి, భాగవత, బుట్టదాసరి చిన్నదాసరి, మాలదాసరివంటి తెగల నేకము కలవు"[42] అనిరి.

వీథి భాగోతాలని పల్లెల్లో నేటికి పిలువబడే జానపద కళారూపకం కూడా కలదు. "వీథి భాగోతమే కొద్ది మార్పులతో ప్రాదేశికమైన వ్యత్యాసాలతో యక్షగానమని, చెంచు నాటకమని, బయలాట అని పిలువబడుతూ ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాలలో ఉందని"[43] డాక్టరు ఆర్వీయస్ సుందరంగారి అభిప్రాయం.



---

42. తెలుగు జానపదగేయ సాహిత్యము. పుట. 803
43. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పుట. 407

# జానపదుల సామెతలు

మౌఖిక జానపద విజ్ఞానంలో సామెతలొక విభాగం. సామాన్య జనవ్యవహారంలో అత్యంత ప్రాచుర్యాన్ని పొంది ప్రజల నాలుకలపై నాట్యమాడుచు పలు సందర్భాల్లో ప్రయోగింపబడే ఆణిముత్యాల్లాంటి వాక్యాలే సామెతలు "సామెత లేనిమాట- ఆమెతలేని యిల్లు" అనేది సామెతయొక్క ప్రాశస్త్యాన్ని వెల్లడి చేస్తుంది. నిత్యవ్యవహారంలో ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక సామెతను ప్రయోగించని వాడంటూ ఉండడన్నచో అతిశయోక్తి కాబోదు. ప్రతి విషయానికీ సామెత చెప్పే ప్రతిభావంతులూ ఉన్నారు. కొన్ని సందర్భాల్లో వెంటనే సామెత గుర్తుకు రానిచో "ఏదో సామెత చెప్పినట్లుగా" అని అయినా చెప్పి సంభాషణ ప్రారంభిస్తాడన్నచో సామెతల ప్రభావం మానవునిపై ఎంత కలదో వ్యక్తమవుతుంది.

సామెత అనే పదాన్ని ఆంగ్లంలో 'Proverb' అనీ, సంస్కృతంలో లోకోక్తి అనీ, కన్నడంలో గాదె, నాణ్ణుడి, సామితె అనీ, తమిళంలో పళమొళి అనీ, మళయాలంలో పళంచొల్లు అనీ అంటారు.

"సామ్య శబ్దమునకే సామ్యత అను అపాధు రూపమేర్పడి యుండవచ్చుననియు, అదియే సామెతగా తెలుగులో మారి ప్రచారంలో నున్నదనియు కీ॥ శే॥ డాక్టరు చిలుకూరి నారాయణరావుగారి వాదము."[1]

'సామెత' పదాన్నిగూర్చి శ్రీ తిరుమల రామచంద్రగారి అభిప్రాయమిట్లున్నది. "సామ్యం మరో భావార్థక ప్రత్యయం 'త'ను చేర్చుకొని సామ్యత అయింది. అనగా ఉదాహరణంగా చెప్పిన, పోలికగా చెప్పిన కథ లేక కథా భాగం లేక కథాసూచక వాక్యం అన్నమాట. ఇదీ సామెత పుట్టుక."[2]

సామెత అనే అర్థంలోనే తెలుగులోనే ఇతర పదాల్ని వాడడం కలదు.

---

1. తెలుగు సామెతలు ప్రథమ ముద్రణ. పుట. 2. తె.వి.వి. ప్రచురణ.
2. తెలుగు సామెతలు-సాంఘిక జీవితం పుట. IX. 1985.

"సామెత అనే అర్థంలో నానుడులు, సుద్దులు, జన్మశ్రుతులు, శాస్త్రములు, మాటలు అనే పదాలుకూడా వ్యవహారంలో ఉన్నాయి" అని[3] శ్రీ సంపత్ రాఘవాచారి గారి అభిప్రాయం.

"సాటువ, సాటవ, చాటువ, చాటప-అని నెల్లూరు రాయలసీమ ప్రాంతాల్లో సామెతకు పేరు"[4] అని శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారు పేర్కొన్నారు.

"సామెతకు మారుగా లోకోక్తి, శ్లోకము, సామ్యము, జనవాదము, లోక హితోక్తి, కత, నానుడి, నుడికారం అనే పదాలు తెలుగు సాహిత్యంలో ఉపయోగించబడ్డాయి"[5] అని డా॥ చిలుకూరి సుబ్రమణ్యశాస్త్రిగారు వివరించారు.

సామెతల్ని ఆంధ్రంలోనూ, ఆంగ్లంలోను అనేకులు నిర్వచించారు. ముందుగా తెలుగునందలి నిర్వచనాల్ని గూర్చి తెలుసుకుందాం.

తెలుగునందు సామెతను "జనవ్యవహారక్షుణ్ణమైన ఉక్తి"[6] అని శ్రీసంపత్ రాఘవాచారిగారు, "ఒక పిండితార్థాన్ని కొద్ది మాటలో చెబుతుందని"[7] శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, "సంక్షిప్తమైన, వివేకయుతమైన, తీక్ష్ణమైన, సాంప్రదాయకమైన, ప్రాచుర్యం కలిగిన అనుభవం పునాదిగా ఉండే అభివ్యక్తి"[8] అనీ శ్రీఆర్వీయస్. సుందరంగారు, "పూర్వులు తమ అనుభవములను సూత్రప్రాయముగా చెప్పుచూ వచ్చినవే సామెతలైనవని"[9] శ్రీ నేదునూరి గంగాధరంగారు, "జాతి జీవన వైఖరి, మనుష్య హృదయ స్పందన అన్నీ స్ఫుటంగా కనిపించే మాట"[10] అనీ డాక్టరు నాయని కృష్ణకుమారిగారు. "సామెతలు వడిసెల గుండ్ల

---

3. తెలుగు సామెతలు 1వ ముద్రణ పుట. 1. తె.వి. విద్యాలయము 1986
4. తెలుగు సామెతలు 3వ కూర్పు. పుట. 44. తె.వి. విద్యాలయము 1986
5. తెలుగు సామెతలు (వ్యాసం) - స్రవంతి. 1980 ఫిబ్రవరి
6. తెలుగు సామెతలు పీఠిక. పుట. 3 తె.వి. విద్యాలయ ప్రచురణ 1986
7. తెలుగు సామెతలు పీఠిక పుట. 35 తె.వి. విద్యాలయ ప్రచురణ 1986
8. ఆంధ్రుల జానపద విజ్ఞానం పుట. 174 ఆం.ప్ర.సా. అకాడమి 1988
9. వ్యవసాయ సామెతలు. ఉపోద్ఘాతము పుట. 1
10. పరిశోధన-తెలుగు సామెతలు. పుట. 82 ఆంధ్ర సారస్వత పరిషత్తు

వతె రివ్వుమని వచ్చి హృదయమునకు సూటిగా తాకున"[11] ని డా॥ బి. రామ రాజుగారు, "సామాజికమైన తరతరాల అనుభవాన్ని ఇముడ్చుకొని సామ్యత, ప్రభావోత్పాదకత, ధ్వని ప్రాధాన్యత, ప్రాచుర్యం, శ్రావ్యత కలిగి సంభాషణా యోగ్యమైన సంక్షిప్తవాక్యం తెలుగు సామెత"[12] అని డాక్టరు పి. నరసింహారెడ్డిగారు నిర్వచించారు.

ఆంగ్లంలో **"Short sentences drawn from long experience"** అని **Cervantes," Edged tools of speech"** అని **Bacon, "The Wisdom of many and the wit of one"** అని **Russel, "Aproverb is to speech what salt is to food"** అని **Hamid** మొదలైన పండితులు నిర్వచించారు.

సామెతల్లో తరతరాల ప్రజల అనుభవం ఉంటుంది. కుటుంబ జీవితం, కుటుంబంలోని వివిధ వ్యక్తుల మధ్య ఉన్న సంబంధ బాంధవ్యాలు, సాంఘిక జీవనం, సాంస్కృతిక జీవన చిత్రణం మొదలైనవి సామెతల్లో ప్రతిబింబిస్తాయి. ప్రజల వృత్తుల్నిబట్టి కొన్ని సామెతలు పుట్టగా ఆహారపుటలవాట్లను బట్టి మరి కొన్ని సామెతలు పుట్టాయి. ప్రజల ఆచార వ్యవహారాల్నిబట్టి కొన్ని సామెతలు పుట్టి ప్రాచుర్యాన్ని పొందగా కులం, వినోదం, మతం, విద్య, నమ్మకం మొదలైన వానినిబట్టి కొన్ని సామెతలు పుట్టి ప్రసిద్ధిని పొందాయి. మానవ స్వభావాన్నిబట్టి, జానపదుల పురాణ, ఇతిహాస, జానపద పరిజ్ఞానాన్నిబట్టి మరికొన్ని సామెతలు పుట్టి బహుళ ప్రచారాన్ని పొందాయి. పోలిక కొరకు కొన్ని సామెతలు పుట్టగా నమూనాగా మరికొన్ని సామెతలు పుట్టి చలామణి అవుతూ వచ్చాయి. కథల ఆధారంగా కొన్ని సామెతలు ప్రజల వ్యవహారంలో నిలిచిపోయాయి.

ఇతర జానపద విజ్ఞాన ధోరణులు తెలుగు శిష్టసాహిత్యంలో ఎలా చోటు చేసుకున్నాయో అలాగే సామెతలు కూడా తెలుగు సాహిత్యంలో చోటు చేసుకొని కవుల ఆదరాన్ని పొందాయి. అయితే ప్రజల వ్యవహారంలో ఉన్న సామెతలు కవుల కావ్యాలలోనికి ఎక్కాయో, కవుల కావ్యాల్లోని వాక్యాలు సామెతలుగా

---

11. తెలుగు జానపద గేయ సాహిత్యము పుట. 727
12. తెలుగు సామెతలు-జనజీవనం పుట. 6. 1988

ప్రజల వ్యవహారంలో నిలచిపోయాయో ఖచ్చితంగా చెప్పడం సాధ్యం కాదు. సమకాలీన సామాజిక పరిస్థితులు కవిపై ప్రభావాన్ని చూపుతాయనడంలో సందేహం లేదు. అందువల్ల సమాజంలోని ప్రజల్లో బహుళ ప్రచారం పొందిన సామెతలే కొద్ది మార్పులతో కానీ, యథాతథంగా కానీ కవుల కావ్యాలలోని కెక్కాయని చెప్పవచ్చు. ప్రస్తుతం తెలుగు శిష్టసాహిత్యంలో కనిపించే సామెతల్ని గూర్చి పరిశీలించడం జరుగుతుంది.

## తెలుగు సాహిత్యంలో సామెత పదప్రయోగం :

"నాకు తెలిసినంతవరకు సామెత అను పదము 15వ శతాబ్దిలోని వరాహ పురాణములో తొలిసారిగా ప్రయోగింపపడినదని"[13] శ్రీ సంపత్ రాఘవాచారిగారి అభిప్రాయం. సామెతలు తెలుగు భాషకు పొందై, రుచియై వీనులకు విందును కలిగిస్తాయని చెబుతూ మొల్ల తన రామాయణంలో 'సామెత' అనే పదాన్ని ప్రయోగించింది.

'కందువ మాటలు సామెత
లందముగా గూర్చి చెప్పనది తెలుగునకుం
బొందై, రుచియై, వీనుల
విందై మతి కానిపించు విబుధులమదికిన్"[14]

పై పద్యానికి వివరణ వ్రాస్తూ శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రిగారు "కందువ శబ్దమునకు చమత్కారము, కౌశలము, ప్రియము, గుర్తు అను నర్థము లున్నవి. భాషాభిజ్ఞులకు పూర్వశ్రుతములై సన్నివేశ చమత్కారము గలవియై, ప్రియములైన పదములే 'కందువ మాటలు. వానికి దోడుగా భావమున కత్యంత మాధుర్యమును జేకూర్పగల 'సామెతలు' గూడ నున్నచో తెలుగు కవిత్వము హృదయంగమముగా నుండునని యామె ఆశయము"[15] అని వివరించారు.

---

13. తెలుగు సామెతలు ప్ర. ము. పుట, 2 తెలుగు విశ్వవిద్యాలయము ప్రచురణ.
14. మొల్లరామాయణం పీఠిక XXIII బాలసరస్వతీ బుక్ డిపో 1987
15. మొల్లరామాయణం పీఠిక XXII, XXIII బాలసరస్వతీ బుక్ డిపో 1987

**అయ్యలరాజు నారాయణకవి :** 'హంసవింశతి'లో మంత్రసాని పారు పత్తెగానికి వివిధ సాహితీ ప్రక్రియ-తోపాటు సామెతల్ని కూడ పేర్కొన్నాదని వర్ణించబడింది :

> "స్తుతులు ప్రసంగముల్ కథలు సుద్దులు వార్తలు రాచకార్యముల్
> చతురతరేతిహాసములు శాస్త్రములందగు జాతిగాథలన్
> సతకదమల్ పురాణములు సామెతలు బహిహాసకంబు లిం
> గితములు జారజారిణులకేళి చరిత్రములన్ వచించుచున్" 2-48

ప్రజల వ్యవహారంతో బహుళ ప్రచారాన్ని పొందిన సామెతల్ని కవులు తమ కావ్యాల్లో ఎలా ప్రయోగించారో పరిశీలిద్దాం.

**నన్నయభట్టు :** నానా రుచిరార్థసూక్తి నిధియగు నన్నయభట్టు జగద్ధితముగా సంస్కృత భారతాన్ని ఆంధ్రీకరిస్తూ సూటిగాను, వ్యంగ్యంగానూ అనేక సూక్తుల్ని ప్రయోగించి తర్వాతి కవులకు ఆదర్శమయ్యాడు. సూక్తులతో పాటు సామెతల్ని సామెతల్లాంటి వాక్యాల్ని ప్రయోగించి ప్రజలకు మార్గదర్శకుడయ్యాడు.

వ్యాసుడు సత్యవతిని ఓదార్చు సందర్భంలో "గత కాలము మేలువచ్చు కాలము కంటెన్" (1-5-59) అనే వాక్యాన్ని ప్రయోగించాడు. ఇది ప్రజల్లో ప్రాచుర్యం పొందిన సామెత కాకపోయినా సామెతలాగా కనిపిస్తూ సందర్భానుగుణంగా ప్రయోగించడానికి ఉపయోగపడుతుంది.

"అడబోయిన తీర్థమెదురొచ్చినట్లు", "వెదకబోయిన తీగ కాళ్లకు చుట్టుకున్నట్లు" అనే సామెతల్ని అదృష్టాన్ని గూర్చి, శ్రమ లేకుండా ఫలితం లభించినపుడు ప్రజలుపయోగిస్తారు. ఈ జానపదుల సామెతను నన్నయ తన భారతంలో "వెనిరోయు తీగగాళ్ళం బెనగెం దాననుచు" (1-5-220) అని ప్రయోగించాడు. భీష్ముడు తన మనుమలకు తగిన విలువిద్యా గురువును నియమించాలని భావిస్తున్న సందర్భంలో అనుకోకుండా ద్రోణాచార్యులవారు రావడం జరుగుతుంది. ద్రోణుని గూర్చి, అతని విలువిద్యను గూర్చి అంతకుముందే విన్న భీష్ముని చిత్తవృత్తిని వర్ణిస్తూ పై సామెతను నన్నయ ప్రయోగించాడు. అనఘ్నష్టి

లైన వాళ్ల కలయికను గూర్చి చెప్పు సందర్భంలో ప్రజలు "కాకి ముక్కుకు దొండపండు" అనే సామెతను చెప్పుకుంటారు. చక్కని జంటగా ఉండవలసిన భార్యాభర్తల్లో ఒకరు అందంగా మరొకరు అందవిహీనంగా ఉండే సందర్భంలో పై సామెతమ చెప్పుకుంటారు. ఇదే సామెతను నన్నయ ఉన్నది ఉన్నట్లుగా వాడకపోయినా మార్చి వాడినా సందర్భానికి మాత్రం సరిపోయేటట్లు "పురోడాశ మది కుక్క కర్హమగునే? (1-6-67) అనే సామెతలాంటి వాక్యాన్ని ప్రయోగించాడు. మంత్రపూతమై గురువులు, యజమానులు మాత్రమే భక్షించడానికి అర్హమైన పురోడాశం కుక్కకు అర్హం కాదు. అలాగే ఉత్తమ కులసంజాతుడైన రాజునకు మాత్రమే అర్హమైన అంగరాజ్యం సూతకులజుడైన కర్ణునికి అర్హము కాదని భీముడు అధిక్షేపిస్తూ పై వాక్యాన్ని పలికాడు.

భీముని అధిక్షేపణను విన్న కర్ణుడవమాన భారంతో తల వాల్చియుండగా అపుడు దుర్యోధనుడు. దివ్యతేజంతో వెలుగొందు కర్ణుడు అధమకులంలో జన్మించడని, అది అసాధ్యమంటూ "లేడికడుపున బులిపుట్టునే" అధిక్షేపిస్తాడు. లేడి కడుపున లేడిపిల్ల పుడుతుందే కానీ పులిపిల్ల పుట్టదు. పులిపిల్ల పులి కడుపులో పుడుతుందని భావం. పై సామెతను యథాతథంగా మనం ప్రజల వ్యవహారంలో చూడవచ్చు.

"వాడికేం? వాడు గుండెమీద చేయి వేసుకొని నిద్రపోతాడు" అని వ్యవహారంలో వింటాం. అంటే వాడికేమి కష్టంలేదు అన్ని విధాల సుఖపడుతున్నాడనే దాని భావం. ఏ కష్టం, బాధ, విచారం లేనివాడే కంటినిండనిద్రా పోతాడు. ఇదే సామెతను కొద్దిమార్పుతో "ఱొమ్మున జేయిడి నిద్రవోయె" (1-6-68) అని నన్నయ ప్రయోగించాడు. కర్ణుని సహాయం లభించడం వల్ల దుర్యోధనుడు అర్జునుని వల్ల భయం తొలగి హాయిగా ఉన్నాడని పై సందర్భం.

"గాలి పెట్టినప్పుడు తూర్పు పోసుకున్నట్లు"గా అవకాశం దొరకినపుడు పనులు సానుకూలం చేసుకోవడం బుద్ధిమంతుల లక్షణం. అలాగే సమయం దొరికినపుడు ఉపాయంతో శత్రువును తుదముట్టించవలెనంటూ "జాతి మీద వఱలగ మృద్ఘటము నెత్తివైచిన భంగిన్" (1-6-115) అని నన్నయ చక్కని సామ్యాన్ని చెప్పాడు.

"అగ్నికి ఆజ్యం పోసినట్లు" అనే సామెతను మనం వింటాం. మంచి విషయంలో కాక చెడు విషయంలోనే పై సామెతను ఎక్కువగా ఉపయోగిస్తుంటారు. కోపంలో ఉండేవానికి ఇంకా కోపాన్ని కలిగించేట్లు ప్రవర్తించే వాళ్లను విమర్శిస్తుంది సామెత. జరాసంధుడు లోకాహిత దుస్సహమైన తేజముతో వృద్ధి పొందుచున్నాడని చెప్పు సందర్భంలో పై సామెతను సంస్కృతోక్తిగా మార్చి ప్రయోగించినట్లు కన్పిస్తుంది: "వర్ధిల్లె ఘృతాహుతం బ్రవృద్ధి నొందు నగ్నియ వలెన్" (2-1-155)

"చెవిటికి శంకూదినట్లు" అనే సామెత బహుళ ప్రసిద్ధి చెవిటివాని ముందు ఎంతసేపు శంఖం ఊదినా వాడికేమి వినిపించకపోగా చేసిన శ్రమంతా కూడా వ్యర్థమౌతుంది. అనవసరమైన శ్రమను కల్పించుకొనడమే అవుతుంది. ఇదే సామెతను నన్నయ తన భారతంలో ప్రయోగించాడు. ధర్మరాజు యజ్ఞ ఫలమును శ్రీకృష్ణునకు ఇవ్వగా శిశుపాలుడు ధర్మరాజు చేసిన పని 'చెవిటివాని ముందు శంకూదినట్లుగా' ఉందని అంటాడు. కృష్ణుని పూజించడం అనేది

"చనబేడికి దారక్రియ
యును జెవిటికి మధురగీతియును జీకునక
త్యనుపమ సురూపదర్శన
మును జేయుట" (2-2-14) గా ఉన్నదని అంటాడు.

నపుంసకునకు భార్య అనవసరం. చెవిటివానికి మధురగీతాన్ని వినిపించడం, గ్రుడ్డివానికి సౌందర్యరూపదర్శనం వ్యర్థమేనంటూ ఒకే భావాన్ని తెలిపే మూడు సామెతల్ని నన్నయ ప్రయోగించాడు.

"తిన్నయింటి వాసాల్ని లెక్కబెట్టినట్టు", "తిన్న యింటికి కన్నం వేసినట్టు" అనే సామెతలు మానవుని కృతఘ్నతా స్వభావాన్ని వెల్లడి చేస్తాయి. ఇదే భావాన్ని తెలియజెప్పే సామెతను నన్నయ "ఉత్సంగ తలమున నుగ్రవిషోరగంబున్నట్టు" అని ప్రయోగించాడు. విదురుడు పాండవ పక్షపాతియై దుష్టద్యూతమున పాండవులకు అపాయం తలపెట్టుట తగునా? అని పలుకగా అపుడు దుర్యోధనుడు విదురుని అధిక్షేపిస్తూ తిన్న యింటివాళ్ళకు మేలుచేయక, పరుల సుఖాన్ని కోరుట "ఉత్సంగతలమున నుగ్రవిషోరగంబున్నట్లు"గా ఉందని అంటాడు.

నన్నెచోడుడు : "కుమారసంభవం"లో సామెతల్ని సందర్భాను గుణంగా ప్రయోగించాడు.

"దొంతుల జేరినాయి నోర్చుగాని కూర్చునా ?" అని జానపదుల సామెత. కుక్క దొంతులుగా పేర్చిన కుండల్ని పడద్రోసి పాడు చేస్తుందేకాని వానిని మళ్లీ దొంతులుగా పేర్చలేదు. పని పాడుచేయడమేగాని దిద్దడం కాదనే సందర్భంలో పై సామెతను వాడుతారు. ఇదే సామెతను కుకవుల్ని నిందిస్తూ నన్నెచోడుడు "దొంతులు సేరినాయి దోర్పనేర్చుగా కడియేమి సేర్పనేర్చు" (1-29) అని అంటాడు. కుకవులైనవాళ్లు మంచిని కూడా చెడుగా భావించి ప్రచారం చేయ గలరని చెబుతూ పై సామెతను ప్రయోగించాడు.

"పంటచేను విడిచి పరిగ ఏరినయట్లు" అనే సామెత ప్రజల వ్యవహా రంలో ఉంది. రైతుకు కావలసింది పంటకాని జారిపోయిన పరిగలు కాదు. పంటను విడిచి జారిపోయిన పరిగల్ని ఏరుకోవడం మూర్ఖుల లక్షణం. ఇదే భావాన్ని వ్యక్తం చేసే సామెతను ప్రయోగించిన తీరును చూడండి :

"చెఱకు విడిచిన రసమున కెఱగిరాక
పిప్పి కరిగెడు నీగల పెల్లువోలె" (1-31)

ఈగలు చెరకులో ఉన్న రసాన్ని విడిచి రసహీనమైన పిప్పిని చుట్టుముట్టినట్లు కుకవులు కావ్యంలోని రసాన్ని గుర్తించలేరని చెప్పు సందర్భంలో పై సామ్యం చెప్పబడింది.

"చంద్రునికో నూలుపోగు" అని సామెత. బాగా ఉన్నవాడికి ఇతరులేమి చ్చినా, ఇవ్వకపోయినా ఫరవాలేదు. అట్లని ఇవ్వకుండా ఉండలేరు. ఇచ్చినా అది గొప్పగా అనిపించదు. అయినా తమ భక్తిని ప్రదర్శించడం కోసమై చేస్తూంటారని పై సామెత భావం. కావ్యప్రశస్తిలో నన్నెచోడుడు తన కావ్యాన్ని అంకితమిస్తూ పై సామెతలాంటి భావాన్ని వ్యక్తం చేస్తూ "..........రవికి దీ పమున నర్చనలిచ్చు పగిది వోలె" (1-49) అని అంటాడు.

తన కావ్యం జంగమ మల్లయ్యకు అంకితం ఇవ్వడం సూర్యుని ముందు దీపంతో అర్చన చేసినట్లుగా ఉందని అంటాడు. నిజమేకదా! సూర్యుని ముందు దీపం ఉన్నా లేకపోయినా ఒకటే.

"ఎలుకమీది కోపంతో ఇంటికి చిచ్చుపెట్టుకొన్నట్లు" అనే సామెత కోపంతో తనకు నష్టం కలిగించుకొనే మూర్ఖుల స్వభావాన్ని విమర్శిస్తుంది. ప్రజల్లో ప్రాచుర్యం పొందిన ఈ సామెతను నన్నెచోడుడు "ఎలుకతోడి కోప మున నిల్లేర్చునట్లు" (2-68) అని ప్రయోగించాడు. గణాధిపతులు దక్షుని యజ్ఞవాటికపై పోవుట ఎలుకమీది కోపంతో ఇల్లు కాల్చినట్లుగా ఉందని చెప్ప బడింది.

"పిచ్చుక మీద బ్రహ్మాస్త్రం" ప్రయోగించినట్లుగా కొందరు అల్పులపై అనవసరమైన శ్రమను తీసికొంటారు. పిచ్చుకను చంపుటకై బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించడం అనవసరం. ఇలాంటి భావాన్ని వ్యక్తంచేసే సందర్భంలో నన్నెచోడుడు రెండు సామెతల్ని ప్రయోగించాడు.

"ఎలుకవేట కుఱుము తిండియేల?"

"ములుకకాయ కెత్తుగల్లు గొనగనే?" (2-60)

ఎలుక వేటకై అంతకంట పెద్దదైన ఉఱుమును తినవలసిన అవసరం లేదు. అట్లే ములక కాయను త్రెంచుటకు దోటిలాంటి సాధనం ఉండే చాలు ఎత్తైన రాయి అవసరం లేదు కదా!

**పాల్కురికి** సోమన: జానపద విజ్ఞానాంశాల్ని తన కావ్యాల్లో ప్రవేశ పెట్టిన ప్రథముడు పాల్కురికి సోమన. "బసవపురాణం"లో సామెతల్ని ప్రయో గించిన తీరుని పరిశీలిద్దాం.

"ఉప్పుముల్లెను నీట్లో ముంచినట్లు" అనే సామెత జానపదుల వ్యవహా రంలో వినిపిస్తుంది. ఉప్పును నీటిలో ముంచితే కరిగిపోతుంది. ఉప్పు ముల్లెను నీటిలో ముంచితే కరిగిపోతుందనే జ్ఞానం లేని మూర్ఖుడు అలా చేస్తాడు. ఇదే సామెతను సోమన వాడిన విధం చూడుడు:

"ఉప్పు ముల్లియనీర ముంచినయట్లు"

"గప్పురంబున నగ్గి గప్పినయట్లు" (2-451, 452)

"రత్నాలుండగా రాళ్ళడిగినట్లు" అనే ప్రజాప్రాచుర్యం పొందిన సామెతకు నమూనగా సోమన "పెన్నిధి యుండుగ మన్నడుగుదురే" (1-467)

అనే సామెతను ప్రయోగించాడు. పెన్నిధి ఉండగా మన్నును అడగడం మూర్ఖత్వం కాక మరేమవుతుంది.

"అమ్మ ఉండగ పెద్దమ్మను పొగడినట్లు" అనే సామెత వ్యవహారంలో ప్రసిద్ధి పొందింది. కనిపెంచిన అమ్మ ఉండగా పెద్దమ్మను లేదా పిన్నమ్మను గౌరవించడం అవివేకుల లక్షణం. ఇదే భావాన్ని వ్యక్తంచేసే సామెతల్ని సోమన వరసగా తన బసవ పురాణంలో ప్రయోగించిన విధం చూడండి.

"సోమార్థ ధరభక్తి సురధేను వుండ
జగతు డాసించునే పరధనంబునకు?
మృగపతి యెద్దైన మేయునేపుల్లు
క్షీరాబ్ధి లోపల క్రీడించు హంస
గోరునే పడియలనీరు త్రావంగ?
జూతఫలంబులు చుంబించు చిలుక
త్రాంతి బూరుగు మానిపండ్లు గన్గొనునే?
రాకామల జ్యోత్స్న త్రావుచకోర
మాకాంక్షసేయునే చీకటి ద్రావ?
విరిదమ్మి వాసన విహరించు తేటి
పరిగొని సుడియునే బబ్బిల విరుల? (3-32 నుండి 43)

"ఆవములో రాగిముంత పుడుతుందా?" అని సామెతగా ప్రసిద్ధి పొందిన వాక్యాన్ని, అలాంటి నమూనాలోనే మరికొన్ని వాక్యాల్ని సోమన ప్రయోగించాడు:

వెలివాడ గలుగునే వేదఘోషంబు
నిలరావమున గల్గునే రాగిముంత
తలప గుంపటిలో దామరదుంప (5-474, 75, 76)

మరియు

"గనకాద్రి యరయనే కాకిగుణంబు
నినుము గుణమరయనే పరుసంబు" (4-470, 71)

వెలివాడలో వేదఘోష పుట్టదు. కుమ్మరివాని ఆవంలో మట్టికుండలే కాని రాగి ముంతలు లభించవు కదా. పరుసం ఇనుము గుణాన్ని పొందడం సాధ్యమయ్యే పని కాదు.

"గాడిద గుఱ్ఱమవుతుందా?", "గాడిదకు పులితోలు కప్పగానే కరుస్తుందా?" అనే సామెతలు ఉత్తములకు నీచులకు గల పోలికను చెబుతాయి. ఏ తోలు కప్పినా గాడిద గాడిదే కాని గుఱ్ఱం కానీ, పులి కాని కావడానికి వీల్లేదు. ఉత్తములతో నీచుల్ని, అల్పుల్ని పోల్చుట సరికాదనే భావాన్ని తెలియజెప్పే సందర్భంలో సోమన ప్రయోగించిన సామెతల్ని, సామెతల్లాంటి వాక్యాల్ని చూడండి:

"కరివైరి తోడ గుక్కలు వోల్పసరియె?
కరితోడ గ్రామ సూకరములు సరియె?
జలధితోడ నిల జాతిపడియలు సరియె?
దటిగంగతో వెడ్రవంతులు సరియె?
తపనుతో ఖద్యోత తతులెల్ల సరియె?
యుపమింప జంద్రుతో నుడుపంక్తి సరియె?
మేరువుతో బెంమెట్టులు సరియె?
పారిజాతంబుతో బ్రబ్బిళ్ల సరియె?" (7-101-108)

ఒక సామెతకు నమూనా సామెతల్ని ప్రజలే తమ వ్యవహారంలో సృష్టిస్తూ ఉంటారు. మరి ప్రతిభావంతుడు కవి. కావున సోమన ఒక భావాన్ని వ్యక్తం చేసే అనేక ఉపమానాల్ని వరుసగా పేర్కొన్నాడు.

గాలిపెడితే ఎండుటాకులు, పండిన ఆకులు రాలిపోతాయి కానీ పచ్చని ఆకులు రాలవు నీళ్లలో బరువైన వస్తువులు మునిగిపోతాయి కానీ తేలిక వస్తువులు మునగవు. ఇదే విషయాన్ని పాల్కురికి సోమన చక్కని సామెతల్లాంటి వాక్యాల్లో బంధించి వ్రాశాడు:

"వట్టి యాకులు గాలివడి దూలుగాక
మెట్టలు దూలునే యెట్టిగాడ్పునను?
బెండ్లు దేలెడిగాక పేరేటనైన
గుండ్లు దేలునె............" (7-343-47)

"ఊపిరి ఉంటే ఉప్పు అమ్ముకొని బ్రతుకవచ్చు", "బ్రతికి ఉంటే బలుసాకు తిని బ్రతుకవచ్చు" అనే సామెతలు నేటికీ ప్రజల భాషలో పలుమార్లు ప్రయోగింపబడుతూంటాయి. ఈ సామెతనే

"...............ప్రాణంబు గల్గినను
బలుసాకు దినియైన బ్రదుకంగవచ్చు" (7-373, 74) అంటాడు.

"పండితారాధ్య చరిత్ర"లోను జానపద విజ్ఞానానికి చెందిన సామెతల్ని విరివిగా వాడబడ్డాయి. సామెతలైనా సామెతల్లాంటి వాక్యాలైనా ప్రజల వ్యవహారంలో సందర్భానికి సరిగా సరిపోయేటట్లుంటాయి.

శివుని మహిమను కొనియాడు సందర్భంలో "ముంజేతి కంకణంబున కద్దమేల?" (1-620) అనే సామెతను ప్రయోగించాడు. స్పష్టంగా తెలియ వచ్చే విషయాన్ని తెలియజెప్ప నవసరం లేదని పై సామెత భావం. "ముంజేతి కంకణానికి అద్దమెందుకని" జనవ్యవహారంలోని సామెత.

గౌరవించాల్సిన వాళ్లను కాదని అనర్హుల్ని గౌరవించడం మూర్ఖత్వమని విమర్శిస్తూ "శిరసుండగ మోకాలికి పేసలు బోసినట్లు" అనే సామెత పుట్టింది. ఈ సామెతనే ఉన్నదున్నట్లుగా "శిరముండ మోకాలికి సేసె వెట్టంగగ్రియ గొని నట్లు" (1-202) అని అంటాడు.

"చెఱువు తెగగొట్టి చేపలు వండిపెట్టగానే మాన్యుడగునా?" అనే సామెత అసలుసిసలైన పల్లీయలది. చెరువు తెగగొట్టితే నీరంతాపోయి విపరీత నష్టాన్ని కలిగిస్తుంది. అందుకు బదులుగా చేపల్ని వండిపెట్టగా చేసిన నష్టం తీరిపోదనీ, ఎవరూ గౌరవించరని పై సామెత భావం. ఇదే భావాన్ని ఆధారం చేసుకున్న సామెత సోమన కవిత్వంలో

"జాతినాగుల జంపుచుండి
ప్రతిమ నాగులకును బాల్పోయునట్లు" (1-202) అంటూ చక్కగా ఇమిడిపోయింది.

"పూలతోగూడ నారతలకెక్కినట్లు" అనే సామెతను సజ్జనులవల్ల వాళ్లను ఆశ్రయించిన వారికి గౌరవం కలుగుతుందని చెప్పే సందర్భంలో చెప్పుకుంటారు. పూవుల్తో కలిసి ఉండడంవల్ల అల్పమైన నారకు కూడ తలలో నిలిచే భాగ్యం కలిగింది. అట్లే సజ్జన సంపర్కంవల్ల ఇతరులకు మేలు జరుగుతుందని భావం. జంగముల సాహచర్యం వల్లనే శివభక్తులు నిజమైన సుఖాన్ని పొందగలరని "అగ్ని సాన్నిధ్యతగాక యినుము ద్రావగ నేర్చునే యుదకము" (1-201) అనే సామెతను ప్రయోగించాడు. ఇనుము మామూలుగా నీటిని గ్రహించని పదార్థం. కాని అగ్నితో కలిసినపుడు ఇనుము తనలో నీటిని చేర్చుకుంటుంది.

"అల్లితన్నితే బూరెల బుట్టలో పడ్డట్టు" అనే సామెతను శ్రమ లేకుండా అనుకున్న పని నెరవేరినపుడు చెప్పుకుంటారు. అదృష్టంవల్ల లభించే సుఖాన్ని చెబుతుంది పై సామెత. ఇలాంటి సామెతల్ని పాల్కురికి సోమనాథుడు ఓహాటుడను శివభక్తుడు శ్రీ సోమనాథుని స్తుతించు సందర్భంలో వరుసగా చెప్పాడు :

నెఱనల్లి తన్నిన బఱుపుపైబడిన తెఱగు
నెరయ బాయసముపై నెయ్యొల్కినట్లు
పరగనెల్కకి నువ్వు పంటినయట్టి
ఆవులు దలంచినచోట బూరి మొలచినట్లయ్యె
అడబోయిన తీర్థమెదురు వచ్చినట్లయ్యె (1-380, 390)

"ఎద్దీనిందంటేగాట కట్టేయమన్నట్లు" అనే సామెత గ్రుడ్డిగా అనుకరించే వాళ్ళను విమర్శించి చెబుతుంది. దీన్నే సోమన, "ఎద్దీనె ననిన గొంది గట్టుమనిన చందము గల్గలవే" (2-146) అని అంటాడు. శివభక్తులు శివుని మహిమను గుర్తించి నడచుకొందురే గాని గ్రుడ్డిగా అనుకరించరని చెప్పు సందర్భంలో పై సామెత ప్రయోగింపబడింది.

"గొడ్డలిలో దూరిన కఱ్ఱ కులాన్నంతా కొట్టివేస్తుంది" అనే సామెత ప్రజల్లో రూఢి పొందింది. తనవల్ల తన కులానికే నష్టం కలిగించేవాళ్లను విమర్శిస్తుంది పై సామెత. ఇదే భావాన్ని వెల్లడిచేసే సామెతల్ని సోమన ఉపయోగించాడు :

"కులమునకెల్లను గుద్దలిగొనియె"
"కులమెల్ల గొనిపోయి బిలములో గలిపె" (1-125, 126)

"ఆకాశానికి నిచ్చెన వేసినట్లు", "ఆకాశానికి వెంట్రుక ముడివేసినట్లు" అనే సామెతలు అసాధ్యమైన విషయాల్ని చేయాలని ఉబలాట పడేవాళ్లను విమ ర్శిస్తాయి. పై భావాన్ని తెలియజెప్పే సందర్భంలో సామెతల్ని వరుసగా సోమన తన ద్విపదలో రూపొందించిన తీరును పరిశీలించండి :

"...... నేలకు నింగికి సూత్ర
పట్టి, మోకాళ్లను బట్ట తలలును
ముడివెట్ట, తన నీడగడవంగబాఱ,
పదినెండమావుల కడగాళ్లగట్ట,
బాయక రెండుగా బాఱెడు నీరు,
వ్రేయంగ, బుఱఱున్న గోయనియమ్మ,
తానారయొలువ, జట్టాతిపై గ్రుంక,
వేనుంగు పుఱుదోమ, నిసుకత్రాడ్వేన,
అలిగొన దీశలు బొలములు వాయింప,
వెంగుచు రోకట జిగురులు గోయ,
గలివెన్న బుచ్చ, గొండలు దొంతివేర్ప
నిలమంచు గుండాన గొలువ, రేవగలు
సేయ, నాకసమున జిత్రరూపములు
వ్రాయ, వాయువుబట్ట, వడగండ్లగుండ్లు
గట్ట, వెన్నెలబ్రోవుగా జేయ, జచ్చి
పుట్ట."

(పురాతన ప్రకరణం పుట. 358, 359)

ఇన్ని సామెతల్ని వెనువెంటనే ప్రయోగించి సామెతల విలువల్ని సోమన పెంచిన వాడయ్యాడు.

"శాస్త్ర ప్రకారం సరసమాడితే కుక్కపిల పుట్టింది" అనే సామెత శాస్త్రం తెలిసినా ఉపయోగించే విధానం తెలియకపోతే వ్యర్థమనీ, కార్యసాధనలోని మెల కువలు తెలియకపోతే శాస్త్రపరిజ్ఞానం పనికిరావనీ తెలియజెప్పే సందర్భంలో

ప్రయోగిస్తారు. ఇలాంటిదే "గజశాస్త్రవేత్తలకు గజారోహణం వస్తుందా?" అనే సామెత. ఈ సామెతను సోమన "గజశాస్త్రవేత్తలకెట్లు వచ్చు నరయ గజాధిరోహణము సేయంగ?" (వాదప్రకరణం: పుట 570) అని ప్రయోగించాడు.

"ఇంగువ కట్టినగుడ్డ - బెల్లం వండిన పొయ్యి" అని ప్రజల సామెత. ఇంగువవల్ల గుడ్డకు వాసన ఉంటుంది. ఇంగువ తొలగించిన పిదప కూడా ఆ వాసన ఉంటుంది. అట్లే బెల్లం వండిన పొయ్యి కూడా. శివుని సంపర్కం వల్ల భక్తులు కూడా ప్రకాశిస్తారని చెప్పే సందర్భంలో సోమన పై సామెతనే మరోలా చెప్పాడు.

"యేలరుగంధ ద్రవ్యములు దగులొ్కన
వలువ చందమున" (దీక్షాప్రకరణం - పుట. 177)

సుగంధ ద్రవ్యాలవల్ల వస్త్రము కూడా సువాసల్ని వెదజల్లునని భావం.

"నివురు కప్పిన నిప్పువలె", "మసిపాతలో మాణిక్యమట్లు" అనే సామెతలు లోకవ్యవహారంలో ప్రసిద్ధమై ఉన్నగా అదే భావాన్ని తెలిపే అనేక సామెతల్ని సోమన ఒకేచోట వరుసబెట్టి చెప్పాడు

"భువి మసికప్పడమున గప్పబడియు
నివిడి వెలుగు మాణిక్యంబట్లు",
"మిక్కుటంపు నివురుమీద గప్పియును
నక్కజంబై మించు నవలంబునట్ల",
"పొనరంగ శుక్తిచే బొదవంగ బడియు
దనరు ననర్ఘ్యముక్తాఫలంబట్లు",
"గమియ మీదట ప్రాచిగప్పియుండియును
నమలినంబైన గంగాంబువులట్ల",
"దుర్మేఘ పటలంబు దూరగప్పియును
నిర్మల రవిదివి నిలచిన యట్ల" (పురాతన-పుట. 361, 362)

"సంధుండగా కసుగాయ కొసినట్లు" అంటూ మానవుని అజ్ఞానానికి

అడ్డంపట్టే ప్రజల సామెతను సోమన "పసని పండుండగ గసుగాయ ద్రెంచుట" (పురాతన - 470 పుట.) అని ఉపయోగించాడు.

"గురువులేని విద్య గుడ్డివిద్య" అని అంటారు అనుభవజ్ఞులు. ఏ విద్య నేర్చుకోవాలన్నా గురువు తప్పక ఉండాలని భావం. ఒకవేళ గురువు లేకుండా నేర్చుకున్నా అది పనికిరాదని తెలుస్తుంది. అట్లే "దేవుడులేని దేవాలయం" కూడా. ఇదే భావాన్ని వివరించే సందర్భంలో సోమన పై సామెతను పోలిన అనేక సామెతల్ని ప్రయోగించాడు. బసవడు లేనిచో ఎన్ని ఉన్నా భక్తుడు ప్రకాశింపలేదని చెబుతూ;

"..........భూస్థలినింక
దివియయు లేని మందిరంబు విద్యాప్ర
భవము లేనట్టి సభావసమూహంబు,
దానంబులేని మాతంగంబు, గంపు
లేని పువ్వంబు, సన్మానంబులేని
దానధర్మము, అభిమానంబులేని
మానిని, ప్రాణంబులేని దేహంబు,
శాంతిలేని యతి, భజనలేని తపము,
గాంతిలేని మణి, నిక్కములేని పలుకు
శశిలేని నిసి, దివసపతిలేని పగలు
బహుల కాపరిలేని పశునివహంబు
రసహీనమైన నిస్సారంపు గవిత
బసవన్న లేని భక్తలోకంబు
నొప్పునే నీకు దివ్యోరులింగా" (మహిమ ప్రకరణం పుట. 218)

అని అంటాడు.

"గుంద్రాయి దాస్తే కూతురు పెండ్లి అగునా?" అనేది ప్రజల్లో బాగా ప్రాచుర్యం పొందిన సామెత. గుంద్రాయి లేనంత మాత్రాన పెండ్లి ఆగిపోదు. మరో గుంద్రాయి సంపాదించుకొని కార్యసాఫల్యం చేసుకుంటారు. ఇలాంటిదే "సన్నెకల్లు దాచితే పెండ్లికాదా?" అనే సామెత. ఇదే సామెతను సోమన,

"గుండుగల్లు డాచిన బెండ్లిసెడునె"

"చెనసి బిచ్చమ్ము మాన్పిన భక్తిసెడునెఁ" (పురాతన - 388 పుట)

అని ప్రయోగించాడు.

సోమన చాలావరకు ప్రజల్లో బహుళ ప్రచారం పొందిన సామెతల్ని ప్రయోగించాడని చెప్పవచ్చు.

**తిక్కన సోమయాజి :-** భారతంలో కొన్ని సందర్భాల్లో సామెతల్ని ప్రయోగించాడు.

"అటుకులు దిన్న కడుపు కట్టుకు ఓర్చుకోవలదా?", "అటుకులు తింటే ఆయెనా? కడుపులో కుట్టెత్తినప్పుడు కదా" అనే సామెతలు కష్టాన్ని గుర్తు చేస్తాయి. అటుకులు తింటే కడుపు కుట్టు పట్టుకుంది. దానికి ఓర్చుకొనే శక్తి ఉంటేనే అటుకులు తినాలని హెచ్చరిస్తుంది పై సామెత. కాని తిక్కన కొద్దిగా మార్చి "....అటుకులు దిన్నట్లగునే కడుపున గుట్టెత్తినపుడు గుడుబరచితివా" (ద్రోణ. 4-89) అని ప్రయోగించాడు. కష్టంలోనే మరో కష్టం అనుభవించాలని హెచ్చరించే సందర్భంలో పై సామెత ప్రయోగించబడింది.

"తేనె పూసినకత్తి" అనే సామెతపైకి తియ్యగా మాట్లాడుతు హృదయంలో శత్రుభావన కలిగిన వాళ్ళ స్వభావాన్ని విమర్శిస్తుంది. తేనెపైన కనిపిస్తుందని నాకితే కత్తి నాలుకను కత్తిరిస్తుంది. దుర్యోధనుడు ద్రోణాచార్యుని కపటపు బుద్ధి కలవాడవని నిందించే సందర్భంలో "తేనియ పూసిన కత్తివిగాక మానిసివె" (ద్రోణ - 3-108) అని అంటాడు. పైకి కౌరవపక్షంలో ఉంటూ పాండవుల మేలు కోరుచున్నావని అంటూ "నీవు తేనె పూసిన కత్తివి" కదా అని అంటాడు.

"అందని మాని పండ్లకు ఆశపడ్డట్టు", "అందనిమాని పండ్లకు అఱ్ఱులు సాచినట్లు" అనే జానపదుల సామెతలు మానవునిలోని అత్యాశను గూర్చి చెబుతాయి. పైభావాన్ని తెలియజేసే సందర్భంలో తిక్కనపై సామెతను యథాతథంగా వాడుకున్నాడు.

కీచకుడు సైరంధ్రిని తన బాహువుల్లోకి చేరిపొమ్మని పలుకగా సైరంధ్రి

అందని చెట్ల పండ్లను కోసుకొనుటకు ప్రయత్నించడం మంచిది కాదని అధి క్షేపిస్తూ. "అందనిమ్రానుల పండ్లు గోయదలంచుట హితమే" (విరాట-3-58) అని అంటుంది.

**కేతన :** తిక్కన ప్రయోగించిన సామెతనే కేతన తన "దశకుమార చరిత్రము"లో "అందనిమ్రాని పండకును నల్లుచు సాచదనేమి చేయుదున్" (8-131) అని ప్రయోగించాడు. పదాల్లో కొద్దిపాటి మార్పులు తప్ప సామెత భావంలోనూ, వాక్యప్రయోగంలోనూ తిక్కనకు కేతనకు తేడా లేదని చెప్పొచ్చు.

"ఆడబోయిన తీర్థమెదురైనట్లు" అనే సామెతను కేతన "ఆడబోయిన తీర్థం బెదురుగ వచ్చిన క్రియన్"(8-2) అని ప్రయోగించి జానపదుల సామెతకు బలాన్ని చేకూర్చాడు. పై సామెతనే నన్నయ "రోయుతీగ గాళ్ళ బెనగెందా ననుచు" అని కొద్దిగా మార్పుచేసి ప్రయోగించాడని పూర్వమే చెప్పబడింది.

"తేనెలోపడిన ఈగవలె" అనేది ప్రజల సామెత. తేనెలో పడిన ఈగ అందులో ఉండవలసిందేకాని బయటికి రాలేదు. అట్లే పొరపాటున ఒక విషయా నికి మనిషిలోబడితే దానినుండి బయటికి రాలేడని చెప్పే సందర్భంలో పై సామె తను చెప్పుకుంటారు. పై సామెతనే కేతన ఉన్నదున్నట్లుగా "తేనియబద్ధ యీ గగతి" (6-30) అని ఉపయోగించాడు.

సాధ్యంకాని విషయాన్ని సాధించాలని ఎవరైనా ప్రయత్నిస్తే అపుడు ప్రజలు 'ఏటికి ఎదిరీదినట్లు' అనే సామెతను చెబుతారు. ఇదే సామెత కేతనచే "ఏటికి నెదురీదుమాడ్కి" అని ప్రయోగించడం జరిగింది.

స్వేచ్ఛగా తిరిగే వానిని ఒకచోటనే కదలకుండా చేశారనుకోండి అపుడు "వాడికాళ్ళు కట్టిపడేశారని" చెప్పుకుంటారు. నిజాంగా కాళ్ళకు బంధాలుండవు. కదలనీకుండ చేశారని భావం. ఇదే భావాన్ని వ్యక్తం చేస్తూ కేతన సామెత లాంటి వాక్యాన్ని "వనంబులోపలం దన వలచినట్లు తిరుగు కరిపట్టుబడిన మాడ్కి" అని ప్రయోగించాడు.

"కుక్కకు టెంకాయ అబ్బదు" అని సామెత. అనగా కుక్కకు టెంకాయ లభించడం అసాధ్యం అనే సందర్భాన్ని బట్టి పై సామెత పుట్టింది. దీన్నే కేతన "కుక్కకు టెంకాయ దక్కదు." అని ప్రయోగించాడు.

బద్దెన : "సుమతి శతకం"లో చాలా సామెతల్ని ప్రయోగించి సామెతలకు కావ్య గౌరవాన్ని సంపాదించి పెట్టాడు శతకాల్లోని పద్యాల్లో సామెతలు చక్కగా ఇమిడిపోవడమే గాక సామెతల్ని ప్రయోగించడం వల్ల బంగారానికి పరిమళ మబ్బినట్లయిందని భావించవచ్చు.

ఆకలిగొన్నపుడు మనిషికి ఏం పెట్టినా, ఎలాంటిది పెట్టినా మాట్లాడకుండా తింటాడు. అమృతం తాగినంత సంతృప్తిని పొందుతాడు. అందుకే సుమతి శతకకర్త "ఆకొన్న కూడే అమృతము" (8 వ పద్యం) అని అన్నాడు.

పనికిమాలిన వాడు ఎంతకాలం ఉన్నా వాడివల్ల ఎవరికి ప్రయోజనం ఉండదు. కావున వ్యర్థమని అంటాం. నిష్ప్రయోజకుడు ఎంతకాలం ఉంటే ఏం లాభమంటూ "కాకి ఉంటుంది పది కాలాలపాటు" అనీ, "కాకిలా కలకాలం బ్రతకడం ఎందుకు" అని విమర్శిస్తారు పై భావాన్ని వ్యక్తంచేసే సామెతల్ని బద్దెన తన శతక పద్యంలో ఎలా బంధించాడో చూడుడు :

"ఉడుముండదె నూఱేండ్లును
బడియుండదె పేర్మి బాము పది నూఱేండ్లున్
మడువున గొక్కెర యుండదె
కడునిల బుషార్థపరుడు కావలె సుమతీ" (18 వ పద్యం)

"కుక్కను తెచ్చి అందలంలో కూర్చోబెడితే కుచ్చులన్నీ తెగ కొరికిందట," "కుక్కను సింహాసనమున కూర్చుండబెట్టినా వెనుకటి గుణ మానదు" అనే సామెతల్ని నీచుల సహజ స్వభావాన్ని విమర్శిస్తూ ప్రజలు సంభాషణలో ప్రయోగిస్తుంటారు. ఇదే సామెత సుమతిశతకంలో ఎలా ఇమిడిందో చూడుడు :

"కనకపు సింహాసనమున
శునకము గూర్చుండబెట్టి శుభలగ్నమునం

దొనరగ బట్టము గట్టిన
వెనుకటి గుణమేలమాను వినురా సుమతీ" (26 వ పద్యం)

బంగారు సింహాసనంపై కూర్చున్నా కుక్క చెప్పులు కొరికే తన నీచగుణం మానదన్నమాట !

నీచులు తమ సహజగుణాన్ని వీడకపోవడమే గాక వాళ్ళకెన్ని హిత బోధలు చేసినా, ఎన్ని శాస్త్రాలు వినిపించినా ఉత్తములతో సమానులు కారంటూ "కుక్కపై కంబళివేయగానే గంగిరెద్దు అవుతుందా ?" అనే సామెతను చెప్పుకుం టారు. పై భావాన్ని వ్యక్తం చేస్తూ సుమతిశతక కర్త మరోచక్కని సామ్యా న్ని చెప్పి తెలుగుభాషకు మరో సామెతను కల్పించాడు :

"ఉత్తమ గుణములు నీచున
కెత్తెఱగున గలుగనేర్చు నెయ్యేడలందా
నెత్తిచ్చి కరగిపోసిన
నిత్తడి బంగారమగునె యిలలో సుమతీ" (14 వ పద్యం)

ఇత్తడి బంగారంతో ఎప్పుడు సరికాదు. ఇత్తడి ఇత్తడే, బంగారం బంగారమే. అట్లే ఉత్తములూ, నీచులు, నీచుల్ని ఎట్లయినా ఉత్తములుగా మార్చలేము కదా !

"పాము పడగక్రింద కప్ప ఉన్నట్లు" అనే సామెతను కొద్దిగా మార్చి "సర్పంబు పడగ నీడను గప్పవసించిన విధంబుగదరా" (19 వ పద్యం) అని ప్రయోగించాడు బద్దెన.

"బెల్లమున్నచోటే ఈగలు ముసిరేవి", "బెల్లపు పొయ్యికి ఈగలే నిద ర్శనం "అనే సామెతలు ధనముంటేనే ఎవరైనా వానిచుట్టు చేరుతారని చెబుతాయి. సుమతి శతకంలో పై సామెతను చెప్పు సందర్భంలోనే మరో ఉపమానాన్ని చెప్పాడు :

ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తురది యెట్లన్నన్
"దెప్పలుగ జెఱువునిండిన
గప్పలు పదివేలు చేరుగదరా సుమతీ" (20 వ పద్యం)

చెరువులో నీళ్ళుంటేనే కప్పలుంటాయి. ధనముంటేనే బంధువులు చేరుతారు.

బండిసాఫీగా సాగి ముందుకు పోవాలంటే కందెనవేయాలి. బండి ఎవరిదైనా కందెనలేనిదే ముందుకు సాగదంటూ "కందెన పెట్టనిదే పరమేశ్వరుని బండియైనా పారదు" అనే సామెతను చెప్పుకుంటారు. ఇదే సామెత సుమతి శతకంలో ఇలా ప్రయోగింపబడింది :

"కరణముల ననుసరింపక
విరసంబున దిన్నతిండి వికటించు జుమీ
యిరుసునగందెన బెట్టక
పరమేశ్వరు బండియైన బాఱదు సుమతీ" (80 వ పద్యం)

ఎంతటివాడైనా లంచం ఇవ్వందే ఫైలుకదలదనే 'లంచగొండి తనాన్ని' వెల్లడి చేసే మరో సౌందర్యార్థంలో నేడు ప్రజల్లో కన్పించడం పై సామెతలోని విశేషం.

"నల్లిని గూర్చి మంచానికిపెట్టు" అనేది అచ్చమైన జానపదుని సామెత. చెడు సంపర్కంవల్ల మంచివాళ్ళకు కూడా హాని జరుగుతుందని చెబుతుంది. ఈ సామెత సుమతి శతకంలో ఎంత అందంగా బంధించబడిందో చూడండి :

కొంచెపు నరు సంగతిచే
నంచితముగ గీడువచ్చునది యెట్లన్నన్
గించిత్తు నల్లి కుట్టిన
మంచమునకు బెట్టువచ్చు మహిలో సుమతీ" (89వ పద్యం)

"చెవిటికి శంకూదినట్టు", "మూగవాని దగ్గర ముక్కు గీరుకున్నట్లు" అనే సామెతలు వ్యర్థ ప్రయత్నాలు చేసేవాళ్ళ స్వభావాన్ని విమర్శిస్తాయి. మూర్ఖుడికి హితోపదేశం చేయడం చెవిటివానిదగ్గర శంఖం ఊదినట్లుగా ఉంటుంది. పై సామెత సుమతి శతకంలో నవరస భరితంగా చేరిపోయింది :

నవరస భావాలం కృత
కవితా గోష్ఠియును మధుర గానంబును దా
నవివేకి కెంత జెప్పిన
జెవిటికి శంకూదినట్లు సిద్ధము సుమతీ (66 వ పద్యం)

సాధ్యంకాని పనులు చేయాలని ప్రయత్నించే వాళ్ళను విమర్శిస్తూ "ఏటికి ఎదురీదినట్లు" అనే సామెతను చెప్పుకుంటారు ఈ సామెతను ఉన్నదున్నట్లుగా ప్రయోగించాడు సుమతి శతకకారుడు.

"వాదెరుగని పతికొలుపును
కూటంబున కెరుక పడక కోమలి రతియున్
బెట్టె త్త జేయు చెలిమియు
నేటికి నెమరీదినట్టు లెన్నగ సుమతీ (78 వ పద్యం)

క్రమపద్ధతి ననుసరించి వృద్ధిని పొందక ఒక్కసారిగా అభివృద్ధిని సాధించడం జరిగినపుడు జనులు ఆశ్చర్యపడుచు "పెరుగుట విరుగుట కొరకే" అనే సామెతను చెప్పుకుంటారు పై సామెతకు మరికొన్ని చక్కని సామ్యాల్ని జోడించి క్రింది పద్యాన్ని చెప్పాడు :

సరసము విరసము కొరకే
పరిపూర్ణ సుఖంబులధిక బాధల కొరకే
పెరుగుట విరుగుట కొరకే
ధరతగ్గుట హెచ్చుకొరకే తథ్యము సుమతీ" (106వ పద్యం)

ఎఱ్ఱన : "హరివంశం"లో ఎఱ్ఱన జానపదుల్లో ప్రచారంలో ఉన్న సామెతల్ని ప్రయోగించాడు. "ఏనుగు మింగిన వెలగపండువలె" అని ప్రజల్లో ప్రచారంలో ఉన్న సామెతను "ఏనుగుతిన్న వెలగపండు" అని ప్రయోగించాడు (5-107) పై సామెతనే సుమతిశతకకారుడు "కరిమ్రింగిన వెలగపండు కరణిని" అని పేర్కొన్నాడు.

"పచ్చిగడ్డివేస్తే భగ్గున మండిపడునట్లు"గా ఉండేవాళ్ల స్నేహంగా ఉండుటకు వీలులేదు. ఒకరిని చూస్తే మరొకరికి పడదు. అలాంటివాళ్ల స్నేహాన్ని చమత్కారంగా "నిప్పుకు నీళ్ళకూ ఉన్నంత స్నేహం" అని అంటారు. ఇదే సామెతను పదాల మార్పిడితో "నిప్పునీరు పొదివినట్టులున్నా" (7-67) అని ఎఱ్ఱన ప్రయోగించాడు.

"ఎద్దుపుండు కాకికి ముద్దా?" అనే సామెతను ఇతరులు నిష్కారణంగా దయను చూపరని తెలియజెప్పు సందర్భంలో ప్రయోగించడం ప్రజల వ్యవహా

రంలో కన్పిస్తుంది. ఇదే సామెతను పై సందర్భాన్ని తెలియజెప్పు సమయంలో ఎఱ్ఱన "అడవిపులి మానసులనేం గాదరించు" (8-179) అని ప్రయోగించాడు.

**నాచన సోమనాథుడు :** నవీన గుణసనాథన చక్రవర్తియని కీర్తింప బడిన సోమనాథుడు ప్రజల్లో ప్రాచుర్యాన్ని పొందిన సామెతల నెన్నింటినో ప్రయోగించి సారస్వతంలో సామెతలకొక విశిష్ట స్థానాన్ని కలిగింపజేశాడు. ఉత్తర హరివంశంలో నాచన సోమనాథుడు వాడినన్ని సామెతలు మరే కవి వాడి యుండలేదన్నచో అతిశయోక్తి కాదంటూ డాక్టరు పి. యశోదారెడ్డిగారు ఉత్తర హరివంశంలోని సామెతల సౌందర్యాన్ని గూర్చి "సామెతలన్నియు పద్యభావము నందు, పాత్రల సంభాషణములందు ఆయా ఆచార వ్యవహారములతో నతికి ఏ ప్రయత్నమును లేకయే సొంపుగా సాగిపోవుచుండును. నిత్యవ్యవహారములలో, సంభాషణావసరములందు వృద్ధుల ముఖమునుండియు, స్త్రీల వాక్కు నుండియు నప్రయత్నములుగా జాలువారినట్లునే సోముని గ్రంథమున పాత్రల ముఖం నుండి యాయా సందర్భములందు వారి వారి యాభిజాత్యమును బురస్కరించు కొని యాయా సామెత వెలువడుచు కావ్యమునకెంతయో సహజత్వమును గూర్చు చుండును"[6] అని కొనియాడిరి. ఉత్తర హరివంశంలో ప్రయోగింపబడ్డ సామె తల్ని పరిశీలిద్దాం.

"అగ్నికి వాయువు తోడైనట్లు" అని ప్రజలు సందర్భానుగుణంగా ప్రయోగిస్తుంటారు. మండేటువంటి అగ్నికి మరలా గాలి తోడయితే ఇంకా అధి కంగా మంట మండుతుంది. కోపంలో ఉండేవానికి ఇంకా కోపాన్ని అధికం అయ్యేట్లు మాట్లాడేవాళ్లు, ప్రవర్తించే వాళ్లుంటారు. అలాంటివాళ్ల ప్రవర్తనను పై సామెత విమర్శిస్తుంది.

పై సామెతను సోమన పదాల్ని మార్చి "కారుచిచ్చునకు గాడ్పులు దోడగు చందమొందగన్" (1-21) అని ప్రయోగించాడు. ఇంద్రుడు దానవులపైకి యుద్ధానికి పోగా ఇంద్రునికితోడు లోకపాలకులు కూడా వెళ్లారని చెబుతూ పై సామెతను సోమన వాడాడు.

ఊర్వశి తన మనస్సెపుడో ఎవరికో అధీనమైందనీ, మనస్సులేని శరీరం

---

6. ఉత్తర హరివంశం - పీఠిక పుట. 44 ఆం.ప్ర సా. అ - 1979.

వ్యర్థమని నరకునితో పలుకు సందర్భంలో "చిల్కపోయినం బంజరమేమి సేయ?" (1-72) అనే సామెతను చెబుతుంది. తాత్త్వికార్థంతో గూడిన ఈ సామెత జనవ్యవహారంలో ప్రాచుర్యంగా విన్పిస్తుంది.

"ఎలుక తోలు ఎంత ఉతికినా నలుపే" అనే ప్రజల సామెత మనిషి సహజ స్వభావాన్ని మార్చలేమని చెబుతుంది. ఎలుక తోలు నల్లగా ఉంటుంది. దాన్ని ఎంత తోమినా తెలుపురాదు పై అర్థాన్ని వ్యక్తం చేస్తూ సోమన మరో సామ్యంతో "ఎంత దఱిగిన మిరియాలుం జొన్నలు సరిపోవే!" (1-75) అని ప్రయోగించాడు. మిరియాలు నల్లగా ఉంటాయి ఎంత తరిగినా అవి జొన్నలతో సమానం కాలేవు.

"కఱ్ఱు ఇంటికంబమగునా?" అని సామెత. కఱ్ఱుకు సూదియైన మొన వుంటుంది. దాన్ని ఇంటి కంబముగా చేస్తే ఎపుడో ఒకసారి ప్రమాదాన్ని కలిగిస్తుంది. అందుకై కఱ్ఱు ఇంటి కంబం కావడానికి వీల్లేదని పై సామెత ఖండిస్తుంది. పై సామెతనే సోమన "కని కని కొఱ్ఱెవ్వడింటి కంబము సేసెన్" (1-84) అని అంటాడు.

యాగఫలమునకు తానే అధిపతినని, తనను కాదని ఇతరుల కిచ్చుట యన్నది. "శిరసుండగ మోకాలను సేసలువెట్టుట" (1-90) అన్నట్లుగా ఉన్నదంటాడు.

"మంత్రాలకు చింతకాయలు రాలునా?" అంటూ జానపదులు మాటల్తో పనులు చేసేస్తామనేవాళ్లను విమర్శిస్తారు. మంత్రాలకు చింతకాయలు రాలవు. అట్లే మాటలతోనే పనులు జరుగవని భావం. ఇదే భావాన్ని వ్యక్తం చేస్తూ సోమన "మంత్రపునీళుల నల్లవచ్చునే" (2-19) అని విమర్శిస్తాడు. చనిపోయినవాన్ని మంత్రపు నీళ్లతో బ్రతికించలేమని చెప్పు సందర్భంలో పై సామెత ప్రయోగింపబడింది.

"లేడి కడుపున పులిపుట్టునా" అనే సామెత ప్రచారంలో ఉంది. ఈ సామెతకు నమూనాగా సోమనాథుడు "కుమ్మరావమున రాగిముంతతెఱుంగగలవే" (8-48) అనే సామెతను ఉపయోగించాడు. కుమ్మరావంలో కుండలుంటాయి కాని రాగిముంతలుండవు కదా!

హంస డిభకులు వేటకుపోయి వాళ్ళు చూసిన జింకలను వర్ణిస్తూ చెప్పిన పోలికలన్నీ సామెతలు కాకపోయినా సామెతల్లాంటి వాక్యాలని చెప్పవచ్చు. ఆ పద్యాన్ని చూడుడు.

"నీరముంచిన సొరకాయ నెగసినట్లు
పేరుకొని వైచు తెల్లంటు చీరవోలె
నుంకు రెండు విధంబున నుత్తరించు
తమలపాకు నిక్కడుక్రియ దాటెనిట్టి (4-28)

"తాజెడ్డ కోతివనమెల్ల చెఱచె" అంటూ తాను చెడిపోవడమే గాక ఇతరుల్ని కూడా చెడగొట్టుటకు ప్రయత్నించే వాళ్ళను విమర్శిస్తారు. ఇదే భావాన్ని "........తాజెడ్డవాడు వెనకయ్య చేతికి వెసలిచ్చె ననుమాట" (4-50) అనే సామెతలో ప్రయోగించాడు

చెడ్డవాళ్ళతో స్నేహంచేస్తే మంచివాళ్ళకు కూడా హానికలుగునని "నల్లి వలన మంచానికి పెట్లు" అనే సామెతను చెప్పుకోవడం జన వ్యవహారంలో ఉంది. ఇలాంటి సామెతను సోమన "వరుగుతో దాగరయు నెండపలసినట్లు" (4-54) అని ప్రయోగించి మరో సామ్యాన్ని చెప్పాడు.

తనకు తానుగా నశించుపోవు దాన్ని నాశనం చేయాలనుకోవడం మూర్ఖత్వం వెర్రితనం కూడా! ఇదే భావాన్ని చెబుతూ "తవుడుతిని చచ్చువానికి విషము పెట్టువాడు వెట్టివాడు" (4-62) అని ప్రయోగించాడు. తవుడు తిని దానివల్లనే చచ్చువానికి మళ్ళీ విషం పెట్టడం అనవసరమన్న మాట.

"జగమెరిగిన బ్రాహ్మణునికి జంధెమేల" అన్నట్లుగా స్పష్టంగా తెలుస్తున్న విషయాన్ని మళ్ళీ తెలియజెప్పవలసిన అవసరంలేదు. ముంజేయి కంటికి స్పష్టంగా కన్పిస్తుంది. కావున దానికి కంకణం వేయడానికి అద్దం అవసరం ఉండదంటూ సోమన "ముంజేతి కంకణమున కద్దమేమిటికి" (4-100) అని అంటాడు.

"పండ్లూడిన కుక్కను పసరమైన కరచును" అనేది జానపదుల సామెత. కుక్కను చూస్తే పశువు భయపడుతుంది. కానీ పండ్లూడిపోతే ఆ కుక్కనే పసర

మెదురు తిరిగి కరుస్తుంది. అంటే పండ్లూడిపోవడంవల్ల కుక్క పశువునకు చుల కనై పోయిందన్నమాట. హంస డిభకులచే అనేక విధాల హింసింపబడ్డ మునీం ద్రుల అవస్థలను చెబుతూ సోమన.........పులి పేదవడిన బసుల వాండ్రె యెకాడి రను కత వచ్చెనాకు'' (1-102) అని అంటాడు. పులిని చూస్తే పశువుల కాపరులు భయపడతారు. అదే పులి శక్తిహీనమైతే అదే పశువుల కాపరులే ఎదురు తిరుగుతారని భావం.

"కొఱవితో తల గోకుకొన్నట్లు'' అనే ప్రజల సామెతను సోమన యథా తథంగా "కొఱవిిందల బరికి కొన్న కొఱడులు గారె'' అని ఉపయోగించాడు. కొఱవితో తలను బరికికొనుట అనగా తనకు తానుగా నష్టాన్ని కలిగించుకోవడం అన్నమాట. అది మూర్ఖంకాక మరే మవుతుంది!

పైకి స్పష్టంగా తెలుస్తున్న విషయాన్ని దాచాలనుకోవడం సాధ్యంకాదు. మజ్జిగకై ముంతతీసికొనివచ్చి, ఆ తర్వాత ముంతను దాచితే వచ్చిన విషయం దాగదు కదా! ముంత తెచ్చాడంటే చల్లకోసం అనే విషయం సుస్పష్టం. ఇలాంటి సందర్భంలో "చల్లకొచ్చి ముంత దాచినట్లు'' అనే సామెతను ప్రజలు వ్యవహారంలో చెప్పుకోగా సోమన అదే సామెతను యథాతథంగా "చల్లకు వచ్చి ముంతదాచిన గతి'' (4-149) అని ఉపయోగించాడు

"పులినిచూచి నక్క వాతలు పెట్టుకొన్నట్లు'' అనే సామెత మూర్ఖం గా ఇతరుల్ని అనుకరించి నష్టాన్ని కలిగించుకొనే వాళ్ళను విమర్శిస్తుంది. ఇదే సామెతను కొద్ది మార్పుతో భావం తప్పకుండ "దుప్పిజాచి నక్కయొడలు గాల్చికొన్న వడువున'' (4-165) అని ప్రయోగించాడు. దువ్వి అనగా పులి అని అర్థం. పులిచారల్ని చూచి తనకు అలా ఉండాలనుకొని శరీరంపై వాతలు పెట్టుకుంటే తనకే నష్టం కదా!

"దాగబోయి తలారి ఇంట్లో దూరినట్లు'' అనే సామెత అవివేకంతో చేయ రాని పనులు చేసేవాళ్ళను విమర్శిస్తుంది. దాచుకోవడానికై పోయి తలారి ఇంట్లో అనగా ఎవరైతే దొంగల్ని పట్టుకుంటాడో వాని ఇంట్లోనే దాగడం ఒక విధంగా మూర్ఖత్వమే అవుతుంది కదా! ఇదే సామెతను "దాగబోయి తలారి వాని యెదు రన్ దాగంగనీ కిటికిన్'' (4-92) అని సోమన ప్రయోగించాడు.

"గాడిదకు పులితోలు కప్పితే కఱవగలదా" అనే సామెత ప్రజల వ్యవహారంలో వినిపిస్తుంది. పులితోలు కప్పినా, సింహంతోలు కప్పినా గాడిద గాడిదే అవుతుంది కాని పులిలా, సింహంలా మారలేదు. దానిజాతి సహజమైన బుద్ధిని మార్చలేము. పిరికి వానిని బలవంతునిగా మార్చలేమని చెప్పే సందర్భంలో సోమన పై సామెతనే "గఱవగ వచ్చునే బలిమిగాడిదకుం బులితోలు గప్పినన్" అని వాడాడు.

"వెదకబోయిన తీగ కాళ్ళకు చుట్టుకొన్నట్లు" "అడబోయిన తీర్థమెదురు వచ్చినట్లు" అనే సామెతలు ప్రజల నిత్య వ్యవహారంలో కనిపిస్తాయి. ఎలాంటి శ్రమలేకయే అనుకొన్న పని జరిగిపోవడమన్నమాట. హంసడిభకుల్ని చంపుటకై శ్రీకృష్ణుడు ప్రయత్నించాల్సిన అవసరం లేకుండా అది దుర్వాసునివల్లనే ముందుగానే నిర్ణయమైందని శ్రీకృష్ణుడు చెప్పే సందర్భంలో "వెదకం బోయిన తీవ కాలధవిలెన్" అనే సామెతను ప్రయోగించాడు.

"మడుగు చీరకు మసితాకినట్లు" అనే సామెత కళంకితం కలిగింపజేసే వాళ్ళ స్వభావాన్ని విమర్శిస్తుంది. తెల్లని వస్త్రానికి మసితాకిన అది స్పష్టంగా కనిపిస్తుంది. అట్లే సద్వంశంలో జన్మించిన ఉష నిద్రలో వచ్చిన కలను గూర్చి తలంచుచు "నల్లపొల్లెలుగని నాకులం బనుమంచి మడుగుజీరకు జాలమైలనోకో" (5-90) అని భావిస్తుంది :

"ముల్లుతీసి కొఱ్ఱు దచినట్లు", "ముల్లుతీసి గూటం కొట్టుకొన్నట్లు" అనే సామెతలు జన వ్యవహార ప్రసిద్ధాలు. ముందే బాధల్లో ఉండే అపై ఇంకా బాధను కలిగించేటట్లు మాట్లాడే వాళ్ళ స్వభావాన్ని విమర్శిస్తాయి పైసామెతలు. నిద్రించు తనను కలలో మగవాడు కవ్వించాడని ఉష బాధపడుతుంటే వాడే నీకు తగిన భర్తయని చిత్రరేఖ పలుకగా, చిత్రరేఖను అధిక్షేపిస్తూ ఉష "ముల్లు పుచ్చికొఱ్ఱు డచిన చందమయ్యె" (5-101) అని ఉంటుంది సందర్భానికి సరిపోయే చక్కని సామెతను సోమన ప్రయోగించాడు

మానవుడు అనుకున్నవన్నీ అనుకున్నట్లు జరుగవు. అందుకే "తానొకటి తలిస్తే దైవమొకటి తలచు" అని పెద్దలన్నారు. ఇదే సామెతను సోమనాథుడు చిత్రరేఖచే "ఏ నొకటి చేయదలచిన దానొకటి దలంచె విధి" (5-135) అని పలకిస్తాడు.

"అలిగితంతే గారెల బుట్టలో పడ్డట్టు," అలిగి తంతే పరుపుమీద పడ్డట్టు" అనే సామెతల్ని కీడు కలిగించాలని ప్రయత్నించినా దానివల్ల మేలే జరుగుతుందని చెప్పే సందర్భంలో చెప్పుకోవడం కలదు. పై సామెతల్లో ఒకటి సోమన కావ్యంలో "అలిగి తన్నిన బఱుపురుయిం బడినయట్లు" (5-15) అని ప్రయోగింపబడింది.

"అద్దంలోని నీడకు ఆశపడినట్లు" అనే సామెత మానవుని అత్యాశను గూర్చి చెబుతుంది. అద్దంలోని నీడను సంపాదించడం అసాధ్యం. పారిన నీళ్ళకు కట్టవేయడం నిష్ప్రయోజనం. పై సామెతను చెబుతూ సోమన........"బోయిన నీళ్ళకు గట్టవెట్టనీ యద్దములోని నీడకెటులాస పడం బొసగుం" అంటూ వెంట వెంటనే రెండు సామెతల్ని ప్రయోగించాడు.

**శ్రీనాథుడు ;** 'కాశీఖండం'లో శ్రీనాథుడు ప్రజల వ్యవహారంలోని సామెతల్ని ప్రయోగించాడు. అగస్త్యుడు తాను కాశీనగరాన్ని విడిచిపెట్ట కూడదని భావిస్తే అతనికే కాశీ ఎడబాటు ప్రాప్తించింది. ఆ సందర్భంలో అగస్త్యుడు "........మనుజుడొక్కటి దలప దైవ మొక్కటి దలచు టెంతయు నిజంబు" (2-108) అని అంటాడు. "తానొకటి తలచితే దైవమొకటి తలచు" అనే ప్రజల సామెతకు ప్రతిరూపమే శ్రీనాథునిపై ప్రయోగం.

"ఆంబోతులు పోట్లాడి దూడకాళ్ల విఱిచినట్లు" అనే సామెత అచ్చమైన జానపదుని సామెత. బలవంతుల పోట్లాట మధ్య బలహీనుడు నష్టపడ్డాడని చెప్పడం పై సామెత భావం. ఈ సామెతను శ్రీనాథుడు అగస్త్యునితో ఇలా చెప్పించాడు. "కౌసర కాబోతునాబోతు గ్రుమ్మలాడ నడిమిలేఁబయ్యగతి వచ్చె" (2-104) ఋషుల శాపంవల్ల తన కిట్టి దుస్థితి వచ్చిందని అగస్త్యుని భావం.

ఇంకను శ్రీనాథుడు క్రింద సామెతల్ని ప్రయోగించాడు :

"ఉడుము నడికిన నడుకునే బడియ పెట్టు" (2-144)

"వంటయిలు సొచ్చె గుందేలు వనజనయన" (6-221)

'శృంగార నైషధం'లోను శ్రీనాథుడు ప్రజల వ్యవహారంలో ఉన్న అనేక సామెతల్ని, సామెతల్లాంటి వాక్యాల్ని ప్రయోగించాడు.

"నీకంటికిం బేలగింజయుం బెద్దయయ్యెనే" (1-110) అనే సామెత అల్పవిషయాన్ని కూడా అనల్పవిషయంగా భావించేవాళ్ల స్వభావాన్ని విమర్శి స్తుంది.

"పప్పులేని పులగం, ఉప్పులేని దప్పళం", "పప్పులేని పెండ్లి, ఉప్పు లేని కూర" వ్యర్థం అనే విషయాన్ని తెలియజెప్పే సామెతలు జనవ్యవహారంలో ఉన్నాయి. ఇదే భావాన్ని శ్రీనాథుడు వ్యక్తం చేస్తూ

"సౌరభము లేనియట్టి పుష్పంబువోలె
గండుకోయిల వెలియైన కానవోలె" అనే వాక్యాల్ని ప్రయోగించాడు.

సామెతలుగా ప్రచారం పొందకపోయినా సామెతల్లాంటి వాక్యలని చెప్పుకోవచ్చు.

"అంధని ప్రమానిపండ్లకు అఱ్ఱులు చాచినట్లు" అనే జనప్రసిద్ధ సామెతను పూర్వకవులు ప్రయోగించినట్లే శ్రీనాథుడు కూడా "అంధని ప్రమాకుల పండ్ల గోయం దలంచెదవు" (2-88) అని అంటాడు.

ఏదేనా ఒక పనిని చేయాల్సిన సమయంలో కాక అలస్యంగా చేసేవాళ్లను విమర్శిస్తూ "ముసలి వయసులో సముద్రమాడినట్లు" అని ప్రజలు చెప్పుకుంటారు. దీన్నే శ్రీనాథుడు మరో పోలికతో "ముదిసి ముప్పున బెండ్లి" అని అంటాడు. ముసలి వయసులో పెండ్లి అనవసరమే కదా!

మానవుని లోభత్వాన్ని వెల్లడిచేసే సామెతలు అనేకం వాడకలో ఉన్నాయి "ఎంగిలిచేత కాకిని తోలనివాడు", "పిల్లికి కూడా భిక్షం వేయడు" లాంటి సామెతల్ని ఆయా సందర్భాల్లో ఉపయోగిస్తారు ఇలాంటి భావాల్నే శ్రీనాథుడు

"పామునకు బలిపెట్టని ప్రతినవారు
ఈగకెన్నడునేనిల యిదనివారు" అనే సామెతల్లో ప్రస్తావిం చాడు.

ఒక వ్యక్తి సామర్థ్యాన్ని గూర్చి చెప్పే సామెతలున్నాయి. "నందిని పంది పందిని నంది"గా జేసే ఘటనాఘటన సమర్థులుంటారు. కలికి గల సామ ర్థ్యాన్ని చెబుతూ;

ఆవగింజలు దాటి కాయలుగనాడి
దొడ్డసేయుదు సన్నంపుదోసమైన" (7-119) అని అంటాడు. అవగింజల్ని తాటి కాయలంతగా మార్చినట్లే ఎంత చిన్న దోషమైనా పెద్దదిగా చేయగల సమర్థుడని భావం.

"చేతులు కాలినాక ఆకులు పట్టుకున్నట్లు" అనే సామెత చేయవలసిన సమయంలో చేయక అవకాశం పోయిన తర్వాత చేయాలని ప్రయత్నించేవాళ్లను విమర్శిస్తుంది. ఏటిలో నీళ్లున్నప్పుడు కట్ట కడితే ప్రయోజనం కానీ నీళ్లుపోయాక కడితే ఏమి ప్రయోజనం. ఇదే భావాన్ని శ్రీనాథుడు "పాఱెడు నీళ్లకుం గట్టపెట్టం బనియేమి?" అనే సామెతవల్ల వ్యక్తం చేశాడు.

**వేమన :** వేమన శతకంలోని అనేక పద్యపాదాలు సామెతలే. ప్రజల వ్యవహారంలోని సామెతలు వేమన పద్యపాదాలుగా మారాయో, వేమన పద్య పాదాలే ప్రజల నోళ్లలో నలిగి సామెతలుగా బహుళ ప్రచారాన్ని పొందాయో ఇదమిత్థంగా చెప్పడం సాధ్యం కాకపోవచ్చు. ప్రజాకవియని మన్ననలందిన వేమన ప్రజల అనుభవంలోని సత్యాలనే గ్రహించి ఉండవచ్చునని ఊహించవచ్చు. వేమన పద్యాల్లోని సామెతల్ని వివరించుకుంటూపోతే విషయ విరణం అధికం కావచ్చు. అందుకే వేమన పద్యాల్లోని సామెతల్ని కొన్నింటిని మాత్రమే క్రింద ఉదాహరించడం జరిగింది.

"మురికిన బాండమున మునదునీగలరీతి"
"కుక్కతోక బట్టి గోదావరీదును"
"పంటచేను విడిచి పరిగయేరినయట్లు"
"కత్తిమీద సాము కడలేని బోను"
"బొగ్గుపాలగడుగ బోవునా మలినంబు"
"కొయ్య బొమ్మనుదెచ్చి కొట్టినా పలుకునా?"
"పంది బురదమెచ్చు పన్నీరు మెచ్చునా?"
"కరినిగాంచి కుక్క మొఱగిన సామ్యమౌ"
"నూనెలేక దివ్వె నూవుల వెల్గునా"
"పచ్చికుండ నీళ్లు పట్టిన నిలుచునా?"
"గడ్డివేయ పోట్లగొడ్డు కొమ్మాడించు"

"చందన తరువందు సర్పమున్నట్లు"
"పుట్టలోన చెదలుపుట్టదా గిట్టదా ?"
"కుక్కతోకగట్ట గుదురునా చక్కగా"
"చందనంబు పునత పందియే మెఱుంగును ?"
"దొబ్బనేర్చు కుక్క దుత్తలు బేర్చునా ?"
"తిరుపతికి బోవదురక దాసరియగునా ?"
"కాశికేగ పందిగజము కాదు"
"నక్క సింహమగునే గోదావరి బోవ"
"కుక్క యిల్లుసొచ్చి కుండలు వెతుకదా ?"
"కుక్కకూయ నేమి గుఱ్ఱమునకు లెక్క"
"కొలని హంసలకడ గొక్కెరలున్నట్టు"
"చెప్పుతినెడికుక్క చెఱకు తీపెరుగునా ?"
"కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోగునా ?"
"త్రోయనేర్చు కుక్క దొంతులు పెట్టునా ?"
"తామరందు కప్ప కూర్చున్నట్టు"
"చెఱకునందు వెన్ను పుట్టినయట్లు"
"దూడవగచునే ఘుపి తోడేలు చచ్చిన"
"దాలిగుంటకుక్క తలచిన చందమా"
"పంకమందు పురుగుపడి దొర్లుచుండదా ?"
"ఉల్లితోట బెరుగు మల్లెమొక్క కరణి"
"కొండముచ్చునకును కోతియె సరియగు"
"కొండయద్దమందు గొంచమై వుండదా ?"
"తప్పులెన్నువారు తమ తప్పులెరుగరు ?"
"సేతువందమునగ క్షితికాకి తెలుపౌనె ?"
"కాశికేగ గ్రద్ద గరుడుడౌనె ?"
"బదరికరుగవృద్ధు బాలుడు కాడయా ?"
"పెరటి చెట్టుమందు పరికింప మెచ్చరు"

"ఊరకుక్క సింగమొక్కటి యగునొక్కొ"
"గ్రుడ్డి గుర్రమెక్కి గుణికినట్లుండురా ?"
"పచ్చికాయ దెచ్చి పడవేయ ఫలమౌనే"
"మాలవాడ కుక్క మఱిగిన విధమునా ?"
"తానొకటి దలచిన దైవమొండగు చుండు"
"మరగి గ్రుడ్డి కుక్క మలముదిన్నట్లు"
"కల్పతరువు క్రింద గ్రచ్చచెట్టున్నట్లు"
"నీళ్ళయందు కోడి నెలవుగామునగదా ?"
"చెప్పుకొఱుకు కుక్క చెఱకునేమెఱుంగు"
"గొడ్డుటావుపాలు కోరిన చేపునా ?"
"చిన్నచేతి దివ్వె పెద్దగా వెలుగదా !"
"శక్తి కలిగిన తూడు పట్టైడైనను బాఱు"
"తలలు బోడులైన తలపులు బోడులగునా ?"

**కొఱవి గోపరాజు :** "సింహాసన ద్వాత్రింశిక"లో సందర్భోచితంగా సామెతల్ని, లోకోక్తుల్ని వాడడం జరిగింది. ప్రజల వ్యవహారంలో ఉన్న సామెతల్ని ఉన్నవి ఉన్నట్లుగాను కొద్ది మార్పులతోడను వాడి సామెతలకు కావ్య గౌరవాన్ని సంపాదించిపెట్టాడని చెప్పవచ్చు. కొందరు తమకు తిన తిండి లేకపోయినా మిగిలిన ఆర్భాటాలు చేస్తుంటారు. "కూటికి గతిలేకున్నా కాటుక మానదు." అన్నట్లుగా ప్రవర్తించే వాళ్ళుంటారు. తినడానికి తిండిలేకపోయినా కంటికి కాటుక కావాలని ఆర్భాటం చేయడం మూర్ఖత్వమేకదా ! ఇదే భావాన్ని గోపరాజు "కడుపిటు గాలంగ కంట కాటుకయేలా?" (1-80) అనే వాక్యంలో బంధించాడు. కడుపు కాలుతుంటే కంటికి కాటుక ఏల?

అన్నీ తెలిసిన వాళ్ళ దగ్గరకు వెళ్ళి ఏమి తెలియనివాళ్ళు ఏదైనా మాట్లాడితే "హనుమంతుని ముందు కుప్పిగంతులా ?" అని విమర్శిస్తారు. చతురంగత జ్ఞుడు విక్రమార్కుని పొగడుచూ 'నీసముఖమున విద్యలను గురించి చెప్పుట అన్న' హనుమంతుని ముందు కుప్పిగంతులు వేసినట్లుంటుందంటూ;

"హనుమంతుని యెదుర వెసం గప్పిగంతులెగే యుటచుమ్మీ"
(2-49)

అని అంటాడు. శతయోజన పర్యంతం గల సముద్రాన్నే దాటిన హనుమంతుని ముందు ఎన్ని కుప్పిగంతులు వేసినా ప్రయోజనం ఉండదు కదా!

"కప్పకు కాటులేదు, బాపన పోటులేదు" అనే సామెత బ్రాహ్మణులు ఇతరులకేమీ హాని కలిగించరని చెబుతుంది. కప్ప కాటువేసినా ఏమికాదు. అలాగే బ్రాహ్మణుల వేటు కూడా, ఇదే సామెతను గోపరాజు యథాతథంగా "కప్పకాటు బాపనపోటు" (4-180) అని ప్రయోగించాడు.

స్పష్టంగా తెలిసిన విషయాన్ని తెలియజేయవలసిన అవసరం ఉండదంటూ "ముంజేతి కంకణమునకు అద్దమేలా" అనే సామెతను ఉన్నదున్నట్లుగా గోపరాజు "ముంజేతి కంకణంబున కద్దం బేటికి" (7-84) అని ప్రయోగించాడు.

సాధ్యంకాని విషయాన్ని గురించి సాధించాలని ప్రయత్నం చేయడం మూర్ఖత్వం. మూర్ఖత్వంతో కాని పనికై ఆరాటపడే వాళ్ళను విమర్శిస్తూ గోపరాజు "మూర్ఖు భారతపర్వంబు పఠింపబూనుట" అని అంటాడు. పండితులకు మాత్రమే చదువుటకు యోగ్యమైన భారతాన్ని మూర్ఖుడు చదవడం సాధ్యం కాదు కదా!

అందని చెట్టు పండ్లకై ఆశపడుట మంచిది కాదనే భావాన్ని తెలిపే సామెతను పూర్వకవులు ప్రయోగించేనట్లే గోపరాజు "అందని మ్రాని పండులకు నఱ్ఱులు సాచుటగాదె" (8-86) అని ప్రయోగించాడు. జానపదుల్లో బహుళ ప్రచారం పొందిన సామెత ఇది.

సముద్రుని పుక్కిట బట్టుట సాధ్యంకాదు కదా! అలాగే బలవంతుల్ని దుర్బల వస్తువులతో పట్టి బంధించలేమనే భావాన్ని వ్యక్తం చేస్తూ గోపరాజు "ఏనుగు చిక్కెనేని మఱి యెంపలి చెట్టున గట్టవచ్చునే" (11-27)అని అంటాడు. ఏనుగ ఎక్కడా? వెంపలి చెట్టు ఎక్కడ? ఇనుప గొలుసులతో బంధించే ఏనుగును అల్పమైన వెంపలిచెట్టున బంధించుట వీలుకాని పని.

సమయం ఉన్నపుడే ఏపనైనా చేయాలి. సమయం దాటిపోయాక చేయా

లని ప్రయత్నించడం సరియైన పద్ధతి కాదు. రాబోయే ఆపదను గుర్తించి తగిన ఉపాయాన్ని ముందే ఆలోచించే దీర్ఘదర్శులు కొందరైతే, ఆపద వచ్చినపుడు ఉపాయంతో తప్పించుకోనేవాళ్ళు మరి కొందరు. అయితే అన్ని ఆపదల్ని అప్పటి కప్పుడు తీర్చుకోవడం సాధ్యంకాక పోవచ్చు. "దప్పిక అయినపుడే నుయ్యి త్రవ్వడం" సాధ్యమౌవుతుందా? అని విమర్శిస్తారు. ఇదే సందర్భంలో గోప రాజు" ఇల్లుగాలంగ నుయ్యి ద్రవ్వనేగుటంద్రు" (11-120) అనే సామెతను ప్రయోగించాడు. ఇల్లు కాలుతుంటే నుయ్యి త్రవ్వడం సాధ్యంకాదు. నీళ్లుపడే లోపల ఇల్లు కాలి బూడిదవుతుంది.

**అల్లసాని పెద్దన :** 'మనుచరిత్ర'లో సమకాలీన సమాజంలోని ప్రజల సూక్తులు చోటు చేసుకున్నాయి. "కాని కాలానికి కర్రే పామయి కఱుస్తుంది." అనే సామెత విధివిధానాన్ని గూర్చి చెబుతుంది. దైవ ప్రయత్నంముందు మరేది పనికిరాదు. ఎపుడేమి జరగాలో ఆ సమయానికది జరుగుతూ ఉంటుందే కానీ దైవ యత్నానికి అసాధ్యమం లేదంటూ పెద్దన "దైవకృతమున కిలనసాధ్యంబు గలదె" (౩-1౩) అనే సామెతద్వారా వ్యక్తం చేశాడు.

"అంధునకు అద్దం చూపినట్లు" అనే సామెత వ్యర్థ ప్రయత్నం చేసే వాళ్ళను విమర్శిస్తుంది. కొద్ది మార్పుతో పెద్దన "అంధునకు గొఱయవెన్నెల?" (2-56) అని అంటాడు. గ్రుడ్డికి వాడికి వెన్నెల ప్రకాశం ఎలా కనిపిస్తుంది?

"తుచ్ఛ సుఖముల్ మీసాలపై దేనియల్" (2-65) అనే సామెతలాంటి వాక్యాన్ని పెద్దన మనుచరిత్రలో వాడాడు. మీసాలకు పూసిన తేనె క్షణంమే ఉంటుంది. తుచ్ఛ సుఖములు కూడా అలాంటివే!

"కులంచెడినా సుఖం దక్కవలె" అనే సామెత జానపదుల్లో ప్రసిద్ధి పొందింది. రెంటికి చెడిన రేవడికాకుండా కులం చెడిపోయినా సుఖందక్కితే చాలనే భావాన్ని పెద్దన మాయా ప్రవరునితో "వ్రతము చెడ సౌఖ్యమైనను వలయగలుగ" (౩-108) అని చెప్పిస్తాడు.

"రెంటికిచెడిన రేవడి" అనేది బహుళ ప్రచారం పొందిన సామెత. రెండు విధాల నష్టపోయిన వాన్ని విమర్శించే సందర్భంలో పై సామెతను చెప్పుకుం టాము. దీనికి సంబంధించిన అభిప్రాయాలు ఎలా ఉన్నా పై సామెతను ప్రయో

గించే సందర్భం తెలుగు సామెతల్లో చెప్పబడింది సమంజసంగా ఉంటుంది. "రేవడి = చాకలి. నీట బడినగడ్డను తీసుకొని రాబోతే గట్టునున్న గుడ్డలు దొంగ లెత్తుకొని పోయినారు. కొట్టుకొని పోయినది అట్లేపోయినది. ఇట్లు చాకలిరెంటికి చెడినాడు" (తెలుగు సామెతలు పు. 622 తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ, 1986) ఇదే సామెతను పెద్దన మార్పుచేయక "రెంటికిన్ జెడిన రేవడనౌదునే" (4-105) అని మాయ ప్రవరునితో చెప్పిస్తాడు.

"సన్నెకల్లు దాటితే పెండ్లి కాదా!" అనే సామెత పెండ్లి ఆచారాన్ని తెలిపినా ఇతరుల పనికి భంగం కలిగించాలని ప్రయత్నించే వాళ్లను అధిక్షే పిస్తుంది. ఇదే సామెతను పెద్దన "గుంత్రా దాటిన బెండ్లి యేమిటికి జిక్కుం" (5-17) అని ఇందీవరాక్షునితో పలికిస్తాడు.

"మల్లె పట్టిన చేనువలె" అనే సామెత సర్వనాశనాన్ని తెలియజెప్పు తుంది. మల్లె ఒక విధమైన చీడపురుగులాంటి కలుపుమొక్క. అది చేనులో మొలిస్తే పంట పూర్తిగా నాశనం అవుతుంది. ఈ సామెతను పెద్దన మనుచరి త్రలో ఇలా ప్రయోగించాడు :

ఊరు పాడైన గెళవుల యూళ్ళకుటికి
మెసవ దొరకొంటి 'బ్రజమారి మసగినట్లు'
తీవెగతిపయ దినముల దేశమెల్ల
'మల్లెపట్టిన చేన్క్రమంబుగాగ' (5-25)

పై సామెతతోపాటు "మారి మసగినట్లు" అంటూ మరో సామెతను చేర్చాడు. మారి అనేది ఒక వ్యాధి. ఆ వ్యాధి వస్తే విపరీతమైన జననష్టం జరుగుతుంది.

ధూర్జటి : సాలెపురుగు కట్టిన గూడు దీపపుశిఖలచే ఒక్కసారిగా కాలి బూడిదయిపోగా ఆ సందర్భంలో ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యంలో ప్రయోగిం చిన సామెతను చూడుడు :

ఇది పెక్కేడులు పట్టిన్
సదనంబుగట్ట నాకు శంభుని కొలకున్

దుది గుమ్మరికొక యేడును
గుదియకొక పెట్టన్నమాట........ (2-100)

కుమ్మరి సంవత్సరమంతా కష్టపడితే ఒక గుదియదెబ్బతో వాటిని నాశనం చేయడం సులభమన్నమాట.

నత్కీరునికి కైలాసం సిద్ధించగా అపుడు ధూర్జటి, "కైలాస మాడబోవు తీర్థమెదురైన రీతి సిద్ధించు ననుడు" (3-214) అనే సామెతను ప్రయోగించాడు. "ఆడబోయిన తీర్థమెదరైనట్లు", "వెదకబోయిన తీగ కాలికి దగిలనట్లు" అనే సామెతలు ప్రజానుభవ సత్యాలే అయినా పూర్వకవులందరిచే ప్రయోగింపబడ్డాయి.

"అలిగి తంతే పరుపుపై బడ్డట్టు" అనే సామెతను ధూర్జటి ఇలా ప్రయోగించాడు :

"విడువు విచారము నీవిక
నడవి జరింపగలుగు టలిగి పఱుపుపై
బడినగతి యయ్యె" (4-146)

**తెనాలి రామలింగడు :** 'పాండురంగ మాహాత్మ్యము'లో ఉత్తములకు ఉత్తములే జన్మిస్తారు కానీ అల్పులు జన్మించరంటూ "సాలగ్రామ ఖనిన్ జనించునె కదా జాత్యల్పపాషాణముల్" (8-84) అనే సామెతను నిగళశర్మ అక్క చేత చెప్పిస్తాడు. సాలగ్రామములుగల ఖనినుండి అల్పమైన మామూలురాళ్లు పుట్టవని భావం.

"కర్ణుడులేని భారతం" వ్యర్థమనే సామెత భారత కథకు సంబంధించింది దీన్నే రామలింగడు కొద్దిగ మార్పుచేసి "కర్ణునొదలనె భారత సంహిత నిల్చెడాద్పున్" (8-88) అని ప్రయోగించాడు. భారత కథ అంతయు కర్ణుని భుజస్కంధాలపై కలదని భావం.

"తేనపూసిన కత్తి" అని ప్రజల అనుభవసూక్తి. నమ్మకస్తునిలా పైకి నటిస్తూ పిదప మోసం చేసేవాళ్లను విమర్శిస్తుంది పై సామెత. నిగమశర్మ అక్క ఉపదేశాన్ని విని మారినవానిలా నటిస్తున్న సమయంలో తెనాలి రామలింగడు "తేనపూసిన కత్తి ధ్యాత్రీసురుండు" (8-46) అని అంటాడు.

ఒకరితో మరొకరు అన్యోన్యంగా కలసిపోయారని చెప్పుకునే సంద సందర్భంలో ప్రజలు "తలలోపల నాలుక" అనీ, "పూసలలో దారమట్లు" అనే సామెతల్ని చెప్పుకుంటారు. పై సామెతల్ని తెనాలి రామలింగడు కందపద్యంలో అందంగా ఇమిడించిన తీరు గమనింపుడు :

తలలోపల నాలుక, పూ
సల గ్రుచ్చిన నూలు పాలజల్లిన నీరుం
బలె వెల యెఱుగక మనసులు
గలసి యభేదమున గాపుకడ నతడుండెన్ (3-59)

ఇతరులకు కీడు చేయడం అటుంచి కొందరు తమ మూర్ఖత్వంతో తమకే నష్టాన్ని కలిగించుకుంటారని "గుడినుండి గుడిరాళ్లు దీసేవారు" అనే సామెత చెబుతుంది. గుడిలోపల నుండి గుడిరాళ్లు తీస్తే అవి తీసినవాడి మీదనే పడి ప్రమాదాన్ని కలిగిస్తాయి. నిగమశర్మ కాపువానింట్లో ఉంటూ వానితో సేవలు చేయించుకుంటూ చివరకు కాపుకోడల్ని లేవదీసికోని పోయే సందర్భంలో "గుడి నుండి గుడిరాళ్లు దీయుకరణి" (3-68) అని పై సామెతను వాడినాడు.

"ఆడదాని బుద్ధి అపరబుద్ధి" అనే సామెత ఆడవాళ్లను గూర్చి చెబుతుంది. కాపుకోడలు తన భర్తను కాదని నిగమశర్మతో లేచిపోయిన సందర్భంలో "ఉవిదలకు బుద్ధి పెడతల నుండు గాదె" (3-81) అంటూ పై సామెతను కొలది మార్పులతో ఉపయోగించాడు.

సుశీలోపాఖ్యానంలో సుశీల భర్త లోభగుణాన్ని వర్ణించే సందర్భంలో "ఈగకుగాటు పామునకు బలి" చేయడంటూ సామెతను ప్రయోగించాడు. "పిల్లికి భిక్షం పెట్టడు" అనే ప్రజల సామెతకు నమూనా సామెతయని చెప్పవచ్చు.

"గంధపుచెక్కలు మోసిన గాడిద వాటి వాసన అనుభవించలేదు." అని ప్రజాసూక్తి. అల్పులు ఉత్తముల సంపర్కంలో ఉన్నా సంస్కారాన్ని పొందలేరని చెబుతుంది పై సామెత. ఇదే భావాన్ని చెప్పే సందర్భంలో "తెడ్డునకు వచ్చునే పాకగుణాగుణావళుల్" (5-45) అని ప్రయోగం కనిపిస్తుంది. తెడ్డు పాకంలో తిరిగినా పాకంరుచి తెడ్డునకు తెలియదు కదా!

ఏమి చేసినా అల్పులు అల్పులేకాని బలవంతులు కాలేరని చెబుతూ "చిమ్మట సింగమే; గాజురత్నమే, కనకశలాటు కాధము కల్పఫలంబే" (౬-228) అనే సామెతల్ని తెనాలి రామలింగడు ప్రయోగించాడు.

పింగళి సూరన: "కళా పూర్ణోదయము"లో జానపదుల విజ్ఞాన ధోరణుల్ని ప్రవేశ పెడుతూ సామెతల్ని సమయానుకూలంగా ప్రయోగించాడు.

"నిండుకుండ తొణకదు" అనే సామెత నిరాడంబరుల స్వభావాన్ని వెల్లడి చేస్తుంది. ఈ సామెతను సూరన "నిండుకడవ రీతినుండు దెపుడును" (4-134) అని ప్రయోగించాడు.

ఇతరులు కష్టపడుతుంటే తాము కూడ కష్టపడాతమని చెప్పి కష్టం చేస్తున్నట్లు నటిస్తుంటారు. అలాంటి వాళ్ళ స్వభావాన్ని "ఓ బీ! ఓ బీ! నీవు వడ్లు దంచు నేను పక్కతెగరేస్తాను" అన్నట్లుగా ఉందని ప్రజలు చెప్పుకోవడం కలదు. పై సామెతనే సూరన "ప్రక్క తెగయంగ రోజుచు నొక్కక్షణము" (4-152) అని ఉపయోగించాడు.

"పేదవాని కోపం పెదవికిచేటు"అనే సామెతను యధాతథంగా "పేద కోపమెందు బెదవుల చేటుగా" (౬-80) అని వాడుకున్నాడు.

"బట్టతలకు మోకాలికి ముడివేసినట్లు" అనే సామెత సాధ్యంకాని విషయాలపట్ల ప్రయత్నించేటే వాళ్ళను విమర్శిస్తుంది. పై సామెతనే "బట్టతలలు మోకాళ్ళు ముడిపెట్టగలదో" (6-77) అని సూరన ప్రయోగించాడు.

సన్నిహితంగా ఉన్న వస్తువుల విలువల్ని గుర్తించనపుడు "పెరటి చెట్టు మందునకు పనికిరాదు" అనే సామెతను ప్రజలు చెప్పుకోగా సూరన "పెరటి చెట్టుమందు గాదు" (7-39) అని యధాతథంగా వాడుకున్నాడు.

అదృష్టం ఉంటే ప్రమాదంలో కూడా సుఖాన్ని పొందగలరని "పడబోయిన బూ కావ్పున బడుపోలిక" (4-22) అనే సామెతను సూరన ప్రయోగించాడు. "అలిగితన్నిన పరుపు పైబడ్డట్టు" అనే సామెత లాంటిదే ఇది.

ఒక విషయాన్ని గూర్చి ఏమి తెలియనిదాని దగ్గర ఆ విషయాన్ని గూర్చి చెప్పడం వ్యర్థ ప్రయాసే కాని ఫలితం ఉండదు. అలా ప్రవర్తించే వాళ్ళను

విమర్శిస్తూ "చెవిటిముందు శంఖూదినట్లు" అనే సామెతను చెప్పుకుంటారు. పై సామెతనే సూరన "జెవిటికి బట్టిసట్టి సంకునుబోలెన్" (2-96) అని ఉపయో గించాడు.

ఉత్తముల స్వభావాన్ని చెప్పు సందర్భంలో "నీటి కొలంది తామర" అనే సామెతను చెప్పుకుంటారు. నీరు ఎంతఉన్నా తామర నీటిపై తేలియాడుతూ ఉంటుంది. ఉత్తమల స్వభావం కూడా అంతే." ఉత్తముల మహిమ నీరుకొలది తామర సుమ్మీ (2-95) అంటూ సూరన తన పద్యంలో బిగించాడు.

**మారద వెంకయ్య :** భాస్కర శతకంలో లోభం, పెద్దవాళ్ళ స్వభావం, మూర్ఖుల స్వభావం, మదం, నిరాడంబరం మొదలైన స్వభావాల్ని వివరించే సందర్భాల్లో ప్రజల వ్యవహారంలోని సామెతల్ని ప్రయోగించాడు.

లోభి అయినవాడు ధనంలేనపుడే కాదు పుష్కలంగా ఉన్నపుడు కూడా కడుపునిండుగా భుజింపడని చెబుతూ "ఏరు ఎంత పారినా కుక్కకు గతుకునీళ్ళే" అనే సామెతను చెప్పుకుంటారు. ఇదే సామెత భాస్కరశతకంలో ఎంత అందంగా ఇమిడిపోయిందో చూడుడు :

"అతిగుణహీన లోభికి బదార్థము గల్గిన లేక యుండినన్
మితముగగాని కల్మిగల మీదటనైన భుజింప డింపుగా
సతమని నమ్ము దేహమును సంపద నేఋలు నిండిపారినన్
గతుకగ జూచు గుక్క తన కట్టడ మీఱక యెందు భాస్కరా
(4 వ పద్యం)

నీరు పొంగిపొర్లి పారినా గతుకుతూ తాగడం కుక్కకు సహజ స్వభా వమో అట్లే లోభికూడా!

చెడు స్నేహంవల్ల కలుగు ఫలితాన్ని చెబుతూ "నల్లులవల్ల మంచానికి కర్రదెబ్బలు" అనే సామెతను చెప్పకోవడం కలదు. చాలామంది కవులు ఈ సామెతను ప్రయోగించినట్లే భాస్కరశతక కర్త కొద్ది మార్పుతో ప్రయో గించాడు :

"అనఘునికైన జేకుఱు ననర్థుని గూడి చరించునంతలో
మనమెరియంగ నప్పుడవమానము కీడు ధరిత్రియందునే
యనువుననైన దప్పవు యథార్థము తానది యెట్టులన్నచో
నినుమును గూర్చి యగ్నినలయింపదెసమ్మెట పెట్టు భాస్కరా!"
(7వ పద్యం)

పై సామెత యొక్క భావాన్ని చెప్పేదే "ఇనుమువల్ల అగ్నికి సమ్మెటపోట్లు" అనే సామెత.

మూర్ఖుడు, నీచుడు సజ్జనులతో కలిసి తిరిగినంత మాత్రాన మంచివాళ్ల గుణాలు అలవడవంటూ "గంధపు చెక్కలు మోసినంత మాత్రాన దాని వాసన గాడిదకు అలవడదు కదా!" అట్లపాకంలో తిరిగినంత మాత్రాన తెడ్డునకు దాని రుచి తెలియదు. ఇదే భావాన్ని తెలియజెప్పే సామెత భాస్కర శతకంలో ఇలా చెప్పబడింది :

"ఎడ్డె మనుష్యుడేమెఱుగు నెన్నిదినంబులు గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందు గల తోరపువర్తనమెల్ల ప్రజ్ఞచే
ర్వృద్ధ వివేకరీతి, రుచిపాకము నాలుకగా కెఱుంగునే?
తెడ్డది కూరలో గలయ ద్రిమ్మరుచుండిననైన భాస్కరా!"
(21వ పద్యం)

బలహీనులు మదంతో బలవంతుల్ని ఎదిరిస్తే ప్రమాదం కలిగేది బలహీనులకే గాని బలవంతులకు కాదని విమర్శిస్తూ "పొట్టేలు కొండను ఢీకొట్టినట్లు" అని ప్రజల వ్యవహారంలోని సామెతను భాస్కరశతక కారుడిలా ఉపయోగించుకున్నాడు.

"తగిలి మదంబుచే నెదిరి దన్నునెఱుంగక దొడ్డవానితో
బగగొనిపోరుటెల్ల నతిపామరుడై చెడుటింతెగాక తా
నెగడి జయింపనేరడది నిక్కము తప్పదు ధాత్రి లోపలన్
దెగియొక కొండతో దగరు ఢీకొని తాకిననేమి భాస్కరా!
(80వ పద్యం)

బలవంతునితో పగ బలహీనునికే ముప్పని హెచ్చరిస్తుంది పై సామెత.

"అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను" అన్నట్లు అల్పబుద్ధి కలవాడు అధికంగా మాట్లాడితే సజ్జనుడు. బుద్ధిమంతుడు తగినంతగా మాట్లాడుతాడనే సందర్భంలో "నిండుకుండ తొణకదు" అనే సామెతను చెప్పుకుంటారు. ఇదే సామెత భాస్కర శతకంలో యథాతథంగా ప్రయోగింపబడింది.

"పలుచని నీచమానవుడు పాటి దలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుగాని మతి భాసురుడైన గుణప్రపూర్ణుడ
ప్పలుకుల బల్కబోవడు నిబద్ధిగనెట్లన వెల్తికుండదా
దొలకుచు నుండుగాని మతి దొల్కునె నిండు ఘటంబు భాస్కరా!
(64 వ పద్యం)

## చేమకూర వేంకటకవి :

కొందరు మంచినికోరి చేయబోతే దానివల్ల కూడా కష్టం కలుగుతుందని "మోక్షానికి పోతే మొసలి యీడ్చుక పోయిందట" అనే సామెత చెబుతుంది. ఇదే సామెతను "విజయ విలాసంలో" చేమకూర వేంకటకవి "మోక్షమునకు బోవ మొసలెత్తుకొనిపోయె ననెడు వార్త" (2-48) అని ప్రయోగించాడు.

"నడమంత్రపు సిరికి నెత్తిమీద కండ్లు" అనే సామెత నడమంత్రపు సిరి వల్ల గర్వం పెరుగుతుందని చెబుతుంది. ఈ సందర్భంలో విజయవిలాసకర్త :-

"........నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీగెడున్
క్షితినటుగా యొక్క కరికిన్నడు మంత్రపు గల్మి కల్గినన్" (1-84)
అని అంటాడు.

ఎటూ తప్పించుకొని పోవుటకు వీలులేని సందర్భంలో "వంట యింటి కుందేలు" అనే సామెతను చెప్పుకుంటారు ప్రజలు. ఇదే సామెత విజయవిలాసంలో "వంట యింటి కుందేలిది యెందుబోగలదు" (1-6) అని అయింది.

కొందరు పరస్పరమైన విరుద్ధ స్వభావం కలిగి ఉంటారు. ఎదుటివాళ్లేది మాట్లాడితే దానికి వ్యతిరేకంగా మాట్లాడుతారు. అలాంటివాళ్ల నుద్దేశించి "యతి అంటే ప్రతి" అనే సామెత పుట్టింది. ఇలాంటి భావాన్ని వ్యక్తం చేసే సందర్భంలో చేమకూర వేంకటకవి ప్రయోగాన్ని చూడుడు :

"యీదా దన్నను మదనుడు
కోదాదనువాడు బిగువు కొనసాగునొకో" అనే సామెతను ప్రయోగించాడు. ప్రజల వ్యవహారంలోని "ఈదాడంటే కోదాడన్నట్లు" అనే సామెతకు ప్రతిరూపకు పై పద్యపాదం.

**ముద్దుపళని :** "రాధికాస్వాంతనం"లో సామెతలు కూడా చోటుచేసుకున్నాయి.

పరధ్యానంవల్ల పొరబాట్లు చేసేవాళ్ళ స్వభావాన్ని విమర్శిస్తూ "అత్త నెత్తిన చేతులు అంగడిలో కన్నులు" అనే సామెతను చెప్పుకుంటారు. ఇదే సామెతను కొద్ది మార్పుతో.

"నందసుతుడు మున్ను నా మీద ప్రేమచే
నొకటి సేయబోయి యొకటి సేయ
నత్తమీద గన్నులంగటిపై జేతులాయె (8-28) అని చెప్పబడింది.

అవసరం ఉన్నంతవరకు గౌరవించి అవసరం తీరాక అగౌరపరచేవాళ్ల కృతఘ్నతా స్వభావాన్నిబట్టి అనేక సామెతలు పుట్టాయి. "ఒడ్డు చేరాక తెప్ప తగలేసినట్లు"గా ప్రవర్తించేవాళ్లుంటారు. గట్టు చేరాక ఎవరితోనూ, దేంతోనూ పని వుండదు. ఇదే భావాన్ని వ్యక్తం చేసే సందర్భంలో ముద్దుపళని "గట్టుచేరి బుట్టివానికి బొమ్మ కట్టినట్లు" అనే సామెతను ప్రయోగించింది.

"తగులుదాక మేళమగుపడ్డ దాళముల్
గాగజేసినట్టి కాంతలింత
గట్టు చేరినంత బుట్టివానికి బొమ్మ
గట్టు సామ్యమాయెగదవె చెలియ" (8-80)

**అయ్యలరాజు నారాయణకవి :** 'హంసవింశతి' లో జానపదులకు సంబంధించిన అనేకాంశాల్ని ప్రస్తావించడమేగాక సామెతలు కూడా అక్కడక్కడ ప్రయోగింప బడ్డాయి.

వ్యాపారుల్ని, వారి ధనసంపదను వర్ణించు సందర్భంలో నారాయణ కవి;

"కోటికి బడగెత్తుకొనియున్న దెక్కేముల్
బెక్కులై వర్ధిల్లు జేరిజనులు" అంటూ 'కోటికి బడగెత్తుకొన్న టెక్కెలట్లు" అనే సామెతను ప్రయోగించాడు. పూర్వకాలంలో ధనవంతులైనవాళ్ళు తమ స్థితిని తెలియజెప్పుటకై కోటి రూపాయలు గలవాడైతే ఒక జెండాను తమ తమ ఇళ్ళపై ఎగురవేసే వారట. కానీ ఈ సామెతను మరో అర్థంలో ఇపుడు వాడుచున్నారు. "కాసుకు గతిలేదు కోటికి పడగెత్తినాడు" అంటూ శక్తిలేక పోయినా ఆడంబరాలకై ఆరాటపడే వాళ్ళను విమర్శించి చెప్పుకుంటారు.

నిప్పుతొక్కిన కోతి ఇష్టం వచ్చినట్లు ఎగిరి గంతులేస్తుందని 'హంస వింశతిలో'

"నిలుచు చోటను నిలువక నిప్పుద్రొక్కు
కోతి చందాన జతురాఖ్యుకుండు దిరుగు" (3-156) అని ప్రయోగించాడు.

**పెదపాటి ఎఱ్ఱనార్యుడు :** 'మల్హణచరిత్ర'లోని ఒక సీస పద్యంలో ప్రజల వ్యవహారంలో ప్రాచుర్యాన్ని పొందిన సామెతలన్నింటినో ప్రయోగించాడు. అసాధ్యమైన విషయాల్ని కూడా సాధ్యంచేయగల సామర్థ్యం కలదని చెప్పే సామెతల్ని వాడాడు :

"నేలకు నింగికి నెఱయదాపలు వెట్టు
చెలరేగి రోకటి జిగురుగోయు
గడుబట్టి తలలు మోకాళ్ళను ముడివేయు
గొసరక వడగండ్ల గుళ్లుగట్టు
బూన్కిమై నంగళ్ళ బులిజున్నులమ్మించు
నయమున జట్రాతనారదీయు
నొండొండ గొండలు గుండుగా దాకించు
వదలకడు రేయి బగలుసేయు
రూఢి మెఱయంగ నిసుమున ద్రాడు బేను
లెక్కసేయక చుక్కల లెక్కపెట్టు
గాలి నొడిగట్టు మంచు గుంటాల గొలుచు
మదనమాయా కళారాధన మదనసేన" (ద్వితీయ-పుట 34,35)

మరో సందర్భంలో ధనగుప్తుడు తనవద్ద నుండి ఎవ్వరునూ ఏమీ సాధించ లేరంటూ తన పట్టుదలను వివరిస్తూ కొన్ని సామెతల్ని వరుసగా చెప్పాడు.

"ఈగకై బలి యొన్నడు నీయకుందు
పాముకై బలివెట్టను బ్రతిభ తోడ
గదిసి యెంగిలి చేతను గాకినేయ
నెఱయనాజాద నెవ్వరు నెఱుగరోయి" (ద్వితీయ - ౮౭ వ పుట)

"లోకులు కాకులు", "లోకాన్ని మూయను మూకుడున్నదే" అనే సామెతలు లోకంలోని జనులు మాట్లాడే మాటల్ని లెక్కచేయకూడ దంటాయి. లోకానికి బదులు 'చెరువు' అనే పదాన్ని చేర్చి ఎఱ్ఱనార్యుడు "చెరువు మూయను మూకుడు గలదే?" (ప్రథమ-౨౯ వ పుట) అని అంటాడు. సామెతలోని ఒక పదం స్థానంలో మరొక పదం రావడం ప్రజల వ్యవహారంలో కలదు.

**అడిదము సూరకవి :** "రామలింగేశ శతకం"లో కొందరికి కొన్ని వస్తువు లనర్థం, అనవసరం అంటూ లోకంలో ప్రచారం పొందిన సామెతల్ని ఒక పద్యంలో చొప్పించాడు.

"కోతికి జల్తారు కుళ్లాయి యేమిటికి?
విరజాజి పూదండ విధవకేల?
ముక్కిడి తొత్తుకు ముత్యంపు నత్తేల?
యుద్ధమేటికి జాత్యంధునకు?
మాచకమ్మకు నేల మౌక్తికహారంబు?
క్రూరచిత్తునకు సద్గోష్ఠియేల

.... .... .... .... .... ....

మూట నిలకడ సుంకర మోటకేల
చెవిటి వానికి సత్కథాశ్రవణ మేల
సరస కవితారసంబు ముష్కరుని కేల" (౩౨ వ పద్యం)

నీచులకు అధికారం లభించినా వాళ్ళ సహజమైన నీచ స్వభావాన్ని మాన రని తెలియజెప్పే సామెతల్ని క్రింది పద్యంలో అడిదము సూరకవి పేర్చి నాడు :

"కోతికి జల్తారు కుళ్ళాయిబెట్టిన
గోళ్ళ వ్రక్కలుసేసి కుప్పబెట్టు
కుక్కనందలములో గూర్చుండ బెట్టిన
నెంగిలాకులు నాక నిలకునుకుకు
దొడ్డపట్టంబు దొత్తుకు గట్టబెట్టిన
నదిపేడ మళకల కగ్గపఱచు
ఆడిపెను మృదుశయ్యపై జేర్చిన విడిచిబల్
పెంటగుట్టల బవ్వళింపజూచు" (88వ పద్యం)

పై పద్యంలోని సామెతలన్ని జానపదుల వ్యవహారంలో ఉన్నాయి.

స్పష్టంగా తెలుస్తున్న విషయాన్ని తెలియజెప్ప నవసరం లేదనే సందర్భంలో

"ముంజేతి కంకణంబున కద్దమేటికి?"

"తంగేటి జుంటికి దాపయేల?"

"విధవకు దలసుబ్లు వెదకనేల?" అనే సామెతల్ని ప్రయోగించాడు. (64వ పద్యం)

మొదట పాపకార్యాలు చేసి పిదప పుణ్యం కోసమై కొంత ఖర్చు పెడితే చేసిన పాపాలు పోవని హెచ్చరించే సామెతలు సీసపద్యంలో చక్కగా ఇమిడిపోయాయి.

"గోవధ గావించి గోరోజనంబు రో
గార్తుల కొసగ బుణ్యాత్ముడౌనె?
ఫలశాఖి బడమొత్తి ఫలము లేఱించి భూ
సురుల కర్పించిన సుకృతియౌనె?
నిండు తటాకంబు ఖండించి చేపలు
మత్స్య భుక్కులకంప మాన్యుడౌనె?
గుడిగొట్టి యిటికలు గూరిచి తులసితి
న్నెలు రచించిన బుణ్యనిలయుడౌనె? (70వ పద్యం)

ఆధునిక కవులు కూడా సామెతల్ని తమ తమ కావ్యాల్లో సందర్భాను గుణంగా ప్రయోగించడం జరిగింది. మచ్చునకు ఒకటి రెండు కావ్యాల్లోని సామె తల్ని చూద్దాం.

**గడియారం వేంకటశేషశాస్త్రి :** ప్రజల్లో బాగా ప్రచారం పొందిన పూర్వకవుల కావ్యాల్లో ప్రయోగింపబడిన సామెతల్ని ఎన్నింటినో శివభారతంలో పేర్కొనబడ్డాయి. గీతపద్యాన్ని సామెతల మయం చేసిన తీరు చూడుడు :

"నాథునదుపులేని నాతి, పెంచనికోతి
మావటీడులేని మత్తగజము
గరిడిలేని సాము, దొరలేని రాజ్యము
చెడునుగాదె యొరుల జెఱుపగాదే" 1-27

శివభారతంలో ప్రయోగింపబడ్డ సామెతలు :

"వెఱ్ఱిముదిరి వేదాంతిగాకు"
"పిల్లకాకి యెఱుంగునే వింటిదెబ్బ" 1-35
"అమ్మతోగలియు వహ్నికి సమ్మెటపెట్టు దప్పునే?" 1-36
"దనకు మాలిన ధర్మ పథంబు మొదలు
చెడ్డబేరము, తలమీఱు శివము నుతికి
మించు రాగము" 1-38
"తల్లికి నోచకున్న బినతల్లికి నోతురె?" 1-51
"పాసిపోయిన దక్కఉపదదు" 1-57
"పాము పడగ నీడ బందెదవు" 1-62
"ముండ్లపొదల లేదో మొగలిపువ్వు" 1-74
"అల్లదిప్పువాడె యర్జునుడు" 1-128
"యూపిరిగలదేని యుప్పుదిని యుండగవచ్చు" 1-239
"ఱెక్కలు లేని పక్షి" 1-242

| | |
|---|---|
| "పట్టినదెల్ల బంగారము" | 2-313 |
| "కనులు చేద్వడ గాటుక దిద్దుటొప్పునే" | 3-56 |
| "కాయకయి కొమ్మకు దప్పునె జాలరువ్వుటల్" | 4-18 |
| "గతజల సేతుబంధనము కార్యముగాదు" | 4-33 |
| "ముల్లుముల్లు గొనిపుచ్చక కొఱ్ఱున గ్రుమ్మివైతురే" | 4-38 |

**దుర్భాక రాజశేఖర శతావధాని :-** "రాణాప్రతాప సింహచరిత్ర"లో అనేకమైన జానపదుల సామెతల్ని సందర్భానుగుణంగాను, యథాతథంగాను, కొద్ది మార్పులతోడను ప్రయోగించాడు. వీరి సామెతం ప్రయోగాన్ని గూర్చి పీఠికలో శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు "సందర్భానుసారముగ లోకోక్తులు మొదలైనవి కుప్పలు తెప్పలుగా నుండి ఆంధ్ర సరస్వతికి క్రొత్త భూషణముగా నున్నద"ని కొనియాడిరి. (పుట. 10) వీరు ప్రయోగించిన సామెతలు క్రింది విధంగా ఉన్నాయి.

| | |
|---|---|
| "ముసళ్ల పండువది ముందేయున్నది" | 1-23 |
| "ఎవరికివారే యమునాతీరే" | 1-26 |
| "గోరుచుట్టుపై రోకటిపోటు" | 1-27 |
| "చుక్క తెగిపడ్డ కైవడి" | 1-94 |
| "సింగపుం గొదమ విధాన" | 1-95 |
| "పెదవి దాటిన పల్లు" | 1-269 |
| "కౌలవితో దంగోకిన యట్టులుండదే" | 1-290 |
| "తాతకును దగ్గన్ నేర్పు ధీశాలివా" | 1-296 |
| "తల్లి జంపువానికి పినతల్లి చేతులు గణింపడు" | 1-351 |
| "కొంగు పసిడివోతె" | 1-388 |
| "పిల్లికిన్ జ్వరమనంగా ఇల్లె" | 2-51 |
| "ముంజేతినుణి జూడయద్దమేల" | 2-62 |
| "క్షుద్బుభోయి కూశల రుచియడుగనేల" | 2-62 |

| | |
|---|---|
| "లేడిపయి దూకుసింగంబు" | 2-280 |
| "కడుపులో జల్లయిటునటు కదలకుండ" | 2-282 |
| "తాజెడ్డ కోతి వనమంత చెఱచునన్" | 2-302 |
| "ఈనినపులి యట్టులెగిరి" | 3-10 |
| "కుమ్మరికేడున్ గుడె కొక్కనాడు" | 3-289 |
| "పిల్లి చెరలాటమాడునట్లు" | 3-294 |
| "ముందున్నది ముసళ్ళపండువు" | 4-30 |
| "పాలపడిన విషమట్లు" | 4-317 |
| "కంటిలో బడిన ముల్లునటు" | 4-317 |

శిష్టసాహిత్యంలో జానపదుల సామెతలెట్లు సందర్భానుగుణంగా ప్రయోగించబడ్డాయో సాధ్యమైనంతవరకు పరిశీలించడం జరిగింది.

# పొడుపు కథలు

మానవునికి వినోదంతోపాటు విజ్ఞానాన్ని కలిగించేవి పొడుపు కథలు. పొడుపు కథనే శాస్త్రమనీ, మారుకథ అనీ అంటారు. "ఇచ్చుకత విచ్చుకత, విప్పు కత, అడ్డకత, అడ్డుకత, ఒడ్డుకత అనే పేర్లు కూడా ప్రచారంలో ఉన్నాయి"[1]

పొడుపు కథనే ఆంగ్లంలో Riddles అని, కన్నడంలో ఒగటు, ఒగటిన కథె అనీ, తమిళంలో విడుకత్తై అని అంటారు.

జీవితంలో సమస్యల్ని విడగొట్టడానికి మనిషి చేసే ప్రయత్నమే వీటికి ప్రేరణ"[2] అని ఆర్వీయస్. సుందరంగారి అభిప్రాయం.

"పొడుచుట, విప్పుటలో ఆనందమును వెల్లివిరియించునవి పొడుపు కథలనీ" శ్రీ నేదునూరి గంగాధరంగారు, "శాస్త్రార్థమెంత కఠినమో దీనిని విడదీయుట యంతకష్టమని జాబోలు పొడుపు కథలకు శాస్త్రములని పేరు వచ్చెననీ" డాక్టరు బి. రామరాజుగారు అన్నారని[3] శ్రీ ఆర్వీయస్ సుందరంగారు పేర్కొనిరి.

**"Riddles are questions that are framed with the purpose of confusing or testing the wits of those who do not know the answer."[4]**

పొడుపు కథల ప్రస్తావన తెలుగు శిష్టసాహిత్యంలో అక్కడక్కడ కనిపిస్తుంది. పొడుపు కథను లోకకథా, ప్రహేళికా అంటారని శ్రీనాథుడు 'శివరాత్రి మాహాత్మ్యం'లో ప్రస్తావించాడు.

---

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పుట. 197 ఆం.ప్ర.సా.అ. 1988
2. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పుట. 196 ఆం.ప్ర.సా.అ. 1988
3. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పుట. 197 ఆం.ప్ర.సా.అ. 1988
4. **Folk Lore and Folklife. Richard M. Dorson (Ed.) P. 130**

"ఒక కొంతప్రొద్దు లోకకథా ప్రహేళికా
బిందుమత్యాదుం బిచ్చలించు" (2-87)

ఎఱ్ఱన : ఆంధ్ర మహాభారతంలో పొడుపుకథా లక్షణాలు గల పద్యాలు యక్షప్రశ్నల ఘట్టంలో కలవు. యక్షుడు వేసే ప్రశ్నలకు ధర్మరాజు సమాధానాలు పొడుపుకథా పద్ధతిలోనే సాగినట్లు కన్పిస్తాయి :

యక్షుడు వేసిన ప్రశ్న :

దినకరు నెయ్యది నడుపును
దినకరునెవ్వారు గొలిచి తిరుగుదురద్దే
వుని యస్తమించు టేమిటి
ననఘ తదాధార భూతమదియెయ్యదియో (7-422)

పై ప్రశ్నలకు ధర్మజుని సమాధానం ఇలా ఉన్నది :

'అనిన ధర్మజుడిట్లను' నబ్జహితుని
నడుపు బ్రహ్మంబు సురకోటి నడచు గొలిచి
ధర్మచే నస్తమితుడగు దపనుడమ్మ
హాత్మునకు సత్యమాధార మంద్రుబుధులు (7-423)

మరలా యక్షుని ప్రశ్న :

ఏమిట శ్రోత్రియుడగుజను
నేమిట గడు మహిమవడయు నిమ్మగబురుషుం
డేమిట సహాయయుతుడగు
నేమిట నగుబుద్ధిమంతు డేర్పడ జెపుమా (7-425)

ధర్మజుని సమాధానం :

శ్రుతమువలన శ్రోత్రియుడగు
నతుల తపోయుక్తిగడు మహత్త్వము వడయున్
ధృతిచే సహాయయుతుడగు
నతిశయముగ బుద్ధిమంతుడగు బుధసేవన్ (7-427)

యక్షుని ప్రశ్న :

ఏమి కతమున భూదేవు డెసగుదేవ
భావమున నాతనికి సాధుభావమెవ్వి
ధమున నగు నసాధుత్వమె ద్దానజేఁదు
మానుషుండగు నాతడేవాన జెపుమ (7-429)

ధర్మజుని సమాధానం :

"అనవుడు ధర్మజుం డనియె నధ్యయనంబున దేవభావముం
గను నవనీసుపర్వు డధిక వ్రతశీలత సాధుభావ మా
తనికి విశిష్టవృత్తి దిగద్రావి యసాధువనంగ నుండు శౌ
చనియతి లేక మృత్యుభయ సంగతి నాతడు మానుషుండగున్" (7-430)

యక్షుడు "జీవన్మృతు డెట్టివాడని" ప్రశ్నింపగా, ధర్మరాజు "దేవాతిధి పితృభృత్యజనావళులకు నిడక కుడుచునతడ"ని (7 - 48) సమాధానం చెప్పెను.

మరియు యక్షుడు ధర్మరాజు నిట్లు ప్రశ్నించెను :

"ఏది మగుడంగ వాడు పృథివీపతి జూచి ధరిత్రికంటె ప్రే
కనయగుదాని, నాకసముకంటె గడుం బొడవైనదాని, గా
డ్పునకు నెక్కుడై జవము పొంపిరి వోయెడు దానిబారికం
బెను దటమైన దానిని మటింపగ జెప్పుము నాకు నావుడున్" (7-432)

ధర్మరాజు సమాధానమిట్లున్నది :

తల్లి వేగు సువ్వె ధరణికంటెను, నాక
సంబు కంటె బొడవు జనకుడరయ
గాడ్పుకంటె మనసు గడుశీఘ్రగతి, తృణో
త్కరముకంటె జింతగరము తఱచు (7-434)

యక్షుడు వేసిన తర్వాతి ప్రశ్నలు ఇలా ఉన్నాయి :

"మొనసి నిద్రించియును గన్నుమూయదెద్ది,
పుట్టియును జేతనత్వంబు బొరయదెద్ది
యరయ రూపుగల్గియు హృదయంబులేని
దెద్దివేగంబు కతమున నెద్దివొలుచు" (7-436)

ఈ పద్యం అచ్చమైన పొడుపు కథలతో నిండి ఉండగా వాటిని విప్పుచు ధర్మరాజు చెప్పిన సమాధానము ఇలా ఉంది :

"అనిన గన్నుమూయదు సుప్తమయ్యు మీను
పుట్టియును గ్రుడ్డు చేతనం బొరయకుండు
హృదయ రహితంబు రారూప మేఱురయము
కతన వర్తించు నని చెప్పె గౌరవుండు" (7-437)

యక్షుని మరో ప్రశ్న :

"ఎయ్యది ధర్మువునకు గుదు
రెయ్యది యాశ్రయము గీర్తికి మ్మగుమార్గం
బెయ్యది సురలోకమునకు
నెయ్యది సుఖములకు నిక్కమేర్పడ జెపుమా" (7-439)

ధర్మరాజు సమాధానం :

"అమరగ దాక్షిణ్యము ధ
ర్మమునకు గుదురంద్రు కీర్తిమహిమ నెలవుదా
నము సత్యము సురపురి మా
ర్గము శీలము సంశ్రయము సుఖంబులకెల్లన్" (7-441)

యక్షుడు వేసిన ఇంకో ప్రశ్న :

"నరునకు నాత్మయెవ్వడు ఘనంబుగ దైవికమైన చుట్టమె
వ్వరతనికిం దదీయ మగువర్తనమేమిట నిర్వహించు భూ
వర యతడేమి పూని యనపద్యత బొందు నెఱుంగ జెప్పుమీ
వరుదుగ నన్న" (7-443)

ధర్మరాజు సమాధానం చెప్పిన విధం :

"ఆత్మజుడు సువ్వె పురుషున కాత్మయయ్యె
నాతనికి భార్య దైవికమైన చుట్ట
మతని జీవిక పర్జన్యుకతన జెల్లు
నతడు దానము గొనియాడి యతికయిల్లు (7-444)

ధర్మజుని సమాధానం విన్న యక్షుడు మరలా ఇలా ప్రశ్నించాడు :

"అనవిని మేటిధర్మ మగునట్టిది యెయ్యది యెట్టిదెప్పుడున్
గునియగ బండియుండు విదితంబుగ నెయ్యది నిగ్రహించినం
దనరు ప్రమోదసిద్ధి నియతంబుగ నెవ్వరితోడి సంధి యెం
దును వికలంబుగాదు" (7-445)

పై ప్రశ్నలకు ధర్మరాజు సమాధానం ఇలా ఉంది :

"విను మహింస మేటి యనంజను ధర్మంబు
యోగకర్మ మెపుడు నమరబండి
యుండు మనసు క్రొవ్వ ఖండింపగామోద
మెసగు సుజన సంధి యెడలదెందు" (7-447)

యక్షుడు వేసిన ప్రశ్న :

....లోకమున కెయ్యదియు దిక్కు
జలమునన్నము నెద్దాన సంభవించు
విషమనంగ నెయ్యది శ్రాద్ధవిధికినెద్ది
సమయ మనిన.........." (7-449)

ధర్మరాజు చెప్పిన సమాధానం :

"సజ్జనులు దిక్కుసూవె యీ సర్వమునకు
నభము ధరణియు జలము నన్నమ్ము నుద్భ
వించు నెంవులు విషమగు విప్రధనము
లనఘ శ్రాద్ధకాలము బ్రాహ్మణాగమంబు" (7-449)

పైవన్నియు కూడా ప్రశ్నోత్తర రూపంలో ఉండే పొడుపు కథలని చెప్ప వచ్చు.

రంగనాథ రామాయణంలో బాలకాండంలోని అవతారికలో తాత్త్వికార్థంతో కూడినది, సంఖ్యావాచక సంకేతాల్ని యిముడ్చుకొన్న పొడుపుపద్యం కలదు.

"ముగిరెంట బెరయక మూటనేర్పడక
తగనాలుగింటను దావుగైకొనక
ఐదింటికాదియై ఆఱిటిగడచి
యాడికినాదియై అమరినరేపు"

ఇందులో 'రెండు' అనగా సుఖదుఃఖాల్లాంటి ద్వంద్వాలనీ
'మూడు' త్రిగుణాలనీ
'నాలుగు' ధర్మార్థ కామమోక్షాలయిన పురుషార్థాలనీ
'ఐదు' పంచభూతాలనీ
'ఆరు' అరిషడ్వర్గమనీ భావం.

2, 3, 4, 5, 6 సంఖ్యల్లోని సంకేతాల్లో తాత్త్వికార్థాన్ని దాచుకున్న పొడుపుకథయని చెప్పవచ్చును.

వేమన పేరుతో ఉన్న పద్యాల్లో, వేమన పద్యాలే అని ప్రచారంలో ఉన్న పొడుపుకథల్లాంటి పద్యాల్లో వేదాంత సంబంధాలు కలవని చెప్పవచ్చు:

"ప్రజలెఱుంగ బ్రదుకు బట్టభద్రుడుగాడు
పై గిరీటముండు బ్రహ్మగాడు
ఓగుదెలిసి పలుకు యోగీశ్వరుడుగాడు
అట్టివాని దెలియనగునే వేమా" (94 పుట. 691)

(త్రాచుపాము) అని అర్థం.

"చరణంబులు పదితోకలు
పరగంగా మూడుతలలు బైటనె తిరుగున్
ధరభూమి తల్లడిల్లగ
నిరవొందగదీని తెలియనీశుడు వేమా" (94 పుట. 690)

(నాగలిదున్నుట) అని భావం.

ఇలాంటి ఉదాహరణలు కన్పిస్తాయి.

బూరెల సత్యనారాయణ కృతమని ప్రసిద్ధి పొందిన 'తిరుమలేశ' శతకం లోని పద్యాలు కొన్ని సమస్యలతో కూడిన పొడుపు కథల్లా ఉంటాయి :

"కుతిక నలుపుగాని శితికంధరుడుగాడు
పాముకాదు, నెమలి పక్షిగాదు
గంతులిడుచు, నడచుగ ని కప్పయుగాదు
దీని భావమేమి తిరుమలేశ !"

(ఊరపిచ్చుక) అని భావం. (డా. ఆర్వీయస్. సుందరంగారు ఆంధ్రుల జానపద విజ్ఞానంలో ఉదాహరించారు.)

డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డిగారు తమ సిద్ధాంత గ్రంథంలో ఉదాహరించినది;

తలయు తోకనుండు పలుకనాలుకలేదు
కండ్లు గలవుగాని కానరావు
పట్టిచూడనందు ప్రాణమే యుండదు
దీని భావమేమి తిరుమలేశ ! (పుట. 22)

(పాము కుబుసము) అని భావం.

# జానపద కళలు

కళలు అరవైనాలుగు అని పేర్కొన్నా వాటి సంఖ్య అంతకు మించి పోయిందని చెప్పవచ్చు. "మానవుని సౌందర్య పిపాసయు, సుఖతృష్ణయు ఎక్కువైన కొలదియు, ఆ సిద్ధికై అతడు కల్పించుకొను సౌకర్యములన్నియు కళలే యైనవి కావున నేటి మానవ ప్రపంచమున కళావిద్యా సంఖ్యలను నియతముగా చెప్పుట సాధ్యముకాదు"[1] అని శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు అభిప్రాయపడ్డారు. జానపద కళలు అన్నపుడు సంగీత, నృత్య రూపకాల్ని మూడింటినే చాలా మంది పరిశోధకులు, పండితులు పేర్కొనడం జరిగింది. అయితే ఈ మూడింటికి ఇతర జానపద కళలకు అవినాభావ సంబంధం ఉంటే ఉండొచ్చు. కానీ జానపద కళలన్నపుడు ప్రధానంగా పై మూడింటినే చెప్పుకోవడం కలదు. డాక్టర్ ఆర్వీయస్. సుందరంగారు జానపద కళల్ని "సంగీతం, నృత్యం, రూపకం"[2] అని మూడు ప్రధాన భాగాలుగా విభజించారు. బయలాటలు, బొమ్మలాటలు, వీధిభాగవతాలు, తోలుబొమ్మలాటలు మొదలైనవి రూపకాలుగా పేర్కొన్నా వీటిని నృత్యాల క్రిందికి చేర్చే అవకాశం కూడా కలదు. పైన పేర్కొన్న రూపకాల్లో సంగీతం, నృత్యం, సంభాషణలు కలిసి ఉండటం వల్ల కేవలం రూపకాలుగానే కాక మిశ్ర కళలని పేర్కొంటూ అవసరమైనచోట కొందరు నృత్యకళ క్రింద చేర్చారు. ప్రస్తుత అధ్యాయంలో నృత్యకళను గూర్చి చర్చించుట ప్రధానాంశం.

తెలుగు సాహిత్యంలో నన్నయ, పాల్కురికి సోమన, నన్నెచోడుడు, తిక్కన, నాచన సోమన, శ్రీనాథుడు, వల్లభరాయుడు, గౌరన, పెదపాటి ఎర్రన, శ్రీకృష్ణదేవరాయలు, తరిగొప్పుల మల్లన, రాయసం వెంకటపతి, రఘునాథరాయలు, కంకంటి పాపరాజు, కనుపర్తి అబ్బయామాత్యుడు, అయ్యలరాజు నారాయణకవి, మారద వెంకయ్య మొదలైన కవులు తమ కాలంనాటి నృత్యాల్ని, నృత్యభంగిమల్ని ప్రస్తావించడం జరిగింది.

---

1. సాహిత్య శిల్పసమీక్ష. పుట. 16. క్వాలిటీ ప్రచురణ 1981.
2. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పుట. 441. ఆం.ప్ర.సా.అకాడమి 1983

**నన్నయభట్టు:** ఆదికవియైన నన్నయ గిరిజనుల్లో కన్పించే ప్రసిద్ధమైన కొండపూజను వర్ణించాడు. శ్రీకృష్ణుని సమక్షంలో పౌరజనులందరూ రైవతకాద్రిని పూజించుటకై వెళ్లారు. పురజనులందరు వస్త్రభూషణాల్ని అలంకరించుకొని మృదంగ, వేణు, కాహళ, పటహాది వాద్యధ్వనులు మ్రోగుచుండగా ఆటలాడుచూ, పాటలు పాడుచూ వెళ్లారట:

"పొలుపుగ బూసి గట్టితో భూరి విభూతి ప్రకాశితంబుగా
గలయగదత్పురీ జనులు కాంస్యమృదంగ ముకుందవేణుకా
హాళిపలు వాద్యముల్ చెలగనాటలు బాటలు నొప్పనెల్ల వా
రలు జని చేసి రర్చనల్ రైవత కాద్రికి నుత్సవంబుతోన్"[3]

జానపద నృత్యకళను రంగరించుకొన్న పద్యమిది. గిరిజన నృత్యాల్లో కొండను పూజించి నృత్యం చేయడం గిరిజన సంస్కృతికి నిదర్శనం.

పండుగ దినాల్లోనూ, ఉత్సవ సమయాల్లోనూ గిరిజనులు సురాపానంచేసి ఆడిపాడుతుంటారు. జానపదుల జాతర్లలో కూడా తాగి నృత్యం చేయడం సాధారణంగా కనిపిస్తుంది. యాదవులు మధువును సేవించి, ఆడిపాడటం నన్నయ భారతంలో కన్పిస్తుంది:

"గురుచయుగ్మముల్ గదలగొమ్ముడు లందుల పుష్పముల్ పయిం
దొరగని దాగబంధు నితతుల్ చెదరన్ మదిరా మదంబునం
బరవశలయ్యు నింపెసగ బాడుచు దాళముగూడ మెట్టుచుం
దరుణియలొప్పనాడిరి ముదంబున దమ్మజనాళి మెచ్చగన్"[4]

**నన్నెచోడుడు:** 'కుమార సంభవం'లో శబరస్త్రీలు కల్లు త్రాగిన మత్తులో గౌడుగీతాల్ని పాడుచు ఆడుచున్నారనీ, లాస్యనృత్యాన్ని చేస్తున్నారనీ వర్ణించాడు. పార్వతి తపస్సు చేయుటకై అడవికి వెళ్లగా అచట ఒకచోట మద్యపాన మత్తులై పాటల్ని పాడుచూ ఆడుచున్న శబరస్త్రీలను చూచిందట:

"జీటిక కల్లుద్రావి మదసింధురగామినులన్ని కేలియల్
వాలుచు గౌడుగీతములు వాడుచు బాల్పుగ గ్రాలియాడుచున్

---

3. ఆంధ్ర మహాభారతం. ఆది. 8-174.
4. ఆంధ్ర మహాభారతం. ఆది. 8-175.

గోఱడ మాడుచున్ ఖతులకున్ వళవర్తులుగాక మేరకున్
మీఱుకో వన్నెకాంతలు రమింతురు తద్విపినాంతరంబునన్"[5]

మరో సందర్భంలో కాముక కామినీ జనుల రతిలీలల్ని వర్ణించే సందర్భంలో లాస్యనృత్యాన్ని పేర్కొనడం జరిగింది.

"గళనాదంబులు మంజుగానములుగా గాంచలనత్క్రాంకిణీ
కలనాదంబులు హృద్యవాద్యములుగా గాంతోరు పీఠోన్నత
స్థల రంగమ్ముల గాముడన్నటక దోజంగూడ నాడింపగా
లలనా పాత్రములాడి రొప్పరతి లీలా లాస్యలోలాస్యలై"[6]

నృత్యం లాస్యం, తాండవం అని రెండు విధాలు. పురుషులు చేసేది తాండవమైతే స్త్రీలు చేసే నృత్యాన్ని లాస్యం అంటారు. నన్నెచోడుడు శబర కామినుల నృత్యాన్ని లాస్యం అని పేర్కొవడం ఔచిత్యవంతంగా ఉందని చెప్పవచ్చు.

**పాల్కురికి సోమన:** సోమనాథుడు తన గ్రంథాల్లో జానపద కళల్ని ఎన్నింటినో ప్రస్తావించాడు. దేశినృత్యాల్ని ప్రవేశపెట్టిన ఘనత సోమనాథునికే దక్కిందని చెప్పిన అతిశయోక్తికాదు. సోమనాథుడు కోలాటం, గొండ్లి, ప్రేరణి, ప్రేంఖణం, కుంభం, యక్షగానం, తోలుబొమ్మలాట మొదలైన నృత్యాల్ని, దేశినృత్య నడకల్ని, పక్షుల్ని, జంతువుల్ని అనుకరించిచేసే వివిధ నృత్యాల్ని వివిధ సందర్భాల్లో ప్రస్తావించాడు.

**పండితారాధ్య చరిత్రం:** మహిమ ప్రకరణంలో 'ధవళేశ్వర చరిత్ర కథనము'న భక్తులందరూ భక్తి సమగ్రత మెరయ ఆనంద శంకర గీతాల్ని పాడుచు శివలీలల్ని నృత్యంచేసి ప్రదర్శిస్తున్నారని వర్ణించాడు:

"ఆనందగీతంబులర్థి బాడుచు శి
వానంద లీలల నలరియాడుచును

---

5. కుమార సంభవం. 6-45 ఆం.ప్ర. సాహిత్య అకాడమి 1968
6. కుమార సంభవం 8-180 ఆం.ప్ర. సాహిత్య అకాడమి 1968

శంకరగీతముల్ సరసఁబాడుచు
శంకర లీలల జతులకాడుచు"[7]

శివానంద, శంకరలీలలు శ్రీకృష్ణలీలల్లాంటి జానపద నృత్యాలయి ఉండొచ్చు.

'వాదప్రకరణం'లోనూ భక్తులు పాటలు పాడుచు ఆడారని చెప్పబడింది :

"వరతపోనిష్ఠకు వ్యాఘ్రపాదునకు
నరుదొంద గిరుఱించి యాడెడువాడు
గడునర్థి గుండయ్య కడపలు వరుస
నడరు వాద్యము జతిగాడెడువాడు"[8]

'నక్షత్ర పర్వతారోహణము'న సోపానాల్ని ఎక్కుతూ భక్తులందరూ పాటలు పాడుతూ చిందులువేస్తూ నడచుచున్నారని క్రింది పాదాలు వెల్లడి చేస్తాయి :

"గనుకని పాటలుగట్టి పాడుచు
జనిజని చిందులు జతులకాడుచు"[9]

మరియు,

"యనుచు జిందులువెట్టి యాడుచు బాడు
చును నెల్లవరుస యుత్సుకతనేతేర"[10]

'పర్వతప్రకరణం'లో శివరాత్రి ఉత్సవాల సమయంలో భక్తులత్యంత ఉత్సాహంతో జయఘోషలు చేస్తూ ఆడుతూ పాడుతూ వస్తున్నారని వర్ణించిన ఘట్టంలో చిందులు, కోడంగియాటలు. పేరిణి, బహునాటకములు, బహురూపములు, వెడ్డంగం, బొమ్మలాటలు మొదలైన నృత్యాల్ని ప్రస్తావించడం జరిగింది :

"జప్పట్లు వెట్టంగ జక్కనలేచి
యప్పాట వెడయాట లాడెడువారు

---

7. పండితారాధ్య చరిత్రం. పుట. 176 ఆంధ్ర పత్రికా ముద్రశాల 1939
8. పండితారాధ్య చరిత్రం. పుట. 704 ఆంధ్ర పత్రికా ముద్రశాల 1939
9. పండితారాధ్య చరిత్రం. పుట. 700 ఆంధ్ర పత్రికా ముద్రశాల 1939
10. పండితారాధ్య చరిత్రం పుట. 389 ఆంధ్ర పత్రికా ముద్రశాల 1939

వేడుకతో జిందులాడంగ నుబ్బి
కోడంగి యాటలగుని సెడువారు
బన్నని నిజదేశభాషల జతుల
కన్నికోడంగాట లాడెడువారు
భమరముల్ సాళముల్ బయకముల్ మెఱసి
రమణ బంచాసి పేరణి యాడువారు
ప్రమథ పురాతన పటు చరిత్రములు
గ్రమమొంద పహునాటకము లాడువారు
లలితాంగ రసకళాలంకార రేఖ
లలవడ బహురూపము లాడెడువారు
గరణముల్ ఘెరవణుల్ గతులు జిత్రములు
నరుదుగ వెడ్డంగ మాడెడువారు
నమరాంగనలు దివి నాడెడుమాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు
నావియద్గతి బత్తులాడెడునట్టి
భావన మ్రోకులపై నాడువారు
భారతాది కథల జీరమఱుగుల
నారంగ బొమ్మల నాడించువారు
గడు నద్భుతంబుగ గంబసూత్రంబు
లడరంగ బొమ్మలనాడించువారు
నాదట గంధర్వయక్ష విద్యాధ
రాదులై పాడెదు నాడెడువారు
వివిధ ప్రచ్ఛన్నవేషముల్ దాల్చి
యధికోత్సవము దులుకాడనట్లాడు"[11]

భరతశాస్త్ర లక్షణాల్ని తెలుపు సందర్భంలో భక్తులు వేయుచున్న వివిధ నడకలు వివరంగా పేర్కొనబడ్డాయి :

సహజమైన తనుగతిస్వర పంచకములు
బటురసాలంకార భావముల్ దనర

11. పండితారాధ్య చరిత్రం. పుటలు. 484, 485, 486

స్ఫుటవాద్య తాళసంఘటన మటిల్లి
దనుపాద ఘట్టన దనరు ఘటన
లను నటించుచు నందియల్ గదల్చుచు
నోహో! యనుచు లాసమను నయించుచును
జతులు వాడుచు దాళగతుల కాడుచును
శ్రుతుల గూడుచు నేలద్రొక్క నోడుచును
వీగుచు కరణికల్ విస్తరించుచును
లోగుచు దంతావళుల్ నటింపుచును
బొబ్బలు వొడుచుచు బొంగియార్చుచును
గుబ్బన లేచుచు గునిసియాడుచును
జాలుమ జంగలు సాపుచు మంది
నూటించుచును మొగంబోలవుచ్చుచును
జంక జూపుచు బయల్ సప్పరించుచును
జంకల డిచికొనుచు శంకరుజాడు
చును నులుకుచు గ్రేళ్లు నూపుచు బన్ని
కొనుచు గంతులువైచుచును మటికట్లు
వెడమటించుచు వ్రేళ్ల విడికిలించుచును
నొడలడంచుచు నురం బొగ్గుచు వీపు
విఱిచికొనుచు బురివిచ్చుచు మోము
బొటడువుచ్చుచు భుజంబులు బవియుచును
మోకాళ్ల దొడలును ముడివఱచుచును
గూకటి గిఱుపుచు గోకటించుచును
మూతులు నలుపుచు మురుతటింపుచును
మోతకు నుబ్బుచు మురియుచు జనుచు
మిన్నక చూచుచు మెడవిర్చికొనుచు
గన్నులార్చుచు జెవుల్ గత్తిరించుచును
వెల్వెలలాడుచు వెక్కిరించుచును
గవ్వదండల యందు గతులు వుచ్చుచును
బొమలెత్తి వైచుచు బుగ్గరించుచును

ధమకించి దాటుచు దండలిచ్చుచును
గొంకుచు వడకుచు గొసరుచు మూడు
వంకలఁబోవుచు శంకించుకొనుచు
బిరుచే వ్రేయుచు బకపకనగుచు
గరముబ్బుచును జొల్లు గాఱిచికొనుచు
సరసంబులాడుచు జప్పటలిడుచు
విరసంబులాడుచు విఱ్ఱవీగుచును
నొడ్డోలగంబులో నొఱసి తిర్గుచును
నడ్డంబు ద్రికటంబు నన్నివాడుచును
మరగాళ్ల నడచుచు మట్టిగాళ్లగుచు
నారుగాళ్ల నడచుచు ధరణిగొంతుగొనుచు
మ్రోకాళ్ల నడచుచు మొగినేలగాళ్ల
దాకుచుఁద నెగసి తటుకన బడుచు
గూర్చుండి నడచుచు గుప్పించి యచట
నార్చుచు మెఱము లందందవైచుచు
నురమున నడచుచు నొడికిల జనుచు
వరబొరలుచు సముద్ధతికేచి చనుచు
నుర్విఁద్రిప్పటమున నొకవ్రేల యుడియు
గుర్వుగా దిరుగుచు గుర్వించుకొనుచు
గరతలంబాని శ్రీభ్రమ సారియట్లు
ధర దిరుగుచు దెసల్దన్ని నిల్చుచును
తిరుగుచు వెలిదన్ని తివుట నిల్చుచును" అంటూ దేశి నృత్య రీతుల్ని పేర్కొనడమేగాక భక్తులు పక్షుల్ని, జంతువుల్ని అనుకరిస్తూ చేసిన నృత్యపద్ధల్ని కూడా ప్రస్తావించాడు.

"నెమలియు బోలె నున్నతి నటించుచును
భ్రమరంబు క్రియనుదా బరిఘటించుచును
జిలుకయు బోలె జనుల కుల్కుచును
గలహంసయును బోలె గతులనేర్చుచును
నిలమృగమట్లిరిమిరిమి చూచుచును

గండుగోయిలవోలె గడగికూయుచును
వెండిక్రొతియుబోలె వికృతి సేయుచును
నాలతేడును బోలె నటయిటసనచు
గోలికాడునుబోలె గోర్మెన గొనుచు
మదగజంబును బోలె మాఱు మలయుచును
బొదలి వ్యాఘ్రంబట్ల పొంటి నులియుచును
గేసరివోలె లంఘించి పట్టుచును
మాసటీడును బోలె మడ్డివెట్టుచును
మహిభుజంగము వోలె మలకలుగొనచు
విహంగంబు క్రియ నభోవీధిని జనచు"[12]

మరియు శివలీలల్ని ప్రదర్శిస్తూ భక్తులు నృత్యం చేశారట :

"మాయలేని పురారిమాడ్కి నొప్పుచును
బురములు గాల్చిన పోల్కియాడుచును
మరుజిఱువుచ్చిన మాడ్కినాడుచును
సతికర్థమిచ్చిన చందమాడుచును
యతుల గొల్వగనున్న యందమాడుచును
నంధకాసురు మదంబడచుటాడుచును
గంధగజాసురుగడపుటాడుచును
జన్నంబు ద్రుంచిన చాశినాడుచును
వెన్నుండు గన్నిచ్చువేళ నాడుచును
గరళంబు దాల్చిన కరణియాడుచును
సరినజాతల గొన్న సరణియాడుచును
వెండియు భవు బహువిధ చరిత్రముల
ఖండితగతి నాటకంబు లాడుచు
భృంగియు నభినుత ప్రతిమ ర్త్యంబు
భృంగులలో దాను భృంగియై యాడ"[13]

---

12. పండితారాధ్య చరిత్రం : పుటలు. 437 - 442.
13. పండితారాధ్య చరిత్రం : పుటలు : 442, 443

**బసవపురాణం :** బసవేశ్వరుని పెండ్లి సందర్భంలో శివభక్తులు కోలాటం, గొండ్లి, పేరణి నృత్యాల్ని ప్రదర్శించారట.

"కోలాటము బాత్ర గొండ్లిపేరణియు
గేళిక జోకయు లీల నటింప"
"జతిగీతములమీద జప్పటు లిడుచు
నతిశయ శివభక్తి నాడెడువారు
.... .... .... .... ....
.... .... .... .... ....
నెఱిశివమరులు గురిలేనివేడ్క
నఱిముఱి మిన్నంది యాడెడువారు"[14]

"పండుగలు, తేరులు, తిరునాళ్ల సందర్భమున కోలాటము వేయుట జనపదాల్లో సర్వసాధారణం. ఇదియే దండలాస్య (సక) మనియు, దండనర్తనమనియు వ్యవహృతము"[15] కుండలాకారంగా చేసే నృత్యాన్ని గొండ్లి లేక గొండిలి అని అంటారు. పేరిణి అనగా 'భాండోపర నృత్యం' అని శబ్దరత్నాకరం చెబుతుంది. అనగా ఒక భాండంమీద చేసే నృత్యమని భావింపవచ్చు.

**తిక్కన సోమయాజి :** ఆంధ్ర మహాభారతంలోని విరాటపర్వంలో తిక్కన దండలాసకం, కుండలి, ప్రేంఖణం, పేరణం మొదలైన దేశీయ నృత్యాల్ని పేర్కొన్నాడు. బృహన్నల తాను నేర్చిన నృత్యాల్ని గూర్చి విరాటరాజుకు తెలియజేసే సందర్భంలో దేశినృత్యాల్ని నేర్చుకున్నట్లు చెబుతాడు :

"ఒండు పనులకు నెలవులేకునికిజేసి
యభ్యసించితి శైశవమాదిగాగ
దండలాసక విధమును గుండలియును
బ్రెక్కణంబు తెలుంగును బేరణమును"[16]

14. బసవపురాణం : పుటలు : 88, 89. ఆ. ప్ర. సా. అకాడమీ 1969
15. ఆచార్య తూమాటి దొణప్ప : జానపద కళాసంపద : పుట 6
16. ఆంధ్ర మహాభారతం : విరాట - 1-240

గొండిలి, గొండ్లి, కుండలి అని పర్యాయపదాలు. వీటన్నింటికీ కుండలాకారంగా చేసే నృత్యమనే అర్థం. ప్రేంఖణం, ప్రేంకనం, ప్రేంఖనం అనేవి సమానార్థకాలు. నృత్యవిశేషమని శబ్దరత్నాకరం చెబుతుంది.

**నాచనసోమన:** 'ఉత్తర హరివంశం'లో తిక్కన పేర్కొన్న దేశి నృత్య విశేషాలనే ప్రస్తావించాడు హంస డిభకులపైకి యుద్ధానికి వెళ్ళిన శ్రీకృష్ణుడు పాంచజన్యాన్ని పూరించగా, సకల స్థావరాలు చలించిన విధాన్ని దేశీయ నృత్యాలతో పోల్చి వర్ణించాడు సోమన :

పడకుపన్నగరాజు పడగల మీద స
ర్వంసహాకాంత పేరణము సూప
నుజ్ఝాత లూగెడు నుదయాస్తగిరులతో
నాకాశలక్ష్మి కోలాటమాడ
దెరలెత్తి సప్తసాగరములు బొరలంగ
వరుణుండు గొండిలి పరిఢవింప
మొకములచాయ వేఱొక చందముగనిల్పి
కమల సంభవుండు ప్రేంఖణ మొనర్ప"[17]

మరోచోట

"గొండ్లి పరిఢవించు నటువులునుం బోలె జాళెలు చూపి యెగ్గలాడెడు వారును"[18] అంటూ మరోసారి 'గొండ్లి' నృత్యాన్ని ప్రస్తావించాడు.

ప్రద్యుమ్నుడు విజృంభించి యుద్ధం చేయగా అతని ధాటికి రథాలు తోలుబొమ్మల్లా నేలకొరగుచున్నాయంటూ 'తోలుబొమ్మలాట'ను పేర్కొన్నాడు.

"యంత్రకు డాడించి యవనిద్రోచిన ద్రావాలు
బొమ్మలగతి రథపూగములును"[19]

---

17. ఉత్తర హరివంశం : 4-216 ఆ.ప్ర.సా. అకాడమీ : 1979
18. ఉత్తర హరివంశం : 4-258 ఆ. ప్ర. సా. అకాడమీ : 1979
19. ఉత్తర హరివంశం : 4-180 ఆ.ప్ర.సా. అకాడమీ : 1979

తోలుబొమ్మలాటలు నేటికి ఆంధ్రదేశంలో అక్కడక్కడ దర్శనమిస్తాయి. "తొంబై ఆమడపోయి తోలుబొమ్మలాట" చూడాలంటారు.

**వినుకొండ వల్లభరాయుడు :** 'క్రీడాభిరామం'లో వల్లభరాయుడు మైలారు దేవుని ఉత్సవాల్లో గొరగలు, గొరగపడుచు గొండ్లి నృత్యాన్ని ప్రదర్శించారని వర్ణించాడు :

"వీరుమైలార దేవరవీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
నాడుచున్నది చూడు మూర్ధాభినయము
తాను నెట్టిక సీలంతగాని లేదు"[20]

కృతికర్త ప్రశంసలో "హల్లీసకనటనోద్భట" అనే సందర్భంలో హల్లీసక నృత్యం పేర్కొనబడింది. హల్లీసకం స్త్రీలకు సంబంధించిన నృత్యం. వలయాకారంగా చేసేదే హల్లీసక నృత్యమంటారు.

**శ్రీనాథుడు :** కాశీఖండం, భీమేశ్వరపురాణం, శివరాత్రి మాహాత్మ్యం, పల్నాటి వీరచరిత్ర మొదలైన గ్రంథాల్లో శ్రీనాథుడు జానపద విజ్ఞానానికి సంబంధించిన నృత్యాల్ని ప్రస్తావించాడు.

'కాశీఖండం'లో భీమేశ్వరుని ఆస్థానంలో శనివారోత్సవ వేళల్లో దేశి నృత్యాల్ని ప్రదర్శించారని శ్రీనాథుడు పేర్కొన్నాడు. అగస్త్యుడు లోపాముద్రతో ద్రాక్షారామం వెళ్లి భీమేశ్వరుని దర్శించినపుడు దేశినృత్యాల్ని తిలకించాడట !

"మునిచూడామణి యెల్ల సత్కళలకున్ మూర్ధాభిషిక్తుండుగా
వున జారీకరణాంగ హారముల తావుల్ మించి కీర్తించుచున్
శనివారోత్సవవేళ గర్గొనియె నాస్థానంబునన్ రాజనం
దనయుం దానును దేశిమార్గముల గంధర్వా ప్సరోనృత్తముల్"[21]

20. క్రీడాభిరామం : 143 వ పద్యం. కాకతి పబ్లికేషన్స్ 1977
21. శ్రీ కాశీఖండం 3-19 వావిళ్ళవారి ప్రతి : 1917

మరోచోట "ఘుణము చప్పట్ల మర్దళధ్వనులుగా గగన రంగస్థలంబునం గ్రొమ్మెఱుంగు మెఱుంగుబోడి గొండ్లి పరిఢవించె" (32-3) అంటూ గొండ్లి నృత్యాన్ని ప్రస్తావించాడు.

'శ్రీ భీమేశ్వర పురాణం'లో పర్వదినాల్లో ఆలయంలో దేశియ నృత్యాలు ప్రదర్శింపబడేవని శ్రీనాథుడు వర్ణించాడు. బెండపూడి అన్నయ మంత్రి కట్టిన మొగసాలవాకిట కూర్చుండి వేమభూపాలుడు కుండలి, దండలాసకం, ప్రేరణీ, ప్రేంఖణ, సింధు, కందుక, ధమాళి, చేలమతల్లి, హల్లీసకం మొదలైన నృత్యాల్ని దర్శించాడట: "వేమభూపాల రాజ్యభార ధురంధరుండై బెండపూడన్నయామాత్యుడు గట్టించిన మొగసాలవాకిటి మహోత్సవ మండపంబునందు బేరోలగంబుండి కుండలీ, దండలాసక ప్రేరణీ ప్రేంఖణ సింధు కందుక ధమాళి చేలమతల్లీ హల్లీసకాది నృత్యంబులవలోకించుచు."[22]

'శివరాత్రి మాహాత్మ్యం'లో దేశీయ నృత్యాలని పేర్కొనలేదు. కాని "వేడ్కనృత్యంబులాడిరి వీధులందు" (2-54) అని వర్ణించాడు శ్రీనాథుడు. అయితే నృత్యాలు వీధుల్లో ఆడారని చెప్పడంవల్ల అవి జానపద నృత్యాలే అయి ఉండవచ్చు. జానపదుల నృత్యాలు సాధారణంగా వీధుల్లోనే ప్రదర్శింపబడుతాయి.

'పల్నాటి వీరచరిత్ర'లో నలగామరాజు సభయందు ప్రదర్శించిన విద్యావినోదాల్ని వర్ణించే సందర్భంలో వివిధ నృత్యరీతుల్ని, భంగిమల్ని పేర్కొంటూ దేశినృత్యాల్ని కూడా ప్రస్తావించాడు :

నాట్యమేళమువారు నవవిలాసముల
వచ్చి నమ్రతమ్రొక్కి ప్రక్కగానిల్వ
ఘనమైన భవంబున కామభూవిభుడు
నవ్వుచు సెలవిచ్చె నాట్యంబు చేయ
వరమృదంగము లెస్స వాయించుమేటి
కుడిభాగమునందు కుదురుగా నిలిచె
తాళమానజ్ఞులు దాపటిదిశను

22. శ్రీ భీమేశ్వరపురాణం : 1-118

నిలిచి రుత్సాహంబు నేరుపుమీర
ముఖవాయించు ముఖ్యడొకండు
రాగమాలాపించు రమణులిద్దరును
నిండు వేడుకతోడ నిలివిరి వెనుక
కంజలోచనయను ఘనమైన పాత్ర
మదను పట్టుపుదంతి మంజులవాణి
భరత శాస్త్రోచిత బహురాగములను
గరిమతో నేర్చిన కంతుబాణంబు
వచ్చి సభాసదుల్ వర్ణించి చూడ
నిలిచి నాట్యమునకు నేర్పరియైన
వేత్రపాణికి దగ వినయంబుజూపి
అతడొసంగిన గజ్జలతి భక్తితోడ
పాదములంగట్టి పంచవర్ణముల
కాశగట్టిగ గట్టి కడుజపంబదర
మద్దెల తాళాల మధ్యనిలచుండి
ఓరు చూపున రాజునొయ్యన జూచి
సమపాదయుతమైన స్థానకస్థితిని
తాత్పర్యమున దేవతలకును మ్రొక్కి
పుష్పాంజలి యొసంగి పూనినాట్యంబు
సమకట్టి నాదంబు సభ యెల్లగ్రమ్మ
కైకోలు విడుదలల్ ఘన కళాశైలి
కైమూడి కట్నముల్ కనుపింపజేసి
వెలయంగ తొమ్మిది విధములయినట్టి
భూరినాట్యంబు పొందుగా సలిపి
పదునారు విధములై పరగినయట్టి
ఆకాశచారియు నమరంగనాడి
అంగహారాఖ్య గలట్టి నాట్యంబు
విదితమౌ తొమ్మిది విధములనాడి
గతిచారి భేదముల్ గనుపడునట్టు

భ్రమణ సంయుతదీప్త పటిమ మీరంగ
పాణిభేదములను బాటించి చూపి
స్థానకసంచయ సంయుక్తి అమర
పేరణి దేశిని ప్రేంఖణ శుద్ధ
దండికా కుండలి తగుబాహుచారి
సప్తతాండవములు సల్పె చిత్రముగ"23

మరోచోట 'గంగిరెద్దులాట'ను ప్రస్తావించాడు :

"గంగిరెద్దుల వాడు కావరమణచి
ముకుదాడు పొడిచిన పోతెద్దుఁబట్లు"24

**పెదపాటి ఎర్రనాఋ్యడు :** 'మల్హణ చరిత్ర'లో పుష్పగంధి నేర్చిన నాట్యవిద్యల్ని వర్ణిస్తూ కోలాటం, జిక్కిణీ, బహురూపులు మొదలైన దేశి నృత్యాల్ని పేర్కొనడం జరిగింది.

"మొగవరి కట్టడ మొనవు కోలాటంబు
చొక్కంపు మురువులు చిక్కిణీలు
దరువు బారబడువేసి బహుళరూపు
బంధురగీతి ప్రబంధవితతి
వరుసపద్య దేశి బంగాళంబు కంచి
కొరుతి కట్టడబిందు కొటియకాడు
పరశురాముడు వీరభద్రుండు కల్యాణి
చౌకట్లు మెకతాళి శబ్దమాది
దేశశుద్ధాంగములయందు దీగెబోడి
పటుతరంబుగ నిజపాద కటకయుగళి
కళలపాత్రమ్ములును బొమ్మలగుచు వ్రేల
బూన్కి వహియింప బొగడొందె బుష్పగంధి"25

---

23. పలనాటి వీరచరిత్ర : పుటలు 15, 16 : వీరాచార పీఠాధిపతి. కారెంపూడి
24. పలనాటి వీరచరిత్ర : పుట : 17 వీరాచార పీఠాధిపతి. కారెంపూడి
25. మల్హణ చరిత్ర : పుట. 20 ప్రథమ

ధనగుప్తుడను వైశ్యునిముందు పుష్పగంధి చారణ, బాగడ, చర్చరీ, బహురూప, దండలాసకం, కందుక, కోలాకటం, ప్రేరణ, ప్రేక్షణ మొదలైన నృత్య రీతుల్ని ప్రదర్శించింది :

చారణ బొగడ చర్చరీ బహురూప
దండలాసాదిక ఖాండికములు
కందుక కోలాటకా నాట్య తాసఖ
ప్రేరణ కుండలి ప్రేక్షణములు
సూతముల్ పుహుడక శుద్ధపద్ధతి చిత్ర
పద్ధతి ఘనదేశ పద్ధతులును
కైలాటబంబక కరబైక తాళికో
లాసాది గీత హల్లీసకములు
నాదిగా గల్గు నృత్యనృత్త్యైక్య ముఖ్య
నాట్యవిధములు సూచించి నయమెలర్ప
జనులకెల్లను లోచనోత్సవముగాగ
నాడె నాయిందుముఖి కొనియాడె జగము"[26]

**రఘునాథ రాయలు :** 'వాల్మీకి చరిత్రం'లో ఊర్వశి నేర్చిన నృత్యాన్ని గూర్చి చెప్పే సందర్భంలో దేశినృత్యాలైన పేరణి, దండలాస్యం, ప్రేంఖణం, కుండలి మొదలైన వానిని గూర్చి ప్రస్తావించడం జరిగింది :

"పేరణి దండలాస్యమును బ్రేంఖణి కుండలినా జతుర్విధో
దారములైన నాట్యముల యందములెల్ల నెఱింగి యందునిం
పారుచునుండు మూడుపదు లాఱునునై తగు నంగహారముల్
రారసభావ దృష్టులలరన్ నటియించెద మాట లేటికిన్"[27]

రంభ తన నైపుణ్యాన్ని వివరిస్తూ నృత్యరీతుల్ని పేర్కొన్నది :

సంయుతా సంయుత సంజ్ఞక హస్తముల్
పదమూడు నొకయిరువదియు నాల్గు

---

26. మల్హణ చరిత్ర : పుట. 40 ద్వితీయ
27. వాల్మీకి చరిత్రం- 3-66-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

త్రింశద్ధతుల బొల్చు నృత్తహస్తంబులు
నైదు వృక్షంబులు నైదుకటులు
స్కంధంబు లాఱును గంధర తొమ్మిది
జానువులేడు పార్శ్వంబులైదు
నుత్తమాంగంబులే కొన వింశతి దళ
ఖహుల్ త్రికత్తులు పదములాఱు
స్థాయి దృష్టులెనిమిది సంచారిభావ
దృష్టులిరువది రసదృష్టులెనిమిదియును
బొంకముగ జూపి వింతకోపులు సెలంగ
నాడగలిగిన గలహింప బాడినీకు"[28]

రంభ దేశినృత్య నైపుణ్యానికి మెచ్చుకొని శివుడు వజ్రపు కుచ్చుగల వీణను ప్రసాదించాడట :

"శివుడొక్కనాడు దేశికి మెచ్చినాకిచ్చె
బెద్ద వజ్రపుకుచ్చు బిరుదువీణ"[29]

దేశి పద్ధతిలో నృత్యంచేసి మునీశ్వరుని నిద్రనుండి లేపుతానని రంభ అంటున్న వైనం చూడండి :

"మద్దెల సద్దున నీతని
నిద్దుర మంపెల్ల బోవనేర్చు మెఱయనే
నిద్దముగ దేశిగొని యెద
నొద్దికగానుండు డనుచు నొనరిచి సఖులన్"[30]

వివిధ వాద్యాల్ని ప్రయోగించుచుండగా రంభ వివిధ దేశి నృత్త వైఖరుల్ని చూపిందట :

"తరుణీమణి యొకర్తు తంబురా మొరయింప
వెలదియొక్కతె ముఖవీణెయూద

---

28. వాల్మీకి చరిత్రం- 8-68-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
29. వాల్మీకి చరిత్రం- 8-29-ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
30. వాల్మీకి చరిత్రం- 8-128ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

సరసిజాక్షి యొకర్తు స్వరమండలము వాచ
బోటియొక్కతె దండమీటిపాడ
విమలాంగి యొక్కర్తు వీణియ వలికించ
గలికి యొక్కతె యుపాంగంబు వూన
గిసలాధర యొకర్తు కిన్నర మీటంగ
లోలలోచన యోర్తు తాళమొత్త
మఱియు గొందఱు సుదతులు మద్దెలయును
నావజము మొదలైన వాద్యములు వట్టి
శ్రుతులు ఘుమ్మని హవణించ నతివదేశి
నృత్త వైఖరి చూపెమునీంద్రునెదుట"[31]

**అయ్యలరాజు నారాయణామాత్యుడు :** 'హంసవింశతి లో వారవనిత నేర్చిన నృత్యాల్ని వర్ణించే సందర్భంలో బారుండం, బహురూపాలు, దండలాసకం, ప్రేంఖణం, ప్రేరణ, కుండలీ మొదలైన దేశి నృత్యపద్ధతుల్ని ప్రస్తావించడం జరిగింది :

"బారుండంబును శుద్ధపద్ధతి బహురూప
లక్షణంబును దండలాసకంబు
ప్రేంఖణ పద్ధతి ప్రేరణాపద్ధతి
కుండలీ నృత్తంబు ఖాండికంబు
రాసకాఖ్యము నాటరాసకంబును జిత్ర
పద్ధతియును దేశ్యపద్ధతియును
జర్చరీ కందుకచానరి కోలాట
ములునాగ దగుపేళ్ల గలుగునట్టి"[32]

**మారద వెంకయ్య :** భాస్కర శతకంలో తోలుబొమ్మలాటను గూర్చి ప్రస్తావించాడు :

"ఇంచుక నేర్పు చాలక విహీనత జెందిన నా కవిత్వమున్
మించు వహించె నీకతన మిక్కిలి యెట్లన తోలుబొమ్మలున్
మంచి వివేకి వానితెర వాటున నుండి ప్రశస్తరీతి నా
డించిన నాడవే జనుల డెందము నింపవే భాస్కరా"[33]

---

31. వాల్మీకి చరిత్రం : 3-131. ఆ.ప్ర సా. అకాడమి :
32. హంసవింశతి : 5-122 ఆ ప్ర.సా. అకాడమి 1977
33. భాస్కర శతకం : 109వ పద్యం : బాలసరస్వతీ బుక్ డిపో

# జానపద కళాకారులు

తెలుగు సాహిత్యంలో కవులు తమ తమ కావ్యాల్లో జానపద కళల్ని ప్రస్తావించినట్లే కళాకారుల్ని గూర్చి కూడా ప్రస్తావించారు. కళాకారుల్ని, కళా కారుల వేషధారణను వర్ణించిన సన్నివేశాలు శిష్టసాహిత్యంలో కన్పిస్తాయి.

**పాల్కురికి సోమనాథుడు :** 'పండితారాధ్య చరిత్ర'లో పర్వత ప్రకరణంలో వివిధ దేశాల పరుసల నడకల్ని వర్ణిస్తూ జంగాల వేషధారణాన్ని వర్ణించాడు. జంగాలు శైవభక్తులు. శైవసంబంధమగు కథల్ని చెబుతూ, పాటల్ని పాడుతూ భిక్షాటన చేస్తూ జీవనం సాగిస్తారు. బుడిగే వీళ్ల వాద్యం. బుడిగెను వాయిస్తూ కథల్ని చెప్పడంవల్ల వీళ్లకు బుడిగె జంగాలని పేరు.

పర్వత ప్రకరణంలో జంగాలను వర్ణించిన సన్నివేశాన్ని చూడుడు :

"పొడవగు సంబుష్పల్ బెరగగుపసిడి
గొడగులు బావలుగూడ లోహంబు
పావలు దంతంబు పావలు రాగి
పావలు జాగెల పాదరక్షలును
దొడికొని పదనఖద్యుతుల దర్పణము
లదర శిష్యులికి నిడినట్లు వెలుగ
జందన కావులు సరిసాటికావు
లందంబులగుకల కంచుకావులును
వలపొత్తి పచ్చడంబులును గొప్పిన
మొలు మీద గూడగట్టులు గానుపింప
వెలిబేరములు గళుకులు గొంతదోప
బలుచని జోడు కుప్పసములు పూని
.... .... .... .... ....
కాలిపచ్చడములు గావిదుప్పట్లు
.... .... .... .... ....

కెలకుల జంద్రసూర్యులు గల్గు చీర
శుద్ధపరిశుభ్రత కుండలములు
మండిత రుద్రాక్ష మణిహేమరజిత
కుండలములు రాగికుండలంబులును
నందికుండలములు నాగకుండలములు
గడుసొంగమగు వెలగొడుగులు బీల
గొడుగులు, ముత్యాల గొడుగులు బిరుదు
గొడుగులు, వెలిపట్టు గొడుగులు, మోడుప్ప
గొడుగులునిడి తోడ గుడ్డలేలేరు
భక్తిశృంగారముల్ ప్రభుశుకులు వి
రక్తి భావములు నారాధ్యసంపదలు
.... .... .... .... ....
ఖ్యానియెంతయు జగత్ప్రాజ్యత దనర
సభిరమ్యలీల దుల్కాడంగ నిట్టు
బుభయ జంగమకోటు లొక్కటనడువ"

(పర్వత - 807 నుండి 814 పుటలు)

జంగాలతోపాటు మిందజంగాలు కూడా వచ్చిరట, సుఖలాలసులైన, భోగలాలసులైన జంగమ భక్తులు భక్తిభావనతో శ్రీశైల మల్లికార్జునుని దర్శించ డానికై వచ్చిన 'మిండాజంగాల' వేషధారణ ఇలా వుంది :

"మిక్కిలి కట్నముల్ వేలిచందనము
చెక్కులు నెలవత్తి చిక్కణంబులును
గస్తూరి మొదలుగా గలుగు సుగంధ
వస్తువులును గూడ వాసించినట్టి
.... .... .... .... ....
.... .... ... .... ....
గొప్పలు మాటల మెప్పులు నొసలి
తిలకముల్ నోటి ముత్తియములు నూళ్ల
గొలదిగ చౌకట్లు వ్రోగులు, రుద్రసరుల్లు

.... .... .... .... ....
.... .... .... .... ....
దరహాస రుచులను దండలు దగిన
వరభూషణావళుల్ వాలిక గ్రోళ్లు
వివిధ విచిత్ర నవీన వస్త్రముల
నవధరించిన లింగనివహంబు హోయలు
.... .... .... .... ....
.... .... .... .... ....
కాముకులను గని కాలుద్రవ్వుచును
బొనసరు కస్తూరి మృగంబుల క్రమంబునను
జనులకు దేహవాసన లొసగచును
దేవదేవేశు భోగావతారముల
భావన భక్తుల ప్రాణేశులనగ
దనుమనో ధనములాదట హరింపుచును
ననువక్త్రీలింగ నిరంతర సావ
ధాన తత్పరతమై ద(త్ప్రసాద ప్ర
లీన భోగోరు భోగానంద సౌఖ్య
మండిత సకల సమగ్రత మెఱసి
మిండ జంగమకోట్లు మెల్లన నడవ"

(పర్వత - 319, 320 పుటలు)

సోమన పండితారాధ్యచరిత్రలో 'జోగుల్ని' కూడా ప్రస్తావించాడు. యోగి శబ్దానికి వికృతి జోగి. జోగులనగా దైవభక్తి పాటల్ని పాడుకుంటూ జీవనాధారానికై భిక్షాటన చేస్తూ దేశసంచారం చేసేవాళ్లని చెప్పుకోవచ్చు. స్త్రీ, పురుషులిరువురూ జోగులుగా ఉండవచ్చు.

శ్రీశైల మల్లికార్జునుని దర్శించడానికై వచ్చిన భక్తుల నడకల్ని వర్ణిస్తూ 'జోగుల నడకల్ని' పేర్కొనడం జరిగింది :

"జుక్కలు బొట్లును జుక్కవెండ్రుకలు
జక్కని పాపటల్ జంగాళములును

నినుపనేవళములు ని_త్తడి సరిగె
లును వెం_[ట్రు]కల దండలును దగరంబు
పిల్లాండ్లు మట్టెలు బెక్కు_వన్నియలు
తొల్లుకుప్పసములు నల్లగాజులును
గలయంగ జెవుల సంకంబు పూసలును
బలుపూస పేరుల బన్నసరములు
గుటిలంబు చూపులు గొయ్యకాటకలు
బటికంబుముక్కు_ఱల్ ఘారమైతనర
పలువన్నెకోక బొంతలనట్టు నడిమి
తొఱల కుప్పసముల దూర్చిన మొకలు
వినురూపముల జాలుపెం_[డ్రు]కల్ వెడద
నొసలి యిట్టుక బొట్టు పసుపులు గన్న
గవ కాటుకలు దరకాయ కప్పెరలు
జెవుల పీకెలు మొఱచెడిబోరముండ్లు
జాకిటతిత్తులు జ_[క్ర]ముల్ నిడుద
తోట కచ్చడములు వాక పొట్టలును
నొడ్డు తొమ్ములు దొడ్డయూరులు బిగువు
నొడ్డాణములు నిన్పయుంగరంబులును
గడియముల్ మురువులు గట్టి చేతులును
గొడుగులు గుదియలు గోక జల్లెడలు
వద్దు మొగంబులు వలిపంబు జముక
బద్దెల గూర్చిన పచ్చడంబులుమ
మురిపెంబు నడపులు మూపుతిత్తులును
విరసంబు మాటలు వికృత వేషములు
బల్లమీసంబులు బరికి గడ్డములు
నల్లమేనలు గుబ్బ నారసంబులును
నటిముటి తనముల హోంకపై చుటలు
గఱక [్రా]ళుల పెం_[డ్రు]కలు పొంగముగను
బనుగొనదము జూచి భవులు భవులన
బెనుశీలవంతులు వెట్టు న_[క్ర]ముల

నొక్కొకలింగంబు నొగి జూడకున్న
నక్కట చొరగని రట్టల యనుచు
గళముల గద్దెనగరులు దోపంగ
నలరుచు భుక్త్యర్థమై ధరియించి
జోగినుల్ దారును జోగి వేషముల
జోగులు గొలువంగ జోగులేతేర"

(పర్వత- 441-442 పుటలు)

పిచ్చుకుంట్ల వాళ్లను గూర్చి ఇలా వుంది :

పీవంగ చేతులు లేవయ్య నడచి
పోవంగ కాళ్ళును లేవయ్య అంధ
కులమయ్య పిచ్చుకుంటులమయ్య
తలపోయనభ్యాగతులము సుండయ్య

(పర్వత - 348 వ పుట.)

పిచ్చుకుంటుల వేషధారణాన్ని చూడండి :

ప్రేళ్ళును లేనట్టికాళ్లను బిల్ల
వ్రేళ్ళు వెక్కగు నట్టికాళ్ళను మట్టి
కాళ్ళను రాటమ్రోకాళ్ళను దోలు
కాళ్ళ నెండిన కాళ్ళను .... ....
.... .... .... .... బిల్ల
చేతులు, లోవంక చేతులు. దోలు
చేతులు, నొండొంటి చేతులు, జాల
గులచ చేతులు, బొమ్మ పొఱదులు
.... .... .... .... ....
గళముల లింగంబు గద్దెనంగగలు
నలతి విభూతి రుద్రాక్షలు వలుద
మకుటముల్, గాహళుల్, మణిప్రేలు జడలు
ప్రకటితంబుగ దాల్చిబడి దీనవృత్తి

సాహసము మూర్తి గైకొన్న సరణివారు
ధీరహృదయులు మైలార వీరభటులు" (142 వ పద్యం)

గొరగ పడుచులు గొండ్లి యాడుచున్నారట.

"వీరు మైలార దేవర వీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
నాడు చున్నది చూడు మూర్ధాభినయము
తాను నెట్టికసీలంతగాని లేదు" (143 వ పద్యం)

గొరగపడుచు ఆడుచున్న విధం ఇలా ఉంది :

"వెమకకు మ్రొగ్గవాలి కడువిన్ననువొప్పగ దొట్టెసీళ్ళతో
మునిగి తదంతరస్థమగు ముంగర ముక్కున గ్రుచ్చి కొంచు లే
చెను రసనా ప్రవాళమున శీఘ్రము గ్రుచ్చెను నల్లపూసపే
రనుపమలీలనిప్పడుచు సాధ్యము లిట్టివి యెట్లు నేర్చెనో"
(144 వ పద్యం)

పొమ్మలాట వాని వేషధారణ చూడుడు :

"కడగోర దీర్చిన కస్తూరి గీరొట్టు
నెక్క సక్కెంబుగా జుక్క మెఱయ
నర్ధచంద్రికటంబునై యురస్థలమున
గంధసార స్థాసకము లు మెఱయ
జాల నిగ్గులు గుల్కు పాంజెక్కల కుచ్చు
వామ కర్ణంబుతో వక్కళించి
బెనచి వెంద్రుకలతో బెనవెట్టి చుట్టిన
పాత చంద్రిక వన్నె పాగయమర
జన్నిదంబుగ బెనుబాము సవదరించి
యంఘ్రి కటకంబు ఘల్లు ఘల్లనుచు మొరయ
నాహితుండిక గరళ విద్యాధిరాజు
వచ్చె బాముల మెంగడు వదిగులదు" (228 వ పద్యం)

పాట పాడుతూ నాట్యం చేస్తూ తూర్పునాటి గడిదు రావడాన్ని గోవిందశర్మ చూశాడట :

"నున్ననై నలుపెక్కి నొసలచేరువకంటి
కెకువవైచిన శిఖపెకలుమంద
కరసాన (గిచిన కలవెగందవు బొట్టు
తిరికట్టుకొని మోము దిరిగియుండ
దటపెట దిమికిట ధ్వనులోలి బుట్టింప
జాలు గుమ్మెట చంక వ్రేలుచుండ
నలుకనై మీ జేత నందిన యా క్రొత్త
మువ్వల త్రెము సారె మలుగుచుండ
నొసలు (సుక్కించు నాపుర్నోరు దేఱచు
గ్రుడ్లు మిడికించు రాగంబు గుమ్మడించు
పాడుగతులకు దను దానె పరగియాడు"
నల్లయాతడు వో తూర్పు నాటిగడిదు" (262 వ పద్యం)

**పాలవేకరి కదిరీపతి :** "శుకసప్తతి"లో హాలాంకుదను రెడ్డి యింటికి వచ్చిన పవనీలుని వర్ణన వుంది :

"దుసికిల జాలుకొరసిగ దువ్వటి నీటు లలాట పట్టికం
బొసగు విభూతిపై బసుపు బొట్టును దొట్టిన కల్లుచొక్కు వె
క్కసముగ నెఱ్ఱవాఱిన వికారపు జూపులుగా గనంబడ
న్వెస జనదెంచె నొక్క బవనీడు తదీయ సమీపభూమికిన్" (2-414)

వచ్చి జమలిక వాయించి వరుసతోడ
దాతతంత్రుల చౌదరి తనములెల్ల
నెన్నికైవార మొనరించి యింపు నెఱప
నతని గూర్చుండ నిడుకొనియా దరము" (2-415) అంటూ పవనీలుని అభినయాన్ని వివరించాడు.

**అయ్యలరాజు నారాయణకవి :** "హంసవింశతి"లో బుడబుడక్కి, గొల్లసుద్దులవాళ్ల వేషధారణను పేర్కొన్నాడు.

తొగటవాని యింటికి వచ్చిన బుడబుడక్కలవాని వేషధారణ చూడుడు;

"నొసలిపై జుక్కల మిసిమి నామపు రేఖ
లను వొంద భుజముపైనసిమించు
వాలు వీనుల గాజు నీలాల పోగులు
పై నొప్పు పప్పళి పచ్చడంబు
మెలిగొన జుట్టిన తంపాగ చెఱగుంచి
పైట పేటా చుట్టు పట్టుశాలు
కడిది మీఱగ జతనిడిన బొట్టియకోల
డాక్రమోసెడు డబుడక్కకేల

వఱల దిక్కులనెంచి దుర్వారమైన
కీడుమేలును దెల్పుచు గేకలిడుచు
గెర్లికొనుచును దనపేరు కేరికొమచు
వచ్చె నచ్చటికి డుబుడక్క వాడొకడు" (2-27)

గొల్లదంపతులు సంతానం లేక విచారించే సమయంలో వాళ్లింటికి వచ్చిన సుద్దులగొల్లల వేషధారణం ఇలా ఉంది :

"కొమ్ములు వీరణాలు జిగిగుత్కెడు వ్రాతల కృష్ణలీలం
గ్రమ్ము గుడార్లు వీరుడగు కాటమరాజుకథానులాపముల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిక కట్టు రుమాలలున్ నెఱా
సొమ్ములు నామముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్
(2-87)

తిరుణాల ఉత్సవానికై వెళ్తున్న భక్తుల్లో జానపద కళాకారులు కూడా కలరట :

"వీరముష్టి, మాష్టి, యొడ్డె యుప్పరులును నసిధావక మైలారి తురక పింజారి విప్రవినోదులును, జాతికర్త దొమ్మరి డొమిణి బొమ్మలాటవారును నింద్ర జాలికమహేంద్ర జాలిక హస్తలాఘవ సూత్రనాటక క్షౌరక రజకులును భోగము వారు దెరనాటకపు జంగాలును, జంగాలు బిడ్డెముంవాండ్రు తెల్లకోకజత్తులు సివ సత్తులు, జత్తులు పలునాటివీరులు పరిహాసకులు సుద్దులకొమాళ్ళు కొమ్మురిదాసర్లు

తవిరు దాసళ్లు కోణంగులు సేవసరులు పగసలు పడిగెవారు పరాంగులింగిలీసులు పరాసులు పళందులు సన్న్యాసు లేక ........... గోరడ జోగులు, కాటిపాపలు మందపిచ్చులు, పిచ్చుగుంట్లు, చర్మకర్ములు చండాల మాతంగులు తల్రకిందు జోగులు రామగోవిందులు" (3-29)

శివదత్త యోగి వెంట శ్రీశైలం వెళ్లిన వాళ్లలో జంగాలను జానపద కళాకారులు కలరట :

"అయ్యావళీ ముఖ్యమై తనరారెడు
మిండ జంగంబులు మెఱసినడువ"

"గుమ్మెతల్ కిన్నెరల్ గూడి వాయించుచు
భైరవ జోగి వెంబడినె కదల"

"బసవగంటలు బృహత్ప్రటు శంఖములు మ్రోయ
శివరాత్రి జంగాలు చేరికొలువ" (8-189)

**చంద్రశేఖరుడు :** 'చంద్రశేఖర శతకం'లో పిచ్చుకుంట్ల వాళ్లనుగూర్చి పేర్కొన్నాడు;

"గుడగుడ రోజునడకుండ బాపడు పిచ్చుగుంట్లయో
కీడు తెప్పినన్ని గోతరలు గట్టిగ జెప్పునో మీనంగుగా
వడిగొని నంపసాచి దలపట్టుక సింధుపదాలు పాడు
గుడగుడ పట్టి లొట్టయని కూయును మూర్ఖుడు చంద్రశేఖరా
(ఆంధ్రనాటక రంగ చరిత్రలో ఉదాహరింపబడినది. 315 పుట)

**ఆడిదము సూరకవి :** 'రామలింగేశ్వర శతకం'లో జంగాల్ని, పంబల్ని పట్టెదాసర్లను, పిచ్చుకుంట్లను, రుంజవాళ్లను ప్రస్తావించడం జరిగింది.

"జంగాలపాలు దేవాంగుల విత్తంబు
కాపు విత్తము పంబకాని పాలు
బలిజీల విత్తంబు పట్టెదాసరి పాలు
గొల్ల విత్తము పిచ్చుగుంటిపాలు
వ్యాపారి విత్తంబు వారకాంతపాలు
కల్లు విత్తము రుంజకానిపాలు"
(ఆంధ్రుల సాంఘిక చరిత్ర పుట. 407)

# జానపదుల ఆటలు

ఏ కాలంలోని కవి అయినా ఆ కాలపు ధర్మాన్ని అనుసరించి రచన చేయక తప్పదు. కవికూడా సమాజంలోని ఒక వ్యక్తే. కాబట్టి సమాజంలోని అనేక విషయాలు ప్రత్యక్షంగనో, పరోక్షంగనో కవి రచనపై ప్రభావాన్ని చూపిస్తాయి. కవి సార్వభౌముడైనా కవిసామ్రాట్టు అయినా ఎంత ఊహా లోకంలో విహరించినా నిజమైనకవి నేల విడిచి సాము చేయలేడు. తాను నివసిస్తున్న సమాజాన్ని, తన చుట్టూ ఉన్న సామాజిక పరిస్థితుల్ని కాదనలేడు. సమకాలీన సామాజిక పరిస్థితులు రచనలో చోటు చేసుకుంటాయి. ప్రజల జీవన విధానం, ఆచార్య వ్యవహారాలు, కష్టసుఖాలు, ఆనంద విచారాలు, వినోద విహారాలు కవుల కావ్యాల్లో ప్రతిబింబించినట్లే మానసికానందాన్ని, ఉల్లాసాన్ని, ఉత్తేజాన్ని కలిగించే ఆటలు శిష్ట్యసాహిత్యంలో ప్రతిబింబించాయి.

ఒక జాతికి సంబంధించిన ఆటలు, పాటలు, వేడుకలు వినోదాలు ఆ జాతి జీవన విధానాన్ని సంస్కృతిని తెలియజేస్తాయి. కావుననే శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు **"The favourite games and amusements in a country indicate fairly the stand of culture which they reached in their caste and their fancies"**[1] అని వివరించారు. ఆటలకు ప్రారంభం మానవుని పుట్టుకతోడనే మొదలవుతుంది. కాళ్ళు చేతులు కదపడం, ఎగరడం, దూకడం, గంతులు వేయడంలాంటి శారీక కదలికలవల్ల మానవుడిలో సహజంగా ఆటలపట్ల ఆసక్తి కలుగుతుంది. పెరిగి పెద్దవుతున్న కొద్ది ఎవరి కిష్టమైన ఆటల్ని వాళ్ళు ఆడటానికి కిష్టపడతారు. శారీరక మానసిక స్థితుల్నిబట్టి ఆటల్ని ఎంపిక చేసుకొంటారు. ఆటలకు వయసుతో నిమిత్తంలేదు. ఏ వయసుకు తగిన ఆటలు ఆ వయసులో ఉంటాయి. స్త్రీలకు, పురుషులకు అందరికి ఆటలుంటాయి. కావుననే చలమచర్ల రంగాచార్యులుగారు "క్రీడా వినోదములలో జానపదులు, నాగరకులు, స్త్రీలు, పురుషులు, ధనికులు, పేదలు పిన్న

---

1. The History of Reddi Kingdom P. 416, 1945

వయసువారు అను భేదములతోను, భిన్నభిన్న సమాగ్రులతోను ఈ క్రీడా వినోదములు బహు విధములుగా విస్తరిల్లినవి"[2] అని వివరించారు.

ఆటల్ని స్థూలంగా పురుషులు ఆడేవనీ, స్త్రీలు ఆడేవనీ రెండు వర్గాలుగా వర్గీకరించుకోవచ్చు. వయసునుబట్టి పిల్లలు ఆడేవనీ, పెద్దలు ఆడేవనీ ప్రత్యేక ఆట స్థలాల్లోనే ఆడేవనీ, ఇంట్లో ఇంటి ఆవరణలో ఆడేవనీ, బయటి ప్రదేశాల్లో వీధుల్లో ఆడుకునేవనీ విభజించుకోవచ్చు. పగటిపూట ఆడేవి కొన్ని ఆటలయితే రాత్రి పూట ముఖ్యంగా వెన్నెల్లో ఆడుకునే ఆటలు మరికొన్ని. పశువుల్ని మేపుకొనేవాళ్ళు పొలాల్లో, అడవుల్లో, చెట్లకింద, చెట్లపైన ఆడుకొనే ఆటలు ఇంకొన్ని ఉంటాయి. ఆటలకు సంబంధించిన ఖచ్చితమైన వర్గీకరణం చేయడం కష్టమే అనిపిస్తుంది. అయినా పరిశోధకులు ఆటల్ని విభజించి చెప్పటానికి ప్రయత్నించడం జరిగింది. చాలా ఆటల్ని ఎలా ఆడుకుంటారో కూడా తెలియదు. నిఘంటువులు కూడా క్రీడా విశేషమనీ, ఆట విశేషమనీ పేర్కొనడం కద్దు. అందువల్లనే మల్లంపల్లి సోమశేఖరశర్మగారు" ఇందువలన మనకా యాటల పేర్లు మాత్రమే తెలియును; కాని వాని నాడుకొను విధము తెలియుటలేదు. వీటిలో కొన్ని ఇంట ఆడుకొనునవి మరికొన్ని ఇంటి వెలుపల ఆరుబయట ఆడుకొనునవి. బాల బాలికలు కలసి ఆడుకొనుచుండినను ప్రత్యేకము బాలికలు మాత్రమే ఆడునట్టివియు ప్రత్యేక ముగా బాలురాడు నట్టివియు లేకపోలేదు"[3] అని వర్గీకరించారు.

**"There are out door and indoorgames. There were games for boys and girls sseperatety and games for mixed teams"[4]** అని ఖండవల్లి బాలేందు శేఖరంగారు ఆటల్ని విభజించారు. వీరి విభజన ఇంచుమించు మల్లంపల్లి వారి వర్గీకరణంలా ఉందని చెప్పవచ్చు.

శ్రీ నేదునూరి గంగాధరం గారు ఆటల్ని క్రింది విధంగా విభజించారు.

1. ఇంట ఆడునవి - ఆరుబయట ఆడునవి
2. స్త్రీలు ఆడునవి - పురుషులు ఆడునవి

---

2. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము. సంపు. ౬. పుట. 10
3. ఆటలు, వేడుకలు వినోదములు, విజ్ఞానసర్వస్వము. సం. 8 పుట. 21
4. **The Andras through the Ages, 1973, P. 49.**

3. బాలికలు ఆడునవి - బాలురు ఆడునవి
4 ఎవరైనను సరే ఆడునవి
5. శాస్త్రానుభవం కలవి - చతురంగాదులు
6 నిషిద్ధాలు - జూదము పేకాట మొదలగునవి. 5

ఒక్కొక్క ఆటను ఒక్కొక్క విధంగా ఆడుకుంటారు. కాబట్టి ఆట విభజనను గిరగసినట్లుగా విభజించి చూపడం సాధ్యం కాదంటూనే డా॥ పల్లా సుబ్రమణ్యంగారు ముఖ్యంగా 12 ముఖ్య విభాగాలుగా విభజించి, ముఖ్య విభాగాల్ని ఉపవిభాగాలు గా విభజించారు. కొంతవరకు వీరి విభజన సమంజసంగానూ సంపూర్ణంగాను ఉందనే చెప్పవచ్చు. ఆ విభజన ఇలా ఉంది.

1) మానవుని వివిధ దశల ననుసరించి
(According to different stages in life)

ఎ) బాల్యం - పూర్వ బాల్యదశ (5 ఏళ్ళ లోపు) Pre-Child
ఉత్తర బాల్యదశ (5 నుండి 15 ఏళ్ళ లోపు) Pert Child
బి) యౌవనం - (15 నుంచి 25 ఏళ్ళ లోపు) Youth
సి) కౌమారం (25 నుంచి 60 ఏళ్ళలోపు)
డి) వార్ధకం (60 ఏళ్ళపైబడి) దశలలో ఆడే ఆటలు.

2) స్త్రీ, పుంభేదాల్ని బట్టి (According to Sex)

ఎ) స్త్రీలు (Females) బాలికలు, యువతులు, స్త్రీలు ఆడేవి.
బి) పురుషులు (Males) బాలురు, యువకులు, పురుషులు ఆడేవి.
సి) స్త్రీ పురుషులు (Both Females and Males) కలిసి ఆడేవి.

3) ఉత్సాహాంకాలు - సామాన్యమైన రోజులలో ఆడే ఆటలు (Ordinary days games), ఉత్సవాంకాలు - పండుగ పర్వాలలో ఆడే ఆటలు (With referance to feasts and festivals)

4) ఇంటి లోపల ఆడే ఆటలు (Indors games), ఆరుబయట ఆడే ఆటలు (Outdoor games).

---

5. ఆటలు-పాటలు పుట. 10. 1965

5) పగటివేళల్లో (During day time), రాత్రిళ్ళల్లో (During night time) ఆడే ఆటలు.

6) పౌర (Urban), జానపద (Rural) భేదాన్నాశ్రయించి.

7) క్రీడాకారుల సంఖ్యనుబట్టి (According to the number of Participants)

ఎ) వ్యష్టినిరూపకాలు (Individuals)

బి) సమష్టి నిరూపకాలు (Group)

(i) సామూహికంగా కలిసికట్టుగా ఆడే ఆటలు (Combined group games)

(ii) రెండు జట్లుగా ఏర్పడి ఆడే ఆటలు (Team games)

8) క్రీడాసాధనాలను బట్టి (According to the type of equipments used)

ఎ) నిర్జీవ పదార్థాల తోడ్పాటు కలవి (With the help of in animate objects)

బి) జీవజంతువుల ఆధారంతో ఆడేవి (With the help of animated objects)

సి) ఏ పరికరాల తోడ్పాటు అవసరం లేనివి (With out the help of any equipment)

9) బుద్ధి (Related to mind), శరీర సంబంధులు (Related to body) ద్వ్యవధానానికి సంబంధించినవి కొన్ని (Related both to mind and body)

10) మతపరమైనవి (Related to Religious) మతేతరమైన (Non-Religious)

11) ఋతువుల్ని బట్టి (according to seasons) నైసర్గిక స్థితినిబట్టి (according to geogro phical distributions)

12) ఆర్థిక సామాజిక అంతరువులనుబట్టి (according to economica) snd Socisl status). (తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు. పుటల - 78-80)

ఆర్. యస్. బాగ్స్ Dictonary of Folklore (P. 1142) లో ఆటను C Group క్రింద ఇచ్చి ఆటలకు సంబంధించిన ఉపవిభాగాల్ని ఇలా ఇచ్చాడని ఆర్వీయస్ సుందరంగారు వివరించారు.

C-520 శారీరక చలనానికి సంబంధించినవి.

C-522 వ్యాయామంతో కూడినవి. అన్ని అంగాలు కదిలేట్లు చేసేవి. కొన్ని అంగాలకు మాత్రం సంబంధించినవి.

C-523 పాట, నృత్యం, నడక.

C-524 పరుగుపందెం, తరుముకోవడం, పోరాటం. గుర్రాలు, కుక్కలు, మనుషులు పరుగెత్తడం, కోడి, ఆంబోతు మనుషులు పోరాడటం.

C-526 నాటకీయమైన ఆటలు

C-530 మానసిక ప్రాధాన్యం కలవి.

C-532 బుద్ధి చాతుర్యం

C-534 స్మృతి

C-536 పరిజ్ఞానం

C-538 ఊహ

C-560 ప్రత్యేకమైన వస్తువు లేక సాధనం. పేకలు, బంతులు, గోలీలు, దారాలు, గాలిపటాలు, చిన్నకత్తులు, పిన్నులు మొదలైనవి.

C-580 నీరుమంచు, గడ్డమంచు పడవనడపడం నీళ్ళలో ఆడే ఆట మొదలైవి.[6]

శిష్టసాహిత్యంలో సాధారణంగా ప్రతి కవీ ఏదో ఒక ఆటనైనా తన కావ్యంలో చెప్పక మానలేదన్నచో సత్యదూరం కాదు. బాల్యంలో ఆడినవి.

---

6. ఆంధ్రుల జానపద విజ్ఞానం. పుటలు 354, 355

కౌమారంలో ఆడినవి, యౌవనంలో ఆడినవి, బాలురే ఆడినవి, బాలికలే ఆడినవి బాలబాలికలు ఇరువురూ కలిసి ఆడినవి, స్త్రీలు ఆడినవి అని ఇలా తెలుగు శిష్ట సాహిత్యంలో ఆటల ప్రస్తావన కన్పిస్తుంది. ఒక కవి చెప్పిన ఆటల్ని మరోకవి కూడా చెప్పిన సందర్భాలు లేకపోలేదు.

**నన్నయభట్టు :** నన్నయభట్టు ఆంధ్ర మహాభారతంలో కురుకుమారుల బాల్య క్రీడల్ని సుమారు 3 4 పద్యాల్లో వర్ణించాడు. బలిష్ఠుడైన భీమునితో కౌరవకుమారులు బాలక్రీడలలో పోటి పడ్డారని వర్ణించిన పద్యమిది :

"గిఱుపునెడు నేయునెడవడి
ఱఱచునెడం బెనకునెడ నపారబలంబుల్
మెఱయునెడ భీమునకునం
దొఱుగిద్పడ దొడగిరుద్ధతులు రాజసుతుల్", 7

గిఱుపుట అనగా త్రిప్పుట అని శబ్దరత్నాకరం సూచిస్తుంది. త్రిప్పుట, విసరుట, పరిగెత్తుట అని చెప్పడం వల్ల బాల్యావస్థలోని ఆటల్ని ప్రస్తావించినట్లయింది.

భీముడు పది, పదిహేనుమంది కౌరవుల్ని ఒక్కసారిగ నేలపై పడేట్లుగా పడవేయుచున్నాడనీ, వీపులు రక్తం కారునట్లుగా అందరిని ఈడ్చుచున్నాడని వర్ణించాడు.

"వదలక పెనగి పదుంద్రం
బదియేవుర నొక్కపెట్ట పట్టి ధరిత్రిం
జెవర బడవైచి పవనజు
దదయుండయి వీపులొలియ నందఱనీడ్చున్", 8

మల్లయుద్ధంలాంటి పెనుగులాట కాబోలు.

భీముడు జలక్రీడలాడిన విధాన్ని క్రింది పద్యంలో చక్కగా వర్ణించాడు నన్నయ :

---

7. ఆంధ్ర మహాభారతం. ఆది. 5-164

8 ఆంధ్ర మహాభారతం ఆది. 5-165

"కూడి జలక్రీడ లాడుచో గడగి
యాధృతరాష్ట్ర తనయుల నతులశక్తి
లెక్కించియు బదుండ్ర నొక్కొక్క భుజమున
నెక్కించుకొని వారి యుక్కడంగ
గ్రుంచఁబనీరిలో ముంచుచు నెత్తుచు
గారించి తీరంబు సేరబెట్టు
గోరి ఫలార్థులై వారల యెక్కిన
ద్రుమాకుల మొదళుల వీకబట్టి
వడిగదల్చి పండ్లు దడబడువారలు
తోనధరణి మీద దొరగుచుండ
నిట్టి పాట గాడ్పుపట్టిచే దుశ్శాస
నాదులెల్ల బాధితాత్ములైరి"[9]

పద్యం చివరి పాదాల్లో చెట్టెక్కి ఆడుకునే ఆటను ప్రస్తావించాడు. 'ముట్టుకునే ఆట' అనగా తాకి ముట్టిన వ్యక్తి మళ్ళీ ఇతరుల్ని ముట్టుకోవాలి. ఈ విధంగా చెట్లపైన ఆడుకోవడం పల్లె ప్రాంతాల్లో ఈనాటికీ కనిపిస్తుంది.

సభాపర్వంలో జూదాన్ని గూర్చి ప్రస్తావించాడు. "ధర్మతనయుండు జూదంబునకు బ్రియుండు గాని యందుల యక్కివం బెఱుంగఁడే నక్ష విద్యయందతి దక్షుండ నాతని నక్రమంబున నోడించి తదీయరాజ్య విభూతి నీకిచ్చెద" (సభా. 2-128)

జూదమాడడం తగదని విదురుడు పలుకుతూ

"దమలోన జూదంబు వాదునగుట
గలహమూలంబ యెట్టి శాంతులకైన" (సభా. 2-132)

అంటూ జూదం కలహకారణం అంటాడు. జూదంవల్ల కలుగు నష్టాన్ని ఇలా వివరిస్తాడు:

"జూదమిది యేల దనను
భేదము మీలోనబుట్టు బెలుచనయుష్మ

9. ఆంధ్ర మహాభారతం ఆది 5-166

ద్భేదమునఁ జేసి యెగ్గు
త్పాదిల్లు ధరిత్రీ ప్రజకు భయజననంబై (సభా. 2-185)

జూదమాడడంలో దోషం లేదని ధృతరాష్ట్రుడు "జూదంబన్నది పురాణంబులయందును వినంబడుదీన దోషంబులేదు సుహృద్ద్యూతంబున దేవతలు దేవసాయుజ్యంబు వడయుదురు" (సభా. 2-151).

ధర్మరాజు జూదం రాజులకు తగదనీ, రాజులకు జూదం పాపవృత్తమంటాడు :

"క్షత్రనీతిక్రమంబులు గావు సూవె
నికృతియును జూదమును ధర్మనిత్యులైన
వారికి రెండు వర్జింపవలయు నెందు
పాపవృత్తంబు జూదంబు పార్థివులకు" (సభా. 2-166)

"కుత్సిత కితవుల తోడ జూదమాడదగదు" (సభా. 2-167) అనగా శకుని జూదాన్ని సమర్థిస్తాడు :

"ద్యూతకలాకుశలుండగు
నాతడు లోకజ్ఞుడును మహామతియును వి
ఖ్యాతుండునగు సత్క్రియ
నీతివిదుడు దగునె దాని నిందింపంగన్" (సభా. 2-169)

కౌరవ, పాండుకుమారులు హస్తినాపుర బహిరంగణంలో 'కందుకక్రీడ'ను ఆడారట :

"ధృతరాష్ట్ర పాండునందను లందఱు గందుక క్రీడాపరులయి వేడుకతో నాడుచున్నంత నకాండంచన కందుకం బొక్క నూతంబడి"10

కందుకము అనగా "ఆడెడు చెండు" అని శబ్దరత్నాకరం. చెండు, పుట్టచెండు, బంతి అని వ్యవహారంలో విన్పిస్తాయి. రబ్బరు బంతితో కాని, బట్టతో తయారుచేసిన చెండుతో కాని ఆడుకోవడం ఈనాటికి మనం చూస్తాం. ఈ కందుక

10. ఆంధ్ర మహాభారతము ఆది. 5-206

క్రీడ నాలుగు విధాలుగా ఉంటుందని డాక్టరు వడ్లా సుబ్రమణ్యంగారు పేర్కొన్నారు.

1. కందుక శిలాదిప్రేక్షణం అంటే బొమ్మ బెండు (చిన్న రాతిబొమ్మను నిల బెట్టి కొట్టి ఆడే ఆట)
2. కట్టెపుట్టబెండు (కట్టెతో పుట్ట చెండును కొట్టి ఆడే ఆట)
3. కుండబంతి (రెండు రాళ్ళపైన కర్రను అడ్డంగా పెట్టి గురిచూసి పడ గొట్టే ఆట)
4. తరుముడు చెండు (మైదానంలో చెండు తీసుకొని ఒకరినొకరు తరుముతూ ఆడే ఆట)[11]

**నన్నెచోడుడు :** 'కుమార సంభవం'లో బొమరిల్లు కట్టడం, కూళ్ళు వండడం, బొమ్మలపెండ్లి లాంటి ఆటల్ని ప్రస్తావించాడు. పార్వతి బాల్యంలో శివార్చన చేయడాన్ని వర్ణిస్తూ ఆటలాడిందట.

"తరుణులు చిల్కబొమ్మలును దంతపు బొమ్మలు మేలిగాజు బ
న్నరులును బ్రమానిచొప్పికలు నల్లడనొలిన పేర్చి లీలచే
కురుబొమరింధ్ల జేయనగు కూళ్ళను వండుచు బొమ్మ పెండ్లి మా
నరముగ జేసి యాడనగజాతశివార్చ సేయు నెయ్యెదన్"[12]

పై పద్యంలో 'బొమ్మల పెండ్లి' చేయడం అనే ఆట ప్రధానంగా చెప్ప బడింది. ఈ బొమ్మలపెండ్లి అనేది ఒక విధంగా వేడుక అని చెప్పవచ్చు. పెద్ద లను అనుకరించి పిల్లలు ఈ బొమ్మల పెండ్లిని ఆటగా భావించి చేస్తారు. పది పన్నెండేళ్ళ బాలబాలికలు ఒకచోట చేరి బొమ్మలకు పెండ్లి తంతు నడిపించి విందారగిస్తున్నట్లు నటిస్తూ ఆడుకునే ఆట ఇది.

**పాల్కురికి సోమనాథుడు :** 'పండితారాధ్య చరిత్ర'లో జూదాన్ని గూర్చి ప్రస్తావించాడు జూదానికి అక్షక్రీడ, అక్షవిద్య, అక్షకేళి, నెత్తము అనేవి

---

11. తెలుగు సాహిత్యంలో క్రీడావినోదాలు. పుట. 214, 1987
12. కుమార సంభవం. 3-86. ఆం ప్ర.సా. అకాడమీ.

పర్యాయపదాలు. పాచికలాట పందెంవేసి ఆడే కోడిపుంజుల, పొట్టేళ్ళ ఆటలు జూదం క్రిందికే వస్తాయి. నేడు డబ్బుపెట్టి ఆడే పేకాట కూడా జూదమే. కవుల కావ్యాల్లో సాధారణంగా జూదం అనగానే పాచికలాటగా వర్ణించారని చెప్పవచ్చు. ద్యూతక్రీడను కూడా జూదమనే అనవచ్చు. జూదాన్ని ప్రస్తావించి జూదపు పరిభాషను తెల్పిన మొదటివాడు పాల్కురికి సోమనాథుడే అని విమర్శకుల అభిప్రాయం. భారతంలోని సభాపర్వంలో ద్యూతక్రీడను ప్రస్తావించినా జూదపు పరిభాషను చెప్పినవాడు సోమనాథుడే.

'పండితారాధ్య చరిత్ర'లో కుమారపాలఘూర్జరుని కథయందు కుమార పాలఘూర్జరుడు తన భార్యతో కలిసి జూదమాడాదని సోమన వర్ణించాడు.

"..... ..... ..... ..... ..... గుమార
పాల ఘూర్జరుడను పార్థివేశ్వరుడు
నానందలీలమై నట్లొక్కనాడు
దానును సతియును నెత్తం బాడుతఱిని
గాంత ! ప్రసారులేకాదశేంద్రియము
లభితశ్చతుష్టయం బంతొక్కమూడు
సారయే మోహంబునను నలోకాను
సారులు నెత్తంపుసారులు గాగ
జనుపరిపూర్ణ ప్రసాదావధాని
దనపదియేను నత్తరళాయతాక్షి
వదియేను నేర్వను పలకపై బెట్టి
వదినిహపరములన్ వాడలయందు
పాపపుణ్యములను పాసికల్వైవ
బ్రాపించు ఫలమెన్నబడ దాయముగను
భక్తి సీరైదు బాఱ బొమ్మనుచు
వ్యక్తినా సీరైదు వచ్చిననాడు
పరము నిహంబన బరగునీదగు
హరుభక్తి ప్రబలు నానాడు నిద్దుగను

త్రివిధ లింగములకు త్రివిధార్పణంబు
లొనఁచు నిత్రిగ యనుదాయమాడు
వలవ దచ్చౌక మాటలు నీకు ననుచు
నఁఘుడ దచ్చౌకమని దాయమాడు
బంచేంద్రియములకు శివప్రసాదంబు
బంచిపెట్టిన మాడ్కి బంచియపెట్టు
దోసకార్లకు జొందుగ బెట్టునట్లు
గాసిలనాడు జౌక దుగంబుపడిన
వనయంబు నీ శరణ్యము వీరభద్ర
యనుచు వీరుడు భద్రమను దాయమాడు
నొడలు సత్రా శివయోగులకనుచు
దడయక యాడు సత్రాయనిపడిన
నాకు నాతీవంచనయె గెలుపనుచు
నాకాంక్ష దీవించయను దాయమాడు
వనితఘెచ్చపు వంచఫైచిన ననుచు
వనఘుడు సౌవంచి యను దాయమాడు
నీనెత్త మిట్లాడ నితరుల తరమె
పూని యీశ్వరు కృపలేని వారలకు
నంచు నంతంత భక్తావళి వొగడ
నంచిత భక్తి సమగ్రత దనర
నాదిభక్తి విరుద్ధమైన జూదపు వి
నోదంబు భక్తి వినోదమై పరగ
వేడుక నిట్లాడియాడి యాపంద్ర
చూడు భక్తుడు దనసుదతివీక్షిం
దరహాస భావ విస్ఫురితాస్యుఁడగుచు
నరనాథ వల్లభి నలుదెసల్ జూచి
.... .... .... .... ....
.... .... .... .... ....
పాసికల్ నెత్తంపు బలుకపైబెట్టి"[13]

---

13. పండితారాధ్య చరిత్ర పురాతన ప్రకరణం. పుటలు 368 - 70

జూదానికి సంబంధించిన ప్రస్తావన మరోచోట కూడా ఉంది.

"జూదంబు నింద్యమే సూచింప శివువి
నోదంబు గాగ నివేదింపగనిన
గాయకం బొండెఱుంగమి జేసి మూర్ఖ
నాయనా రెప్పుడు నలి జూదమాడి
గెలిచి యర్థము దెచ్చివలయు పదార్థ
ముల గూర్చి జంగమంబులకు నర్పింప
హరుడు ద్యూతక్రియ నరుదెంచియాడి" 14

"జూదరి జూదంగ గాదనినిచ్చె
నే దేవదేవుండు నిజమట్లకాదే
యర్మిలివ్యసనార్థమై జూదమాడి
ధర్మజముఖ్యులు నిర్మూలమైరి
ఆదట భక్తి హితార్థంబుగాగ
జూదమాడిన మూర్ఖు శూలిగూడండె" 15

అంటూ జూదంవల్ల కలిగే నష్టాన్ని వివరించడం జరిగింది.

సకలేశ్వర మాదిరాజయ్య కథలో మాదిరాజయ్య కుమారుడు బాల్యంలో ఆడిన ఆటల్ని వర్ణించాడు :

"పొందంగ రాగుంజ పోగుంజులాట
గుండెనగుడి గుడిగుంజంబులాట
యప్పలవిందు లాట పల్మాలు
జప్పట్లు పెట్టుట, సరిగుంజలాట
సేర బొంతలయాట, సిట్లపొట్లాట
గోరంటలాట, దాగుడుమూతలాట
దీకొనిదిగు దిగుదాకొన్నునాట
లాకాంక్ష నాతోడ నాడెడువాడు" 16

14. పండితారాధ్య చరిత్ర. పురాతన ప్రకరణం. పుటలు : 412, 413
15. పండితారాధ్య చరిత్ర పురాతన ప్రకరణం పుటలు : 413, 414
16. పండితారాధ్య చరిత్ర. పురాతన ప్రకరణం. పుట 460

'రాగుంజు పోగుంజులాట' అననేమో తెలియదు బహుశా నేడు ప్రచారంలో ఉన్న 'టగ్ అఫ్ వార్'లాంటిదై ఉండవచ్చు. పొడవైన తాడును రెండు జట్లు వాళ్ళు చెరొక వైపున పట్టి లాగుచుందురు. తాడులాగాడాన్ని 'గుంజుట' అని అంటారు. 'కుండెనగుడి' ఆటనే కుండెనగిరి అని అంటారు. దీని స్వరూపం మెలాంటిదో తెలియదు. కేవలం బాలక్రీడా విశేషమని ప్రచారంలో కలదు. గుడి గుంజాంబులాట గుడిగుడి గుంచము ఒకటే. "గుడుగుడు గుంచం – గుండే రాగం" అంటూ బాలబాలికలు గుండ్రంగ కూర్చొని పిడికిలిని బిగించి ఒకరి పిడికిలిమీద మరొకరి పిడికిలి పేర్చి పాట పాడినవాళ్లు ప్రశ్నించగా చెప్పిన సమాధానాన్నిబట్టి చేతితో కొట్టగా వాళ్లు తమ చేతిని వెనుకదాచుకుంటారు ఇలా చేతుల పిడికిళ్ళు చేర్చినవాళ్ళందర్ని ప్రశ్నించడం ఈ అటలో జరుగుతుంది.

'అప్పల విందుయాట' బహుశ విందులకు సంబంధించిన ఆట విశేషమయి ఉండొచ్చు.

సరి గుంజులాట నేరబొంతల ఆటల్ని గూర్చి తెలియరాదు 'సిట్ల పొట్లాట' అనేది చిట్ల పొట్లాట, చిట్ల పొట్లకాయలాంటిదే.

పాల్కురికి సోమనాథుడే మొదటి సారిగా తనకాలంలో ప్రచారంలో ఉన్న అనేకరకాల ఆటల్ని ప్రస్తావించాడు కానీ వానిలో చాలా ఆటల్ని గురించి తెలియదన్నచో అతిశయోక్తికాదు. నిఘంటుకారులే క్రీడా విశేషమని తప్పుకున్నారు. కావుననే తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు "మన మెరిగినంత వరకు తెలుగు సాహిత్యములో దొలిసారిగా నీయాటలను పేర్కొని వానికి ప్రయోగ యోగ్యతను గల్పించిన మహాకవి పాల్కురికి సోమనాథుడు అతడు తన గ్రంథములలో నలనాటి సాంఘిక విషయముల నెన్నింటినో తెలిపినాడు. ఆ మహాప్రయత్నములో కూడా నీ యాటలాతని దృష్టి మరలి పోకుండుట మన యదృష్టము"[17] అని కొనియాడారు.

**మంచన :–** 'కేయూరబాహు చరిత్ర'లో కోడి పోరు, జూదం పేర్కొనబడ్డాయి :

17. ఆంధ్రజాతి విశిష్టత తెలిపే ఆటలు. ఆంధ్రప్రభ 1-12-1966 పుట. 8

"కోడిపోరుల పేర వాడల దిరుగుచు
బొడగన్న కడవల బొలియవైచు"[18]
"జూదంబు నా తోడన్ వేడుకనాడు"[19]

ఎఱ్ఱన :- 'హరివంశం'లో హరిణ క్రీడను గూర్చి ప్రస్తావించాడు. బాలకృష్ణులు మిగిలిన గోప కుమారులతో కలిసి ఆడుకుంటారని వర్ణిస్తూ "గోప రూపంబున గోపకుమారులలోనగలియంద నందఱు హరిణక్రీడనంబును నాట కుందొడంగి"[20] అని అంటాడు.

నాచనసోముడు : 'ఉత్తర హరివంశంలో దాక్షిణాత్యులు రుక్మిణితో నెత్తము' అనే పాచికలాటను ఆడడానికి ప్రయత్నించారని చెప్పబడింది.

"నెత్తము మీద గౌతుకము నిర్భరమై జనియించె సిద్ధు మా చిత్తము లందు"[21]

నాచనసోముడు హరివంశంలో జూదాన్ని విపులంగా వర్ణించాడు. తృతీయా శ్వాసంలో 109 వ పద్యం నుండి 128 వ పద్యంవరకు శ్రీ కృష్ణుడు రుక్మిణీ సత్యభామలతో జూదమాడిన విధాన్ని వర్ణించాడు.

శ్రీ కృష్ణుడు సత్యభామారుక్మిణుల చెంతచేరి నెత్తమాడుదమన్నాడట :

"చక్ర ధరుడట్లు రుక్మిణీ సత్యభామ
లిరుగెలంకుల గొలువ ననేక గణిక
లంతనంత భజింప సత్యా ముఖంబు
చూచి నెత్తమాడద మనుచును గడంగి"[22]

---

18. కేయూర బాహుచరిత్ర. 2-294
19. కేయూర బాహుచరిత్ర. 2-49
20. హరివంశం 5-204
21. ఉత్తర హరివంశం 3-22
22 ఉత్తర హరివంశం 3-109 ఆం.ప్ర.సా.అ. 1979

"ఓ తరుణీ నేను నెత్తము
నీతోనాడునెడ రుక్మిణి కనుంగొను" (8-110) అని శ్రీకృష్ణుడు
పలుకగా ఎవరెవరితో జూదమాడుట తగదని సత్యభామ అంటుంది:

"వామలానితోడ వర్ణింపు తోడను
బూతుతోడ తిండిపోతు తోడ
నటమటినితోడ నవియరె తోడను
వెలకు నెత్తమాడ వెరపుగాదు" (8-112)

ఆ మాటలకు సమాధానంగా శ్రీకృష్ణుడు పలికిన విధాన్ని వర్ణించే పద్యం

"జూదరివి సుమాళివి నెఱ
వాదివి తసుకరివి గెలువవచ్చునటే దా
మోదర నినుమాకనుటయు" (8-118)

చతురంతరాసనమున కూర్చుండి సత్యభామ సాక్షిగా ఉండగా రుక్మిణీ
కృష్ణులు జూద మాడారట:

"జోగిణి గొనరి బైసుక వెట్టి పలకపై
సారెలు వోయించి సరము చూచి
తనకు లాగయిన నెత్తంబు గైకొనిపన్ని
పాసికల్ దాళించి పాటెఱింగి
లోహటంటలు దూనిబలి గన్న బడకున్న
బరదాళమని పోవు బలకలిచ్చి
తప్పార్తు జూ రెండు దాయంబులును గని
వారింపకుము పోటు బ్రాలుగలవు
పంతమడిగిన నీవలె భాగమింత
బోర బెద్దదాయం బాడిపోదు పుచ్చి
వైచినది ధనమునికి పోవచ్చు ననుచు
జేరుకొని పాటుతలి సరిజేసి యడుగ" (8-120)

పాచికలాటలో రుక్మిణి చేతి నైపుణ్యాన్ని ఈ విధంగా వర్ణించాడు.

అత్రీవం చిత్రిగ దుగ
సత్రాదచౌక వంచి చేవం చీరై
దిత్రిగ యిద్దుగ బద్రలు
చిత్రంబున దలచినట్లు చేతికి దెచ్చున్ (8-121)

దుగుణంబు సేసిన తోడనే మూడని
వాదించి లేదని వలుము సేసి
యూరకెత్తకు దాయమ్ముగ్గడించిన గాని
పట్టి వేయకు మని పటితళించి
వెడలిన సారెలు వెనుక ముందఱవేసి
యెత్తిక సారెపోసీక యార్చి
సమమాయె రమ్మని సరసవారలు బిల్చి
గెలుపు సుమాశంబు గెరల జేయు

బసిడి యీరైదు పూజించి పలకమీద
బలపమున వ్రాసి వెల్లివాయి దొలగిపైచి
పన్నిపంచి యొక్కటి నాడపంచి వ్రాలు
దప్పనో పత్రనయనమున దాగెలిచె (8-122)

మరియు "ఆ కపట నాటక సూత్రధారు డంకించుకొని యుల్లసంబున సారెయొడ్డి తొమ్మిది దాయంబుల కిచ్చిన నచ్చెలువ యెక్కి పలక తప్పదాయంబునకు నొక వ్రాయివిడిచె నద్దేవుండు నాదాయ మీరైదు వెనుక యోటంబు విఱుగుననుటయు నదరిపడి యమ్మదిత సవిలాసంబుగా పైచిన నాశౌరి గోరిన దాయంబుపడినం బొంగి వెనుక సరిసరి యని యంతనుండి విన్ననైయాడి యన్నాతిమిగుల నోడి యుం దలంకక" (8-123)

రుక్మిణి ఆడిగెలిచిన విధాన్ని వర్ణించాడు.

చేయదు దుగుణంబు సెలవు లేకుండిన
నెక్కిన పలక బోనిచ్చుగాని
పలుకదు రోషించి పడని పాసికలతో
నవదాయమ్మైనను నాడుగాని

యొల్లదు గోపించి యొండు నెత్తపన్న
నెచరంబు నేర్పని యొన్నుగాని
నడుకదు పంచించి నయమెక్కుడడిగిన
నిలుతమంతట నన్నునిలచుగాని

పలకదఱుమక బయసుక పల్లటిలక
టోటి దూఱక యాతావు పుచ్చుమనక
క్రింద గెలిచిన వ్రాలు లెక్కింపు మనక
తప్పునాడక తొల్లింటి దారిచెడక (8-124)

రుక్మిణీ సత్యభామలు జూదమిక చాలని లేవబోవగా కృష్ణుడు మరలా ఆడుదమని చేయి పట్టుకున్నాడట :

చాలునని పాసె రుక్మిణి సత్యభామ
కరము గరమున గీలించి కమలనాభు
డిందు రమ్మని పిలువ నయ్యింతి నగుచు
నఖముఖంబున బాసికలందు కొనియె (8-126)

ఈసారి సత్యభామ శ్రీకృష్ణునితో జూదమాడి గెలిచిందని వర్ణించాడు.

ఒకదాయ మాడిన నున్నదాయంబాడు
మనకవాటులు రెండు గొని చెలంగి
కానని మాట దాగదచి పోయిన జెప్పు
నెత్తంబు వదదని నేర్పుదెగడి
యొకదాయమునకును నొంటిదాకిన బోయి
యింకపై చెదనని యినుమడించి
పోయెడి నన్నిప్రేయ బూచినవారించి
సూచిపోనిమ్మని సూటి చెఱిచి

సారెమోపును బొరలును సదరసిదుర
మెఱిగిలాగైన గైకొని యించుకంత
పొసంగకుండిన రుక్మిణి బొంకఁబొంక
శౌరిబలిమఁబు గెలిచెనా సత్యభామ (8-128)

"ఇద్దరూ ఇద్దరే" అన్నట్లుగా ఆ సోమనాథుడు మొదటిసారిగా సాహిత్యంలో జూదాన్ని ప్రస్తావించి, జూదపు పరిభాషను పేర్కొనగా ఈ సోమనాథుడు జూదమాడిన విధాన్ని విపులంగా వర్ణించాడు. భార్యాభర్తలు కలిసి ఆడుకుంటున్న జూదాన్ని యింత వివరంగా వర్ణించిన వాళ్లలో నాచన సోముడే ప్రథముడని చెప్పవచ్చు.

'హంస డిభకోపాఖ్యానం'లో జనార్దనుని రాయబారాన్ని విన్న వాసుదేవుడు సమాధానం చెబుతూ యాదవుల పరాక్రమాన్ని వివరిస్తూ ఉప్పనబట్టె ఆటను ప్రస్తావించాడు.

"అప్పన మెంతగావలె నహంకరణంబు దొఱంగి యిచ్చినం
గప్పముపేర నేడు నొడికారి తనంబున మోసపుచ్చగా
నుప్పులు దెత్తురే సమరయోగ్య తలంబున వైరికోటితో
నుప్పన బట్టెలాడు నెడ నుప్పులు దెత్తురుగాక యాదవుల్"(4-155)

మరియు సాత్యకి యిలా అంటాడు :

"తెచ్చెదరెల్ల నేడు మము దెండని పంచిన యుప్పుడాకినుల్"
(4-196)

ఉప్పుబట్టెలాటనే ఉప్పట్టి, ఉప్పుగుందము, చెడ్డాటు అని కూడా పిలుస్తారు. ఈ ఆటను ఆరుబయట మైదానాల్లో ముఖ్యంగా రాత్రిపూట వెన్నెల్లో ఆడుకుంటారు. వీరరస ప్రధానమైందని చెప్పవచ్చు. ఉప్పు తేవడం అంటే శత్రువుల వ్యూహాల్ని భేదించి వారి కోటను వశపరచుకోవడం లాంటిది. ఈ ఆటనుగూర్చి డాక్టరు వడ్లా సుబ్రమణ్యంగారు :

"ఉప్పు + పట్టెలు ⟶ ఉప్పు + న + బట్టెలు ⟶ ఉప్పనబట్టెలు. ఈ ఆటకు గీచే నిలువు, అడ్డగీతల్ని పట్టెలు అంటారు. పట్టె దాటి ఉప్పు తీసికొని వచ్చే ఆట కాబట్టి 'ఉప్పనబట్టెలు' అయింద"[23]ని వివరించారు.

---

23. తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు. పుట. 225. 1987

ఉప్పనబట్టె ఆట నిర్మాణం ఇలా ఉంటుంది

నాచనసోముడు మరోచోట చిత్రరేఖచేత ఉష చూపుల్ని ఉప్పన బట్టె లాటలతో పోల్చి చెప్పిస్తాడు :

"పడతి నీ చూపులుప్పన బట్టెలాడించు
చెలుల వక్త్రముల బూజించుగాక" (5-139)

కేతన : "దశకుమార చరిత్ర"లో పాచికలాటను గూర్చి ఐదవ ఆశ్వాసం లోని 63 వ పద్యం నుండి 69 వ పద్యం వరకు వర్ణించాడు.

"ఒక్కయెడ నక్షధూర్తుల వెంటగని యచ్చోటికింబోయి" (5-63)

"ఇరవారు నిరువదియేను జూదములందు నెనలేని నేర్పరితనము చూపి, తై యధికంబుగ గల్లసారెలు వైచి యొక్కుడాయంబుల యెడల గడపి, యనువైన

తొలుకతనము పాసికలను వలసిన దాయంబు వైచికొను" (5-64)

"ఇట్లనేక ప్రకారంబుల నక్షకేళిం దగిలియున్నవారల" (5-66)

అక్షధూర్తుడనగా పాచికలాడువాడనీ, అక్షకేలి, అక్షక్రీడ అనగా పాచిక లాట అనే అర్థం. పాచికలాటకు నెత్తము, పచ్చీసు, సొగటాలాట, పగడసాల అని పర్యాయపదాలు.

"ఈ యాట మన తెలుగువారిలో విశిష్టతతో నిలిచిందనవచ్చు. నేటికిని ఈ ఆటను రెండు పాచికలతో వైదిక బ్రాహ్మణ స్త్రీ పురుషులు పలువురాడు చున్నారు. తక్కిన వర్ణములవారు పాచికలకు మారుగా 6 కాని, 7 కాని గవ్వ లను లొడివేయుచు ఆడుదురని"[24] శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు పేర్కొనిరి.

"పాచికల ఆకారము ఈ విధంగా ఉండునని సురవరంవారు పేర్కొ నిరి."[25]



కేతన వర్ణించిన కోడిపందేలాట వర్ణనం :

ఆనారికేళ జాతికి
మానుగ నొకజాతి పోర మార్కొనదగుడుం
దానట యరుకలి యనుచును
మానక పోరించు నధిక మాత్సర్యంబునన్ (9-82)

24. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 86
25. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 87

మరియు,

"ఎపెన కోడిమున్నెనసి యారెలు మెడ
వెసగాడ నురపడి వ్రేసివ్రేసి
యదివేయ మది కిన్కనదరి బల్పునఁబట్టి
కబళించి యందంద గడిమి కడిమి
వి్ఖ ముఖంబులు వెనువెంట దగులుచు
నంతంత దగులుచు దాగియాగి
వాగాటులక వచ్చి వసుమతి నిలువక
యొంటి తన్నున గొనరుడిపియుడిపి
గెలిచె నామాట తగనారికేళజాతి" (8-88)

తెలుగు సాహిత్యంలో కోడిపందేలాటను వర్ణించినవాడు కేతన మొదటి వాడు. కేతన తర్వాత కవులనేకులు తమ తమ కావ్యాల్లో కోడిపందేలాట, కోడి పోరు అనే పేర్లతో తమ తమ కావ్యాల్లో వర్ణించారు. కేతన కోడిపందేలాటను సంస్కృతంలోని దశకుమార చరిత్ర ననుసరించి వర్ణించాడని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు పలికిన పలుకులివి. "దండి క్రీ.శ. 750 ప్రాంతమువాడు. అతడు తన దశకుమార చరిత్రములో కోడిపందెమును వర్ణించినాడు. అందు నారికేళజాతి ఒక జాతికోడిని గెలిచెనని వ్రాసెను. అభినవ దండియగు కేతన తెలుగులో దశకుమార చరిత్రమును వ్రాసినప్పుడు కోడి పందెమును బాల విస్తరించి వ్రాయుటచేతను తెలుగుదేశమందా పందెమెంత ప్రాముఖ్యము పొందియుండెనో యూహింపవచ్చును."26

కోడిపందెంలో కోళ్ల కుడికాళ్ళకు జేనడు కత్తులను గట్టి పోరుకై వదలి పెడతారు. ఈ పందెంలో డబ్బును పెట్టి ఆడడం కలదు. అందుకే కాబోలు ఈ ఆట ప్రజల్లో జూదస్వభావాన్ని పెంచుతుందని తలంచి ప్రభుత్వం వాళ్లు ఈ ఆటను నిషేధించారు. కోడి పందేలాటను ఆడించుటకై పూర్వం శాస్త్రాలు ఉండే వట. కావుననే సురవరం ప్రతాపరెడ్డిగారు "కోడి పందెమునకై యొక్క శాస్త్రమే మన తెనుగువారు వ్రాసిపెట్టుకొన్నారు. చలికాలములోను, సంక్రాంతి పండుగ కాలములోను కోళ్ల పందెములకై కోళ్ళను చంకన బెట్టుకొని కుక్కుట శాస్త్రమును

26. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట, 84

గుండు రుమాళ్లలో దోపి, తమ శాస్త్ర ప్రకారముగా కుక్కుట సజీవద్యూత నిపుణులు పందెమును కట్టుతూ ఉండెడివారు"[27] అని అన్నారు.

తెలుగువారి ప్రాచీన వినోదాలలో కోడిపందేలాట ఒకటి. కోడిపందేలాటను గూర్చి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారిట్లు వివరించారు.

"సంక్రాంతి పండుగలలో జరుపుకొను వేడుకలలో కోడిపందెముల ఆట యొకటి. గరువు ప్రదేశమున ఆ యాటలు జరుగుటచే కొన్ని గ్రామముల దగ్గర ఇప్పుడీ యాటలు లేకపోయినను 'కోడిపందేల గరువు' అను పేరు కొన్ని గ్రామములలో స్థల వ్యవహారమున్నది. కోడిపందెములు మన దేశములో ఇప్పటికి వేయి సంవత్సరములకు పూర్వము నుండి వాడుకలో నుండిన యాట. దీనిని పదునైదవ శతాబ్దములో ప్రాగ్దేశములను సందర్శింప వచ్చిన విదేశీ యాత్రికులు కూడా వర్ణించియున్నారు. ఇది దక్షిణ హిందూ దేశములోనే కాక జావా, సుమిత్ర మొదలైన ప్రాగ్ద్వీపములలో సైతము వాడుకలో ఉండినట్లు వారి వృత్తాంతముల వలన తెలియుచున్నది. కోడిపోరు పూర్వపు సంస్థానాధీశులకు చాలా ప్రియమైన వేడుకలలో ఒకటియని పెద్దాపురం 'కోడిపుంజుల కథ' మొదలైన జానపద గేయములవలన తెలియుచున్నది, కోడిపందెములు గొప్ప యుద్ధములకును కారణము లయినవి. పలనాటి యుద్ధమునకు గల కారణములు కోడిపందెముల ఆట యొకటి"[28] నిజమైన విషయమే కదా! బొబ్బిలివీరుల కయ్యానికి, పల్నాటివీరుల పోరాటానికి కోళ్ళ పోరే ప్రధాన కారణంగా కనిపిస్తుంది.

**గోన బుద్ధారెడ్డి:** 'రంగనాథ రామాయణం'లో శ్రీరాముడు తనకాప్తులైన వారితో కలిసి చెండు ఆటను ఆడినట్లు వర్ణించాడు.

"ఆయెడ రఘురాము డాప్తులు దాను
నిండారు ప్రేమతో నెడ్డలుగట్టి
చెండును దండంబు చెలువొప్పబట్టి
తతిమీది యాడెడు లేటిని దట్టుటయు
కట్టు రాముడా కష్టంబుచేత"[29]

27. ఆంధ్రుల సాంఘిక చరిత్ర. పుట. 94
28. విజ్ఞాన సర్వస్వము సంపు. 3 పుటలు 24, 25
29. రంగనాథ రామాయణము వావిళ్ల ప్రతి 1949

**శ్రీనాథుడు :** 'పల్నాటి వీర చరిత్ర'లో గుమ్మడికాయ లాట, చెరుకు పందేలాట, పోకలాట, బంతులాట, జంతు పోరాటము లాట, రూకలకుప్పలాట మొదలైన ఆటల్ని పేర్కొన్నాడు.

బాలచంద్రుడు మేడిపిలో ఇతర బాలలతో కలిసి ఆటలాడుకొనుటను వర్ణించిన విధం :

"గుమ్మడి కాయలు కొంత సేపాడి
చెరుకు పందెంబు చెల్వొప్ప గెలిచి
తన సంగడల దయతోడ నిచ్చి"[30]

గుమ్మడికాయ లాటను గుమ్మడికాయ కోసం సంభాషణా పద్ధతిలో పాట పాడుచు ప్రశ్నలకు సమాధానం చెప్పుచూ పాడుకుంటారు, "పది పన్నెండేళ్ళ లోపు బాలబాలికలు ఒకచోట చేరుతారు. వారిలో పెద్ద వాళ్ళిద్దరు ఆట పెద్దలుగా వ్యవహరిస్తారు. తక్కిన వారినందరినీ సైజువారీగా ఒకరిముందు ఒకరిని కూర్చోబెడతారు. ఆటలో మొదటి ఆట పెద్ద పెద్దవారి పక్కన కూర్చుంటుంది. రెండో ఆట పెద్ద చిన్నవారి సరసన నిల్చుంటుందని అపుడు పెద్దలందరూ గుమ్మడికాయలై ప్రశ్నలు - సమాధానాలు చెప్పుకుంటూ చివరకు 'గలిబిలి గలిబిలి' అని అరుచుకుంటూ పరుగెత్తుతార"[31]ని శ్రీవడ్లా సుబ్రహ్మణ్యంగారు వివరించారు.

చెరుకు పందేలాట యువకుల బలప్రదర్శనకు తగిన పరీక్ష. బాగా చెరకు పండే ప్రాంతాల్లో సంక్రాంతి పండుగ సమయాల్లో ఈ ఆటల్ని పందేల రూపంలో ఆడుకుంటారు. చెరుకుగడల్ని మోపుగా గట్టి ఒక్కవేటున కత్తితోగానీ గొడ్డలితోగాని నరుకవలసి ఉంటుంది. గెలిచిన వాడికే ఆ చెరుకులన్నీ చెందుతాయి. అందుకే బతాంబు చెరుకు పందెంలో గెలిచిన చెరుకుల్ని స్నేహితులకిమ్మని చెబుతుంది. ఇలాంటిదే కొబ్బరి పందేలాట. ముఖ్యంగా నాగుల చవితి పండుగ సమయంలో కొబ్బరి చిప్పల్ని (ఎండినవి) పోక కొబ్బరిని పిడికిలితో

30. పల్నాటి చరిత్ర. 2వ భాగం. పుట. 82
31. తెలుగు సాహిత్యంలో క్రీడావినోదాలు. పుట. 312

గుడ్డి ఎవరెన్ని ఎక్కువ ముక్కలు చేస్తే వాళ్ళు గెలిచినట్లు చెప్పకోవడం గ్రామాల్లో ఈనాటికి మనం చూడవచ్చు

ప్రొద్దు పోవకున్నచో ఆటలాడు కొమ్మనిబాలచంద్రునితో చెప్పుచున్న విధం చూడండి :

"ప్రొద్దు పోవకయున్న పుత్రరత్నంబ
పోకలాటలచేత బుచ్చుము ప్రొద్దు
ఆడుడి ముత్యమ్ములమరు బంతులును
గుంతమూపల నాడికొని గెల్చుకొనుము
బైట నాడగవద్దు బడలెదు సుతుడ
కుటిల జంతువుల దెచ్చి గుడిలోన నుంచి
విడిపించు పోరాడు విధమును చూడు
దూకలకుప్పలు రూఢిగనాడు"[32]

పోకలాటను గూర్చి శ్రీ వడ్లా సుబ్రమణ్యంగారు ఇలా చెప్పారు "మగ పిల్లలు కొంతమంది పోకలు (వక్కలు) జేబులు నింపుకొని వెళ్ళి పందిళ్ళ కిందనో, ఇంటి చావడిలోనో, రచ్చబండ మీదనో, ఏ సత్రంలోనో గుమికూడు తారు. అందుల ఒకరు ఒక పోక దీసి మోకాలిమీద బోర్లించి చూపుడువేలితో ఎగురగొడతారు ఈలోగా మిలిగిన వాళ్ళు పందెం కాస్తారు. ఎగిరిన పోక బోర్ల పడుతుందని కొందరు అయిదో, పదో పోకలను పణంగా ఒడ్డుతారు. మరికొందరు వెల్లకిల పడుతుందని పందెం కాస్తారు. ఆటలాడు పోకను ఎగుర కొడతాడు. పోక బోర్లపడితే బోర్లపడుతుందని చెప్పినవాళ్ళు వెల్లకిల పడితే అలా చెప్పినవాళ్ళకు మిలిగిన వాళ్ళు పోకల్ని ముట్టచెప్పుకుంటారు."[33] ఈ ఆటలో పోకల్ని పందెంగా పెడతారు కాబట్టి 'పోకలాట' అని పేరు వచ్చిందని తలంప వచ్చు.

బంతులాట : రబ్బరుబంతితో, బట్టబెండుతో ఆడే ఆట అయి ఉండవచ్చు

---

32. పల్నాటి వీరచరిత్ర 2వ భాగం. పుట. 32
33 తెలుగు సాహిత్యంలో క్రీడావినోదాలు పుట. 468

గుంతమాపలాట ఏ విధంగా ఆడుతారో తెలియదని పండితుల అభిప్రాయంగా ఉంది. అయితే శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "గుంతమాపలన ఒక పలకలో కొన్ని గుంతలుచేసి అందు చింతగింజలు పోసి ఆడు ఆటయై యుండునని"[34] ఊహించియున్నారు. "జంతుల పోట్లాటలన పొట్టేండ్ల పోరితము. కోళ్ళపందెము పికిలి పిట్టల కలహము దున్నల యుద్ధం అయివుండునని"[35] జంతువు లాటల్ని గూర్చి సురవరం వారే పేర్కొనిరి. రూకల కుప్పలాట స్వరూపమేమిటో తెలియ దని చెప్పినా శ్రీ వడ్లా సుబ్రమణ్యంగారు 'సరిబేసుల' ఆట కంటే భిన్నమయింది కాదంటూ "రూకలను కుప్పగా పెట్టి ఆ కుప్పలో సరి రూకలున్నాయో బేసిరూ కలున్నాయో ఊహించి ఉజ్జాయింపుగా చెప్పి ఆడే ఆటకావచ్చు"[36] అని ఊహిం చారు. చింతపిచ్చల్ని ఈ విధంగా ఆడుకోవడం ఈనాటికి పల్లె ప్రాంతాల్లో కన్పిస్తుంది కూడా.

పల్నాటి చరిత్రలో వర్ణించబడ్డ మరో ముఖ్యమైన తెలుగువాళ్ళ ఆట బొంగరాలాట. ఐతాంబ బాల చంద్రునితో భారతాది యుద్ధకథల్ని వినుమనగా బాలచంద్రుడు,

"ప్రకృత కౌమార చాపల్యంబు కతన
చిత్త విభ్రాంతికై చేరి యీ వేళ
బొంగరమ లాడగ బుద్ధి జనించె"[37] అంటాడు

ఆంధ్రదేశంలో నేటికీ పిల్లల్లో బహుళ ప్రచారంలో ఉన్న ఆట ఇది. ఈ ఆటను గూర్చి వివరించాల్సిన అవసరం కూడా వుండదు. కారణం అది లోక ప్రసిద్ధ మైన ఆట కాబట్టి. ఇది మగపిల్లల ఆట. కర్రతో చేసిన బొంగరానికి ములికి ఉంటుంది. జాలివు చుట్టి నేలపై వేస్తే అది గుండ్రంగా తిరుగుతుంది. బొంగ రాటను పల్నాటి వీరచరిత్రలో వర్ణించినంత మరే కావ్యంలో వర్ణించలేదన్న అతిశ యోక్తి కానేరదు.

---

34. ఆంధ్రుల సాంఘిక చరిత్ర : పుట - 93.
35. ఆంధ్రుల సాంఘిక చరిత్ర : పుట - 93.
36. తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు - పుట 502
37. పల్నాంటి వీర చరిత్ర - 2వ భాగం పుట - 88

బాలచంద్రుడు బొంగరాలాట ఆడుతాననగా బొంగరాలాట వల్ల కలిగే నష్టాన్ని ఐతాంబ చెప్పిన విధం చూడుడు :

"..... ..... ..... వడబొంగరాల
ఆడిన జేతప్పి అతివలకైన
తగు బాలురకునైన దాకునుబోయి
పడతులు కోపించి పలుతెరంగులును
శపియింతురీ మాట సత్యంబు పుత్ర"[38]

బొంగరం చేయు విధానాన్ని బాలచంద్రుడు తల్లితో చెప్పిన విధం :

"..... ..... ..... అధిక ధనంబు
పొందుగా దెప్పించి పుటముపెట్టించి
పైడి బొంగరముల పరగ జేయింపు
వెండిచే ములుకులు వెలయ బెట్టింపు
పట్టుచే జాతెలు పన్నిపేనింపు
ముత్యాల కుచ్చులు మొదలగూర్పింపు
తెప్పించి యిప్పింపు"[39]

బాలచంద్రుడు బొంగరమును త్రిప్పిన విధం శ్రీనాథుడు కన్నులకు గట్టినట్లుగా వర్ణించాడు.

"బలపరాక్రముడైన బాలచంద్రుండు
ఘనతర మాణిక్య ఖచితమైనట్టి
బొంగరం బరచేత బూనుకయుండి
నేరుపు చూడుడి నిలచిమీరెల్ల
తిరిగింతు చేతిలో దీటులేనట్టు
లవనిపై బడకుండ అనంతరమందె
పట్టి యాడించెద బహువిధగతుల

38. పల్నాటి వీరచరిత్ర - 2 వ భాగం - పుట. 33 : 1984
39. పల్నాటి వీరచరిత్ర - 2 వ భాగం - పుట. 34, - 1984

అని చుట్టు నున్నట్టి అతివల జూచి
అత్తమామల భక్తి అమరినవారు
పతి మాటలకెదురు పలుకనివారు
వినయమౌ నామాట వినుడి మీరెల్ల
దూరాననుండుడి తొలగి కన్గొనుడి
అని చెప్పి బొంగరం బరచేతబట్టి
ముత్యాల జాలెను ముదమునజుట్టి
చేయెత్తి హుంకించి స్థిరబలంబునను
వేసిన వడిమీర వేగమెపోయి
సంయమీశుండను చక్రాతిదాటి
మింటి మీదికెగసి మెరుగులుగ్రక్కు"[40]

బొంగరాలాట ఆడుటకు పోవుచూ బాలచంద్రుడు ఆతని భ్రాతృ సంచయము ఆటలాడుకొనుటకై సాధనాల్ని తీసికొనిపోయారని వర్ణించబడింది:

"గచ్చకాయలు కొన్ని కలిగినయట్టి
తిత్తులు చిరుతలు తీరైనగోడెలు
జూదమాడుటకై సొగటాలు కొన్ని
బంతులు పిట్టలు పంజరచయము
పేరైన డేగలు పిగిలిపిట్టలును
శారికావళి కీరసంఘంబు మరియు
ఆట సాధనాల వెంటరాగ"[41]

పై సాధనాల్నిబట్టి వాళ్లు గచ్చకాయలాట, పాచికలాట, జంతువులాట, పక్షులాటలు ఆడగలరని తెలియవచ్చును. పై ఆటసాధనాలన్ని ఈ ఆటలకు సంబంధించినవే.

శ్రీనాథుడు "పల్నాటి వీరచరిత్ర"లో కోడిపోరును గూర్చి ప్రస్తావించాడు.

---

40. పల్నాటి వీరచరిత్ర - 2 వ భాగం - పుటలు 39 40
41. పల్నాటి వీరచరిత్ర - 2 వ భాగం - పుట 40

"కోడిపోరుకు నీవు కోరినవారి
గొనిపొమ్మటంచు"— అనీ (8వ పుట - 1వ భాగం)

"పుంజులు రెండును పోరాడియాడి
భుగులును నెత్తురు ధోరున క్రక్కి
తిట్టినట్లొక పుంజు దిగ్గునచచ్చె"— (13వ పుట - 1వ భాగం)
"కోడిపోరని నేడు గురజాలలోన
జనులెల్ల వినునట్లు చాటంగ పంచి" (27వ పుట - 1వ భాగం)

నాయకురాలు నాగమ్మ కోడిపుంజును జూచి జనులంతా మెచ్చుకొన్నారని వర్ణించిన విధం చూడుడు :

"ఈ రూపు ఈ రేఖ నివిరిచూడగను
ఈలావు ఈవన్నె నీమించు కెంపు
ఏ పుంజులందుల నెరుగమే భూమి
కరువయే కోడియై కలియుగంబునను
జనియించెనో కాక, జగములో నిట్లు
పుంజుట కల్గునే పోటు పోమదుండు" (38వ పుట - 1వ భాగం)

పందెపుకోళ్ళు రెండు పోరుచున్న విధం క్రింది పాదాల్లో చక్కగా వర్ణించాడు.

"పుంజులు విడిపించి పోర నిండనిరి
గోపును రెడ్డియు కోళ్ళను పట్టి
గరడితో దగ్గర కట్టెదమనుచు
పోరుకు విడిచిన పుంజులు రెండు
పొంగుచు రెక్కను పొరిపొరినార్చి
కనుల నిప్పులురాలు కైవడినవి
ఉగ్రంపు దృష్టిని నొండొంటి చూచి
కులగిరులం దరంగ కూయుచు చేరి
ముక్కుముక్కున చేర్చి మొనసిరోషమున
మెడయీకలుబ్బగా మెడవంచి రెండు

అని చుట్టు నున్నట్టి అతివల కూడి
అత్తమామల భక్తి నమరినవారు
పతి మాటలకెదురు పలుకనివారు
వినయమౌ నామాట వినుడిమీరెల్ల
దూరాననుండుడి తొలగి కన్గొనుడి
అని చెప్పి బొంగరం బరచేతబట్టి
ముత్యాల జాలెను ముదమునజుట్టి
చేయెత్తి హుంకించి స్థిరబలంబునను
వేసిన వడిమీర వేగమెపోయి
సంయమీశుండను చక్రాతిదాటి
మింటి మీదికెగసి మెరుగులుక్రమ్మ"[40]

బొంగరాలాట ఆడుటకు పోవుచూ బాలచంద్రుడు అతని భ్రాతృ సంచయము ఆటలాడుకొనుటకై సాధనాల్ని తీసికొనిపోయారని వర్ణించబడింది :

"గచ్చకాయలు కొన్ని కలిగినయట్టి
తిత్తులు చిరుతలు తీరైనగొడెలు
జూదమాడుటకై సొగటాలు కొన్ని
బంతులు పిట్టలు పంజరచయము
పేరైన డేగలు పిగిలిపిట్టలును
శారికావళి కీరసంఘంబు మరియు
ఆట సాధనాల వెంటరాగ"[41]

పై సాధనాల్నిబట్టి వాళ్ల గచ్చకాయలాట, పాచికలాట, బంతులాట, పక్షులాటలు ఆడగలరని తెలియవచ్చును. పై ఆటసాధనాలన్నీ ఈ ఆటలకు సంబంధించినవే.

శ్రీనాథుడు "పల్నాటి వీరచరిత్ర"లో కోడిపోరును గూర్చి ప్రస్తావించాడు.

---

40. పల్నాటి వీరచరిత్ర - 2వ భాగం - పుటలు 39, 40
41. పల్నాటి వీరచరిత్ర - 2వ భాగం - పుట 40

"కోడిపోరుకు నీవు కోరినవారి
గొనిపొమ్మటంచు"— అని (8వ పుట - 1వ భాగం)

"పుంజులు రెండును పోరాడియాడి
భుగులును నెత్తురు బోదునక్రక్కి
తిట్టినట్లొక పుంజు దిగ్గునచచ్చె"— (13వ పుట - 1వ భాగం)
"కోడిపోరని నేడు గురజాలలోన
జనులెల్ల వినునట్లు చాటంగపంచి" (27వ పుట - 1వ భాగం)

నాయకురాలు నాగమ్మ కోడిపుంజును జూచి జనులంతా మెచ్చుకొన్నారని వర్ణించిన విధం చూడుడు :

"ఈ రూపు ఈ రేఖ నివిరిచూడగను
ఈలావు ఈవన్నె నీమిచుకెంపు
ఏ పుంజులందుల నెరుగమే భూమి
కరువయే కోడియై కలియుగంబునను
జనియించెనో కాక, జగములో నిట్లు
పుంజుట కల్గునే పోలు పోవుచుండు" (28వ పుట - 1వ భాగం)

పందెపుకోళ్ళు రెండు పోరుచున్న విధం క్రింది పాదాల్లో చక్కగా వర్ణించాడు.

"పుంజులు విడిపించి పోరనిండనిరి
గోపును రెడ్డియు కోళ్ళను పట్టి
గరడిలో దగ్గర కట్టెదమనుచు
పోరుకు విడిచిన పుంజులు రెండు
పొంగుచు రెక్కను పొరిపొరినార్చి
కనుల నిప్పులురాలు కైవడినవి
ఉగ్రంపు దృష్టిని నొండొంటి చూచి
కులగిరులం దరంగ కూయుచు చేరి
ముక్కుముక్కున చేర్చి మొనసిరోషమున
మెడయీకలుబ్బగా మెడవంచి రెండు

ఉప్పరం బెగయుచు నురవడితన్ను
తన్నిన తూలక దిట్టంపుగోళ్ళ
మిట్టి మీఁదికి నెగసి మీఁదుచు తన్ని
తరవంగ వచ్చిన గతిచూచి బరిని
వలయంబుగా వచ్చి విడితన్నుటయును
చిరచిర తిరుగుచు చేరియాలోని
ఉరవు వ్రేయగ చూచి యెక్కుడై యుబ్బి
రెక్కల పెల్లార్చిరేగి మొత్తంగ
పెంధూళి యొగసియు పెంపగుచుండ
సంగ్రామకేళికి సంతసంబంధి
ఊంకించి తన్నగా నురములనాటి
రక్తంబు దొరగంగ రాగంబునొంది
తన్నుట తాకుట తాకుట తమకునొచ్చుటయు
తలపక మగటిమి తలకొనిరెండు
తలపడెనట దేవతలు చోద్యపడగ
వృత్రాసురుండు దేవేంద్రుడు మరల
వైరముల్ పోడముగా వాలియుంపగిది
రూపులు మార్చి యారూఢి విక్రములు
కయ్యంబు చేయంగ కణగిరోయనగ
పుటపుట దమ్మెట పోరటుట ఏడులు
మటితంబు లాదిగాగల చిత్రగతుల
కంటికి వేడుకల్ కలిగింపచూచి
భూమిలో ఈపాటి పుంజులపోరు
చెప్పగా వినియు చేయచూచియు
ఎరుగమెన్నడు వినుమ నెల్లవారలనో[42]

చిట్టిమల్లుడను కోడి పోరులో విజృంభించిన విధాన్ని శ్రీనాథుడు వర్ణించిన విధం చూడుడు:

---

42. పల్నాటి వీర చరిత్రము : 1 వ భాగం : పుటలు : 28, 20

"గరుడుండు బాలనాగము ప్రేయుభాతి
సివ్వంగి లేడిని చేకొన్నకరణి
సింహంబు మదకరి చెనకినభంగి
శరభంబు సింహము జంకించుపోల్కి
గండభేరుండము క్రమమున నుండి
శరభంబు చేరిన చందంబు భంగి
తోరంపు కోపంబుతో నర్ధనారి
చిట్టి మల్లదపుడు చిరచిరలాడి
నల్లమల్లనిచేరి నానా విధముల
నేరుపు పచరించి నిటలంబుతన్ని
మెడతన్ని యటకొన్ని మెరవడితన్ని
చుట్టును తిరుగుచు జూటంబుతన్ని
గరిడెల్ల తానెయై గాసిలచేసి
పలయంబుగా వచ్చి పడి కూసికూసి
ఒకపరి చెలరేగి యూకించి తన్న
ముక్కున నెత్తురు మునుకొనివచ్చి
గుడ్డును వెలికురికి కూత పెట్టుచును
భుగులున నెత్తురు భూమిపై కక్కి
తలతెగి యట్లంత ధరణిపై పడియె"[43]

"శివరాత్రి మాహాత్మ్యం"లో సుకుమారుడు శైశవంలో ఆడిన ఆటల్లో కందుకకేళి, పిల్లదీవాట, మల్లు ఆటల్ని ప్రస్తావించాడు.

"ఒక కొంత ప్రొద్దు కందుకకేళి యొనరించు
గంకణంబుల ఝణత్కారమెసగ
.... .... .... .... .... ....
.... .... .... .... .... ....
.... .... .... .... .... ....
గొంత ప్రొద్దు వినోదించు గొలితలయిన
తోడివేడుక కాంద్రతో మేడమీద

43 పల్నాటి వీరచరిత్ర : 1 వ భాగం - పుటలు - 29, 30

విమల చంద్రోదయారంభ వేళయందు
బిల్లదీవాటలను, మల్లపెనుగటలను"[44]

'కందుకేళి' అనగా బంతి ఆట. ఇంతకు పూర్వమే చర్చించబడింది. "పిల్ల దీవాట" అనగా బాల్యక్రీడా విశేషమని శబ్దరత్నాకరంలో చెప్పబడింది. డాక్టరు వి. సుబ్రమణ్యంగారు "పిల్లయేడలు, పంటకాలువలు ఎండిపోయిన రోజులలో వెన్నెల రాత్రిళ్ళలో లేక సాయం సంధ్యావేళల్లో ఇద్దరిద్దరు జట్టుగా చేరి ఇసుకలో 'పిల్లదీవాట' ఆడుకుంటారు. వ్యవహారికంగా దీనిని పుల్లాట లేక చిక్కు చిక్కు పుల్లాట అనడం కూడా కద్దు. ఆడపిల్లలు మగపిల్లలు వేర్వేరుగా గానీ, లేదా కలిసి మెలిసి గానీ ఆడుతుంటారని"[45] వివరించారు. మల్లపెనుగుట మల్లయుద్ధం లాంటిదయి ఉండొచ్చు.

"హరవిలాసం"లో కందుక క్రీడను, బొమ్మల పెండ్లిని ప్రస్తావించారు :

"కందుక క్రీడపై గారాబు పచరించు
హస్తాబ్జముల బూనె నక్షమాల
.... .... .... .... .... ....
బొమ్మ పెండిలి పాట ప్రొద్దుపుచ్చు నెలుంగు
నీలకంఠ స్తోత్రనియతి గూర్చె"[46]

"కాశీఖండం"లో బంతి ఆట, అక్షక్రీడను పేర్కొన్నాడు. "కందు కేశ్వర ప్రాదుర్భావ సంభవము" అను కథలో కందుకేశ్వర మాహాత్మ్యమును తెలుపు సందర్భంలో భవాని కందుక క్రీడను గూర్చి ఇట్లు వర్ణించాడు.

ఒక్కనాడు భవాని యుబుసుపోవక పైడి
జలపోసనము కసీసంపుబట్టు
బంతిగుట్టిమ భూమి బాణిపల్లవమున
నాస్ఫాలనము చేసి యాడుచుండ

44. శివరాత్రి మహాత్మ్యం - పుట. 2-87.
45. తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు - పుట 452
46. హరవిలాసం - 4-11

నప్పు దంబరవీధి నసుగలిద్దఱు గూడి
కందుకం బెగవైచు గౌఁబుచ్చి
ప్రథమ వేషముదాల్చి పట్టంగ వచ్చిరి
గనుసన్నచేసి శంకరుడు వనుప

బర్వతాత్మజ యక్కూట పారిషదుల
బంపె నచ్చెండునన యురస్థలులవైచి
కపట దైత్యుల బరిమార్చె గందుకంబు"[47]

గుణనిధి దుర్వర్తనాన్ని వర్ణించు సందర్భంలో ద్యూతక్రీడను, సజీవ నిర్జీవ ద్యూతమలంటూ ద్యూతవిభజనాన్ని పేర్కొన్నాడు శ్రీనాథుడు.

"ద్యూతక్రీడారతుడై
యాతడు కితవులఁను దాను నాసాయంబా
ప్రాతస్సమయము దిరుగన
పేత నిజాచార దగుచు నెల్లెడపిటన్"[48]

"ద్యూతకారుల తోడి యుద్ధివదయు" (4-81) అని, "సజీవ నిర్జీవ ద్యూతంబులనోడిన ధనంబులు గితవులకుం దల్లమేని రవణంబుల నమ్మి పెట్టుచుండు" (4-82) అని అంటాడు.

అక్షక్రీడాజీవనం డొకడు గుణనిధిని గూర్చి తండ్రి కెఱింగించుచూ:

"అక్షధూర్తులలోన నీయనుగు గొడుకు
దొరయునంతటి యక్షధూర్తుండులేడు"[49] అని పలుకును.

వల్లభరాయుడు 'క్రీడాభిరామం'లో కందుకక్రీడ, పాములాట, కోడిపందేలాట, పొట్టేళ్ళపోరు మొదలైన జానపదుల ఆటలు ఆయా సందర్భాల్లో వర్ణించబడ్డాయి.

---

47. కాశీఖండం 6-161 వావిళ్ళప్రతి - 1917
48. కాశీఖండం 4-80 వావిళ్ళప్రతి 1917
49. కాశీఖండం 4-101 వావిళ్ళప్రతి 1917

పామరభామ గోమయ పిండములను ఇంటిముందు అలంకరించుచున్నదని చెప్పు సందర్భంలో 'కందుకకేళి'ని ప్రస్తావించారు :

"కందుకకేళి సల్పెడు ప్రకారమునం బురషాయితక్రియా
తాండవరేఖ చూపెడు విధంబున బామరభామ లేత యీ
రెండవ ప్రభాతవేళ రచియించె సితంబభరంబు జన్నులున్
గుండలముల్ గురుల్కదల గోమయపిండము లింటిముంగిటన్"50

గోవింద మంచనశర్మ తన స్నేహితునితో ముందుకు సాగిపోవుచుండగా ఒకచోట జూదమాడు సన్నివేశాన్ని చూశాడని వర్ణించబడింది.

"పరివేష్టించి ప్రజాకదంబకము పైపై ప్రాలి వీక్షింపగా
బరహస్తంబున నొత్తుకాండ్రదు నపలాపప్రౌఢి బోధింప బా
మరులై పన్నిదమాడి యోడిమటి దుర్మానంబుతో నాటగా
ల్ప్రరి వేశ్యావలయాభి సంభితముచ్చిత్తూర్పె గోవిందునిన్"51

జూదంలో ఓడిపోయిన వాళ్ల దుస్థితిని వర్ణించిన విధం చూడుడు :

"సంగాసంగ జయాపజయంబు పరిహాస ప్రస్ఫుటాశ్లీల భా
షాంగం బాకలితాంత రావలయ కక్ష్యాభాగముద్రాల స
ద్భంగీ నిక్షిత శంకుకము పాపద్యూతమ పన్నిం
బంగీకారము సేయువారి మొలలుం బ్రాపించుగోపీనముల్"52

మరియు

"నీకునౌ నీకునౌ నంచు నెమకి నెమకి
ముగుదలగు వారి భ్రమియించి మోసపుచ్చు
బకవృత్తి హరుడత్యంత పాపబుద్ధి
పట్టణములో దగుల్పరి పందెగాడు"53

50. క్రీడాభిరామం : 82 వ పద్యం - కాకతి పబ్లికేషన్స్ - 1977
51. క్రీడాభిరామం : 97 వ పద్యం - కాకతి పబ్లికేషన్స్ - 1977
52. క్రీడాభిరామం : 98 వ పద్యం - కాకతి పబ్లికేషన్స్ - 1977
53. క్రీడాభిరామం : 99 వ పద్యం - కాకతి పబ్లికేషన్స్ - 1977

బ్రతుకుదెరువునకై పాములవాడు 'పాములాట'ను స్వీకరించినా చూచే వాళ్ళకు వేడుకగా ఉంటుంది. పాములాటను ఆడిస్తున్న వానిని గోవిందమంచన శర్మ చూశాడని వర్ణించబడింది :

"నాగస్వర సుషిర సర
న్నాగవరాళ్యాది వివిధ నానారాగ
ప్రాగల్భ్య ప్రకటఫణా
భోగములై యాడజొచ్చె భోగీంద్రంబుల్"[54]

'క్రీడాభిరామం'లో మేషయుద్ధాన్ని చక్కగా వర్ణించాడు. మేషయుద్ధం సజీవ ద్యూతానికి సంబంధించింది.

"రెండు మేషకంఠీరవంబులు నీరాటరేవున నీరనుమంచి సస్యంబు సేయుచు పెంచుటంజేసి ధేనువుల ననుధావనంబు సేయు వత్సంబులుం బోలె వాత్సల్యంబునం దనయేలికల వెంట గంఠగ్రైవేయ ఘంటికాటంకారంబులు విషమ విషాణ కోటి ఘటిత కపాలాయ సాశ్వత్థపల్లవ గుచ్ఛరింఛోళికాఘణ ఘణాత్కారంబులు చెలంగ యుద్ధక్రీడా సన్నద్ధంబులై వచ్చుచున్నయవి" (227) అంటూ యుద్ధానికి సిద్ధమవుతున్న మేషాల్ని వర్ణించాడు.

రభసంతో ఒకదానితో నొకటి ఢీకొన్నుచున్నవని గోవిందమంచన శర్మ టిట్టిభునితో అన్న విధం :

"నిటలమ్ము లవిసి నెత్తురు
సొటసొట వడియంగ సమరశూరోత్తములై
కటుకునను యెందుతగరులు
చటులాటోపమున రెండు సరిబడబోరెన్"[55]

భీకరంగా ఒకదానితో మరొకటి గుండుమీద గుండు కూలినట్లుగ పోరాడుచున్నవని క్రింది పద్యం వర్ణిస్తుంది.

"వెట్టివెదురు మోపువైచిన చందాన
గుండు గుండు మీద గూలినట్లు

54. క్రీడాభిరామం : 220 వ పద్యం - కాకతి పబ్లికేషన్స్ - 1977
55. క్రీడాభిరామం : 229 వ పద్యం - కాకతి పబ్లికేషన్స్ - 1977

కడిది మోత మేష కంఠీరవంబులు
తాకి తాకి తస్సి తట్టువాటె"[56]

మేషయుద్ధాన్ని చూచి గోవిందశర్మ ముందుకుపోగా సజీవద్యూతమైన 'కోళ్లపోరితా'న్ని చూశాడట :

"అటచని ముందట గక్షవిలంబిత తామ్రచూడులగు కోడి పందెకాండ్రు గనుగొని యిదియును నొక్క సజీవద్యూతంబ యీ దురోదర క్రీడావిహారంబు నావరింపవలయు"[57]

పోరితమునకు సిద్ధంగా ఉన్న కోడి వర్ణనం చూడండి :

"పారిజాతపు బూవునాబరగు జూడు
తామ్రచూడంబు చూడాపథంబు జొత్తు
దర్పభరమున బ్రహ్మరంధ్రంబు నడుము
జించి వెడలిన క్రోధాగ్ని శిఖయుబోలె"[58]

కోళ్లు రెండూ పోరాడుచున్న విషయాన్ని గోవింద మంచనశర్మ టిట్టిభునకిట్లు వివరించాడు :

"టిట్టిభ ! యవలోకింపు నారికేళ ఒక జాతీయంబులై యీ జగజెట్టి గోడిపుంజులు మెడలు నిక్కించు ఱెక్కలల్లార్చుచు "గొక్కొక్కొ" యని కాల్దువ్వి క్రొవ్వుమిగిలి తరళతార కోదన్యత్త రక్తాంతలోచన మండలంబులై యొండొంటిం గదిసి చుఱచుఱ జూచి యేచిన కోపాటోపంబున గప్పించి యుప్పరం బెగసి చరణాంగుళీ కుటి నఖశిఖా కోటికుట్టలంబులం జిరు దొగడుతెగయున్ వక్షస్థలంబులు వ్రచ్చి వందఱలాడియుం ద్రోసియు లాసియు నాసాపుటంబులం బుటబుటన నడునెత్తిం జొత్తిలునెత్తురు పిట్టగా గఱచియు గొఱకొఱం గొఱుకు ముఖంబున గురుకుగురుకు మనుచు సవ్యాపసవ్యంబుల నోహరిం బక్షవిక్షేపంబులం బడిలు వడనడిచియు నొడిచియు నడికినడికి దప్పించుకొని సడిచప్పుడుగాక యుండం గాళ్లక్రిందికి దూరియు జేరియు మాటిమాటికి "ఘాట ఘాట ఘాట"

56. క్రీడాభిరామం : 280 వ పద్యం - కాకతి పబ్లికేషన్స్ 1977
57. క్రీడాభిరామం : 283 వచనం - కాకతి పబ్లికేషన్స్ 1977
58. క్రీడాభిరామం : 289 వ పద్యం - కాకతి పబ్లికేషన్ 1977

యని కృతాటంబుక్కు దండసంబులువో ముక్కులం జెక్కుల జక్కగా నొక్కి యిట్టటనక బిట్టూనిబట్టి గాలంపు గొంకులభంగి వంకలగు కొంకికత్తులం గడుపు లొడిచికొనిచించ చెండాడి కొండుసేపు వాలిసుగ్రీవుల విధంబున, మిందాను విందుల చందంబున, మురారి చాణూరుల ప్రకారంబున, నేకాంగ యుద్ధంబుచేసి చారణ గంధర్వగరుడ విద్యాధర శ్లాఘనీయంబుగా నమోఘ పరాక్రమంబు సలిపి వీరవ్రతం బేపార వాహ్యాళీ మండపంబుకం దమకుదార పాయగిలంబడి పోటుగండ్ల రొప్పు రుధిరంబుల దొప్పదోగి మూర్ఛాంధకారంబున మునుంగు చున్నయవి."[59]

సురపొన్న చెట్టునీడల్లో కన్నెపిల్లలందరూ చేరి బంతులాటలాడుచున్నా రని వర్ణించబడింది :

"ఇదే యాటది యొకసురపొన్న క్రీనీడ క్రీడాభరంబున గన్నియలం గూడి కందుక్రీడ యొనర్చుచున్నయది" (257 వ వచనం)

మరియు వాళ్లాడుచున్న బంతులాట వర్ణం ఈ విధంగా ఉంది :

"పంచారించిన లేతచన్నుల పయిం బ్రాలంబముల్ గ్రాలగా
గాంచీ నూపుర కంకణ క్వణనముల్ గర్జింప బాలాజనుల్
కించిన్న్యంచ దంచిత క్షమము గా గ్రీడించెదర్చూడుమా
చంచత్కాంచన కందుక త్రయములన్ సవ్యాపసవ్యంబులన్"[60]

**కొఱవి గోపరాజు :-** "సింహాసన ద్వాత్రింశిక"లో 27వ బొమ్మ చెప్పిన కథలో జూదాన్ని గూర్చియు, పులిజూదాన్ని గూర్చియు సొగటాలాటను గూర్చియు వర్ణించుట జరిగింది. ఒక జూదరి తనకు జూదంలో గల నైపు ణ్యాన్ని రాజునకిట్లు వివరించాడు.

"చెప్పిన దీనినే సిద్ధియౌనట్లయు
నడిగిన నాకిది యడపనేల

59. క్రీడాభిరామం : 256 వచనం : కాకతి పబ్లికేషన్స్ - 1977
60. క్రీడాభిరామం : 258 వ పద్యం : కాకతి పబ్లికేషన్స్ - 1977

మేటి జూదరియన వాఁడౌ తివుటమై
నాడుచు నుండునే నహర్నిశఁబు
దృష్టియే మఱక నందియు జోగరఁబును
దిగయున గాళనాదేటపడిన
యచ్చులతోనే యచ్చైన గై కొని
మాటలాడిన యట్టి వేటుగలుగ

దలపుగతి వచ్చు గోఁనదాయమనగ
శకుని జూదము పీని యచ్చొకటియనగ
గెలుపు నాదిగ నొడ్డుచు గిలుబనేర్చి
యెల్లపిడిళ్ళు విడిపించి యేనకొందు"61

మరియు తన నేర్పును వివరిస్తూ,

"ధనము గలుగజూచి తమకంబు పుట్టించి
మొదల గెల్వనిచ్చి పిదపగెలిచి
నలువురౌననంగ బలవంతునైన
నిలువనాగికొందు నిమిషమును"62 అని అంటాడు.

తాను చతురంగం ఆటలో నేర్పరినని ఇలా అంటాడు.

"చతురంగఁబుననే నతి
చతురుడ గరితరుగ మంత్రిశకట భటప్ర
స్థితి పరహస్తము సేయుదు
క్షితిమెచ్చగ రాజుబంటుచే గట్టింతున్"63

చదరంగం శ్రీకృష్ణదేవరాయల కాలంలో బాగా ప్రసిద్ధిగా ఉండేదని బొడ్డుచర్ల తిమ్మన రాయలతో చదరంగం ఆడేవాడని లోకంలో ప్రచారంలో ఉంది. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "బొడ్డుచర్ల తిమ్మన అనునతడు రాయల కాలములో నీ యాటయందలి నిపుణుడు, లోకల్ రికార్డులలో నీతనిగూర్చి యిట్లు

61. సింహాసన ద్వాత్రింశిక 10-87 ఆ.ప్ర.సా.అ. 1982
62. సింహాసన ద్వాత్రింశిక 10-88 ఆ.ప్ర.సా అ. 1982
63. సింహాసన ద్వాత్రింశిక 10-89 ఆ.ప్ర.సా.అ. 1982

వ్రాసిరి. ఆతడు కవీశ్వర దిగ్దంతి అనిపించుకొని కృష్ణరాయలవారి యొద్దకు పోయి వారితో చదరంగం ఆడుతూ వుండేవాడున్నూ. ఆట గెలిస్తే వెయ్యేర్లు పందెం వేసి గెలుస్తూ వుండేవాడున్నూ అప్పుడు కృష్ణదేవరాయలు చాలా సంతోషించి కొప్పోలు గ్రామం సర్వాగ్రహారముగా ధారపోసి యిచ్చెను"[64] అని పేర్కొన్నారు.

"ఎక్కడ గోరిన దాయము
లెక్కువతక్కువలు గాక యేతేరంగా
నెక్కటి నెత్తమ్మున గొ
మ్మెక్కటియును నాడనేన యొక్కటిజూమ్మీ"[65]

అని జూదాన్ని గూర్చి ప్రస్తావించాడు జూదంవల్ల కలుగు నష్టాల్ని, జూదంలో పూర్వం నష్టపోయిన వాళ్లను గూర్చి యిలా వివరిస్తాడు :

"ధనము సత్యము శౌచం
బును నాదిగ గోలుపోవు భువి దుర్వ్యసనం
బని యెర్నబడ్డ జూద
మ్మున నీ గ్రుబగుడు వంగుదొట టొందిది యగునే"[66]

"జూదమున నలుడు చెడియెను
జూదంబున నట్టి ధర్మజుండును జెడియన్
జూదమున ధాతువాదము
వాదంబున దొదరి జేటవశ్యము గలుగున్"[67]

అంటూ జూదంలో నష్టపోయినవాళ్ళ గూర్చి ప్రస్తావించాడు

జూదంవల్ల కలిగే లాభాల్ని గూర్చి చెప్పుచూ జూదానికి లోకంలో ఏవియు పనికి రావని అంటాడు.

---

64. ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట 292
65. సింహాసన ద్వాత్రింశిక - 10-90
66. సింహాసన ద్వాత్రింశిక - 10-94
67. సింహాసన ద్వాత్రింశిక - 10-95

"ధనలాభంబు బురాణము
వినికియు వాద్యంబు యోగ విద్యయు శాస్త్రం
బును సంగీతము గావ్యం
బును నాటకములును జూదమునకెన యగునే"[68]

"గెలుపు తమకమున జిత్తం
బలరంగా గవట జూదమాడక యెవ్వం
డలసు డయి చనియె భువిని
వ్ఫలజన్ముడు వాడెకాడె పసరము శంగిన్"[69] అని అంటాడు.

జూదంలో అన్నృతము లేదని వివరిస్తాడు :

"ఒకరూకవట్టి పదివే
లకు నొడ్డుచు నాడినట్టి లాభము గరద
వ్ఫకయిత్తురు గొంద్రనువరు
అకటా జూదంబులోన నన్నృతము గలదే"[70]

జూదరి తాను 'పులిజూదంలోనూ', 'సొగటాలాట'లోను అతి ప్రౌఢుడనని అంటాడు.

"తగులు విరియైనగడుమె
చ్చగ నాడుదు బులులమూట జూదంబులలో
మిగులగ నేర్పరి బాగిడి
తిగుటన్ సొగటాలనే నీతిప్రౌఢుండన్"[71]

'పులిజూదం' అనే ఆటను గ్రామాల్లో కొన్నిచోట్ల 'పులిగీతం' అని అంటారు కూడా. పులి-మేక ఆట అని కూడా అంటారు. "గుంటూరు జిల్లాలో దీని 'పులిబోను' అనీ, అనంతపురం జిల్లాలో 'పులికట్టు' అని వ్యవహరిస్తా

68. సింహాసన ద్వాత్రింశిక - 10-98 ఆ ప్ర సా అ. 1982
69. సింహాసన ద్వాత్రింశిక - 10-99 ఆ.ప్ర సా.అ. 1982
70. సింహాసన ద్వాత్రింశిక - 10-100 ఆ ప్ర సా.అ. 1982
71. సింహాసన ద్వాత్రింశిక - 10-91 ఆ.ప్ర.సా.అ. 1982

రనీ"[72] శ్రీ వడ్లా సుబ్రమణ్యంగారు పేర్కొనిరి.

పల్లె ప్రాంతాల్లో పొలం పనులు లేని సమయాల్లో అరుగుల కట్టమీద కూర్చొని ఆడుకోవడం ఈనాటికి మనం చూడవచ్చు. "పులులు మూడు జూదం బులతో" అని కొలవి గోపరాజుగారు అనడంతో పులిజూదం మూడు విధాలని తెలుస్తుంది

సొగటాలాట, నెత్తం, జూదం ఇవన్నీ ఒకటేనని పూర్వమే వివరించబడ్డాయి.

**బమ్మెర పోతన:** 'ఆంధ్ర మహాభాగవతం'లో కందుకక్రీడ బొమ్మరిండ్లు, బొంగరాలాట, ఊయలాటను గూర్చి ప్రస్తావించాడు.

"ఒకనాటి రాత్రియందుకు రాజచంద్రికా
ధవళిత నిజసౌధ తలమునందు
మహితరణన్మణి మంజీరశోభిత
చరణయై నిజసఖీ సహితయగుచు
గందుకక్రీడ జరియింప గగనమందు"[73] అనే పద్యంలో వెన్నెలలో 'కందుకక్రీడ'ను ఆడినట్టు పోతన వర్ణించాడు.

బలభద్రుడు ప్రలంబాసురుని వధించు ఘట్టంలో శ్రీకృష్ణుడు గోపాలకులతో ప్రొద్దుపోవుటకై 'కందుకము' ఆటను ఆడుదమని పలుకును.

"మనకు బ్రొద్దువోదు మనమిందఱము రెండు
గముల వారమగుచు గందుకపు ల
శిలలు గుఱులుచేసి చేరి క్రీడింతము
రండవలయు జయపరాజయములు"[74]

---

72. తెలుగు సాహిత్యంలో క్రీడా వినోదాలు పుట. 457
73. ఆంధ్ర మహాభాగవతము : 8-779
74. ఆంధ్ర మహాభాగవతము : 10-727 ఆ.ప్ర.సా.అ. 1988

అట్లు రెండు వర్గాలుగా విడిపోయి బలరామకృష్ణులు గోపాలురతో 'కందుక క్రీడ'ను ఆడిన విధానాన్ని పోతన ఇలా వర్ణించాడు.

"తానును బలభద్రుండును బెన్నద్దులై, యితర వల్లవులెల్ల నుద్దించుకొని చిట్టుద్దులై వచ్చిన సమయంబున విభజించుకొని, రెండుగములవారై, మార్గంబులందు దృణ దారుశిలా కల్పితంబగు గుఱులొడ్డి కందుక శిలాది ప్రేక్షణంబుల, లక్ష్యంబులు దాకవైచి, జయపరాజయ నిర్ణయంబులు గైకొని, వాహ్యావాహక లక్షణంబుల జేతలను నిర్జితులు చేతుబు వహించి క్రీడించుచు"[75]

రుక్మిణీ కల్యాణ కథాఘట్టంలో దినదిన ప్రవర్ధమాన యగుచున్న రుక్మిణి తోటి బాలికలతో కలిసి 'బొమ్మల' పెండ్లి చేయుట, గజ్జెనగూళ్లాట, బంతులాటను ఆడినట్లు పోతన వర్ణించాడు.

"వేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నబలలతోడ వియ్యంబులందు
గుజ్జనగూళ్ళను గొమరొప్ప వండించి
చెలులకు బెట్టించు చెలువు మెఱయ
రమణీయ మందిరారామ దేశంబుల
బువ్వుఁదీగెలకును బ్రోదిసేయు
సదమల మణిమయ సౌధభాగంబుల
లీలతో భర్మడోలికల నూగు

బాలికలతోడ జెలరేగి బంతులాడు
శారికాకీర పంక్తికి జదువుచెప్పు
బర్హిసంఘములకు మురిపములు గఱపు
మదమరాళంబులకు జూపుమందగతులు"[76]

సత్యభామ నరకాసురునిపైకి యుద్ధానికి వెళ్లి నరకునితో యుద్ధం చేయుచుండగా సత్యభామను వర్ణిస్తూ 'బొమ్మలపెండ్లి'ని, 'ఊయలాట'ను పోతన ప్రస్తావించాడు.

---

75. ఆంధ్ర మహాభాగవతము 10-727 ఆ.ప్ర సా.అ. 1988
76. ఆంధ్ర మహాభాగవతము-10-1687 (పూర్వ)

"బొమ్మల పెండ్లిండ్లకు బోనొల్లనను బాల
రణరంగమున కెట్లు రాదలంచె"

"బసిడియుయ్యాల లెక్క భయమందు భీరువు
ఖగపతిస్కంధమే కడిదినెక్కె" (10-180 ఉత్తర)

శ్రీకృష్ణ బలరాముల బాలక్రీడల్ని వర్ణించు సందర్భంలో కృష్ణుడు గోప కుమారులతో కలిసి ఆడుకొన్న ఆటల్లో రాజు-బంటు; దొంగదొర, దాగుడు మూతలు, బంతులాటలు ప్రస్తావించడమేగాక పశువుల కాపరి- పశువుల ఆట ఆడినట్లు వర్ణించాడు :

"గోవల్లభుడ నేను గోవులు మీరని
వరిఱంకె వైచుచు వంగియాడు
రాజునే భటులు మీరలు రండురండని
ప్రాభవంబున బెక్కు పనులు పనుచు
నేదస్కరుండ మీరింటివారని నిద్ర
పుచ్చి సొమ్ములు గొనిపోయి దాగు
నే సూత్రధారి మీరందఱు బహురూపు
లని చెలంగుచు నాటలాడబెట్టు

మూలబంతుకు దాగిలిమూతలాడు
నుయ్యేలలనూగు జెబంతు లొనవైచు
జార చోరుల జాడల జాలనిగుడు
శౌరి బాలురతో నాడు సమయమందు" 77

కృష్ణ సహితులై గోపాలురు అడవికి వెళ్లి పసుల మేపుకొనుచు 'నిలా యనక్రీడ'ను ఆడుకొనిరని వర్ణించెను.

"కొందఱు గొఱియల మనుచును
గొందఱు పాలకులమంచు గుటిలత్వమునన్

77. ఆంధ్రమహాభాగవతము 10-304 (పూర్వం) ఆ.ప్ర సా. అ-1988

గొందఱు దొంగలమనుచును
తెంది కుమారకులు క్రీడ చేసిరి తమలోన్"[78]

పై పద్యాన్నిబట్టి నీలాయన క్రీడను ఇలా చెప్పుకోవచ్చును. బాలురందరూ ఒక చోట చేరి కొందరు గొల్లలుగా, మరికొందరు గొల్లల కాపరులుగా, ఇంకొందరు దొంగలుగా భావించుకొని ఆడుకొను ఆట. నేడు ఆడుకొనే పులి-మేక, గొల్ల-తోడేలు ఆటలాంటివయి ఉండవచ్చు.

**వెన్నెలకంటి సూరన :** 'విష్ణుపురాణం'లో బలరామకృష్ణులు బాల్యంలో గోపాలురతో కలిసి ఆడుకొన్న ఆటల్ని వర్ణించబడిన పద్యం ఇది :

"కోలక్రోతులు బిల్లగోళ్ల దూరనగోల
లందలంబులు మఱికుందికాళ్ల
పుట్టచెండ్లుప్పన బట్టె బాలదకులు
డుగుంబాలు గుంటచాళ్లు
చీకటి మొటికిళ్ళు చిమ్మబిల్లలు నెట్లు
బొట్టనగులబు బొమ్మరాలు
కుప్పిగంతులు పిడిగ్రుద్దులు
పిల్లదీవులు గొబ్బిళ్లు గూనవాలు
గ్రుడ్డు దాగిలిమ్రుచ్చులు గోడిపట్టె
లేలపాటలు సరిబేసు లీలకూడ
లాడిగా శైశవక్రీడ .... .... ...."[79]

**ధూర్జటి :** 'కాళహస్తి మాహాత్మ్యము'లో తిన్నడు బాల్యంలో ఆడిన ఆటల్ని వర్ణించిన విధం చూడండి :

"చిట్లపొట్లకాయ సిరిసింగణావతి
గుడుగుడు గుంచాలు కుందెనగుడి
దాగిలి మ్రుచ్చులాటలు గచ్చకాయలు
వెన్నెలకుప్పలు తన్నుబిల్ల

78. ఆంధ్రమహాభాగవతము 10-1180 (పూ. భా.) ఆ.ప్ర.సా. 6-1983
79. విష్ణుపురాణము - 7-20 వావిళ్ళ ప్రతి - 1955

వేడుక తోడబుచ్చుకొని వ్రేళ్ళను నిట్టునటున్ బొరల్చి వి
బ్రాడ కలంక కంకణ విరావము మీఱ గదల్చివైచుచున్"[83]

"ప్రభావతీ ప్రద్యుమ్నం"లో ప్రద్యుమ్నుడు నగర బాహ్యప్రదేశంలో గుఱ్ఱంపై నుండి బంతి ఆట ఆడినట్లు వర్ణించాడు :

"తన హృదయింబు వెంబడిన తప్పక ఘోటక మంతనంతనే
పనుపడ నిల్చి ముందఱకు బాఱికెలంకులం దొలంగిదా
వెనుకకు నేగుదెంచి కడువేడ్క యొనర్పగ బంతియాడనె
మ్మని గనకంపుగోల నడిమింటనె త్రిమ్మర దాఁకొట్టుచున్"[84]

మరియు

"ఎగురవైచి కొట్టుటది యెంత భరంబని బంతియగ్ర గా
మిగవడి బాఱవైచి పుడమిం బడనీకయె దానిమీఁది చి
త్ర గతి హయంబు దోలుచును గ్రమ్మఱమీఁదికి గొట్టియాడెవిం
తగదనచేతి రత్నమయ దండము కాంతులుగాడిపాఱగన్"[85]

**రామరాజ భూషణుడు :** "వసుచరిత్ర"లో "బొమ్మరిల్లు"ను పేర్కొన్నాడు. గిరికన్యక తనతోడి స్నేహితురాండ్రతో బొమ్మరిల్లు నిల్పి ఆడుకొన్నదని వర్ణించబడింది :

"గురుసవిధ ప్రదేశమున గోమలకల్పిక పుష్పధూళిచే
ధరసుత బొమ్మరిల్పులిపి తన్మృదుపల్లవ పాత్రపంక్తి గే
సరములు ఖాద్యముల్మ ధురసంబు ఘృతంబు ప్రసూనపుంజమో
గిరమని పెట్టనన్నియు సఖీతతి కిట్టివ యొాద్రియంబునన్"[86]

బొమ్మరిల్లు చేయు ఆటను చక్కగా పై పద్యంలో వర్ణించుట జరిగింది.

83. కళాపూర్ణోదయము - 6-119 : ఆ.ప్ర.సా.అ - 1980
84. ప్రభావతీ ప్రద్యుమ్నం - 2-29 - వావిళ్ళప్రతి 1968
85. ప్రభావతీ ప్రద్యుమ్నం - 2-31 - వావిళ్ళప్రతి 1968
86. వసుచరిత్ర-3-30-ఎమెస్కోవారి ప్రతి : 1970

'గీరన గింజలాట'ను చింతపిచ్చలాట అని కూడా అంటారు. ఆడపిల్లలు చింతపిచ్చలతో ఆడుకునే ఆట కాబోలు ఇది.

బిల్లగోడు అచ్చమైన దేశీయ ఆట ఇది. బిళ్ళను కర్రతో కొట్టి కంచా దగ్గరనుండి దూరంగా వున్న బిళ్ళవరకు కొట్టిన కర్రతో కొలుస్తారు బిల్లగోడునే తెలంగాణాలో 'గిల్లిదండ' అని అంటారు. 'చిడుగుగువ్వలపోటి' చెడుగు ఆట. కబాడ్డి అనే నేటి వ్యవహారంలో ప్రసిద్ధి. పల్లీయుల ప్రియమైన ఆట చెడుగుడు.

వేశ్యకన్యలు శివుని సేవించే సందర్భంలో బొమ్మరిల్లు, గుజ్జెనగూడు ఆటల్ని ధూర్జటి పేర్కొన్నాడు.

> "కనక శలాకలం దెగడు కన్యలుగట్టిన బొమ్మరిల్లు శం
> భునిగుడి. బొమ్మశంకరుడు భోనము గుజ్జెన గూడువేడ్క
> సిన పనులన్నియున్ శివుని సేవయొనర్పగ" (4-21)

**పింగళి సూరన:** "కళాపూర్ణోదయం"లో మధురలాలస తోటి బాలికలతో కలిసి ఆడిన ఆటల్లో బొమ్మలపెండ్లి, గుజ్జెనగూళ్లు, అచ్చనగండ్లు, దాగుడు మూతలు, కంబాలాట మొదలైన ఆటల్ని పేర్కొన్నాడు:

> "దినముల్ కొన్ని చనంగ నంతకడునర్థిన్ బొమ్మల పెండ్లిండ్లు గు
> జ్జనగూళ్ళచ్చనగండ్లు పింపిళులు కుచ్చెళ్ గీరనగింజలో
> మనగుంటల్ కనుమూసి గంత నలగంబాలాటలోనైన ఖే
> లనముల్ పాఱుగ బోంట్లతోనలరె బాలారత్న మెల్లప్పుడున్"[82]

పస్పర సరస వాక్యాల్ని పలుకుతూ భార్యాభర్తలు 'పాచికలాట' ఆడినట్లు వర్ణించాడు.

> "అడితె! నీదుపందెమని హస్తనఖ ప్రసరచ్ఛవిచ్ఛటా
> మ్రేడిత పాండురద్యుతి సమృద్ధి గరంబమరంగ బాచికల్

---

82. కళాపూర్ణోదయము - 6-202 ఆ.ప్ర.పా.అ 1980

వేడుక తోడబుచ్చుకొని వ్రేళ్ళను నిట్టునటున్ బొరల్చి వి
భ్రాద కలంక కంకణ విరావము మీఱ గదల్చి వైచుచున్"[83]

"ప్రభావతీ ప్రద్యుమ్నం"లో ప్రద్యుమ్నుడు నగర బాహ్యప్రదేశంలో గుఱ్ఱంపై నుండి బంతి ఆట ఆడినట్లు వర్ణించాడు :

"తన హృదయింబు వెంబడిన తప్పక ఘోటక మంతనంతనే
పనుపడ నిల్చి ముందఱకు బాఱికెలంకులం దొలంగిదా
వెనుకకు నేగుదెంచి కడువేడ్క యొనర్పగ బంతియాడనె
మ్మిని గనకంపుగోల నడిమింటనె త్రిమ్మర దాఁకొట్టుచున్"[84]

మరియు

"ఎగురవైచి కొట్టుబడి యెంత భరంబని బంతియగ్రగా
మిగవడి బాఱవైచి పుడమిం బడనీకయె దానిమీఱి చి
త్ర గతి హయంబు దోలుచను గ్రమ్మఱమీదికి గొట్టియాడెవిం
తగదనచేతి రత్నమయ దండము కాంతులుగాడిపాఱగన్"[85]

**రామరాజ భూషణుడు :** "వసుచరిత్ర"లో "బొమ్మరిల్లు"ను పేర్కొన్నాడు. గిరికన్యక తనతోడి స్నేహితురాండ్రతో బొమ్మరిల్లు నిల్పి ఆడుకొన్నదని వర్ణించబడింది :

"గురుసవిధ ప్రదేశమున గోమలకల్పక పుష్పధూళిచే
ధరసుత బొమ్మరిల్పిలిపి తన్మృదుపల్లవ పాత్రపంక్తి గే
సరములు ఖాద్యముల్మ ధురసంబు ఘృతంబు ప్రసూనపుంజమో
గిరమని పెట్టనన్నియు సఖీతతి కట్టిన యొ్రిడియంబునన్"[86]

బొమ్మరిల్లు చేయు ఆటను చక్కగా పై పద్యంలో వర్ణించుట జరిగింది.

---

83. కళాపూర్ణోదయము - 6-119 : ఆ.ప్ర.సా.అ - 1980
84. ప్రభావతీ ప్రద్యుమ్నం - 2-29 - వావిళ్ళప్రతి 1968
85. ప్రభావతీ ప్రద్యుమ్నం - 2-31 - వావిళ్ళప్రతి 1968
86. వసుచరిత్ర-3-80-ఎమెస్కోవారి ప్రతి : 1970

**నంది తిమ్మన :** 'పారిజాతాపహరణం'లో 'వెన్నెల కుప్పల' ఆటను ప్రస్తావించాడు :

ఎల్లెకల మిన్నేటి యిసుమున నచ్చర
కోమలులీడ్డ వెన్నెల కుప్పలనగ"87

**తెనాలి రామలింగడు :** 'పాండురంగ మాహాత్మ్యం'లో శ్రీకృష్ణ బల రాములు ఇతర గోపకుమారులతో కలిసి బృందావనంలో కందుకక్రీడ, దాగుడు మూతలు, కంబాలాట, తన్నుబిల్లాట, రాజసేవకుల ఆట లాడినట్లు వర్ణించాడు :

"కనగట్టి గాంగేయ గర్భుడాగురుమూత
లాడించె వత్సాపహరణవేళ
నాలమందల ద్రోవశైల మెత్తెడిపూన్కి
గేలిమై కందుకక్రీడ సలిపె
బాటించె గంబాలయాట రాసక్రీడ
నాభీరు భీరుమధ్యాంకపాళి
వెలయించె యక్షాక్ష విహరణం బలకాధి
రాజకింకర శిరోరత్నరాజి
దన్నుబిల్లాడె నంగుష్ఠ దళితసర్ప
తను సుదర్శననామ విద్యాధరేంద్ర
కఠిన జఠరచ్ఛలమున నగ్రజుడుదాను
నందసూనుడు బృందావనంబునందు"88

**కందుకూరి రుద్రకవి :** 'నిరంకుశోపాఖ్యానం'లో తృతీయా ఆశ్వా సంలో 8 నుండి 20 వరకు గల పద్యాల్లో నిరంకుశుని అక్షవిద్యా కౌశలాన్ని, అక్షక్రీడా విధానాన్ని వర్ణిస్తూ 'సొగటాలాట, నెత్తము'ను ప్రస్తావించాడు :

"పట్టి మాటలుగా నెంతవారినైన
గెలుచు నర్తకి నాపాలగలదటంచు

---

87. పారిజాతాపహరణం - 2-87
88. పాండురంగ మాహాత్మ్యం 3-178

అవనిసుర తనూభవుడు చేలాంచలమున
ముడిగట్టిన సొగటాలు పిడిచి"[89] అని అంటాడు.

అక్షపారీణతను వర్ణించిన పద్యం :

నీ యెత్తులకేనె యాడెద
నీ యెడలన్ బొంకులేక నీ విద్యకు బ్రా
లేయాద్రి సుతాజీవిత
నాయిక నెత్తంబు కారణంబెరుగుదువా ?[90]

**కుమార ధూర్జటి :** 'ఇందుమతీ పరిణయం'లో జనవరసుతుడు తోటి బాలరతోకూడి శైశవ క్రీడయందు ఆడిన ఆటల్ని ఇలా వర్ణించాడు :

"బిరిగాయల్ కందుకంబుల్ పెనకువ వితముల్ బిల్లంగోల్లైం గెపాకల్
సరిబేసుల్ తూర్ణతుంకాల్ తగరుల పిడుపుల్ జాళువాబొంగరంబుల్
సిరిసింగనాల పత్తుల్ చిడుగుడు పరువుల్ చిందరాటల్ మొదల్గా"[91]

అంటూ సజీవ, నిర్జీవ ద్యూతాల్ని పేర్కొన్నాడు.

ఇందుమతి శైశవాన్ని వర్ణించే ఘట్టంలో బంతి ఆటను, దాగిలిమూతలు, వెన్నెలకుప్పలు, వామనగుంటలు, దోయములు, సరిబేసులు, నాల్గు కంబాలాట, అచ్చనగండ్లు మొదలైన ఆటల్ని ప్రస్తావించాడు :

"ఒకవేళ రత్నాల చెకచెకల్ వెదజల్లు
బంగారు తక్కుమేల్ బంతిగొట్టు
నొకసారి మిక్కిలి యొయ్యారి పగమీటి
ముదమొప్ప దాగిలిమూతలాడు
నొకపరి యానందమొప్పంగ జెలరేగి
యొప్పుచు వెన్నెలకుప్పలాడు

---

89. నిరంకుశోపాఖ్యానం 3-11 నాగార్జున ప్రెస్ నిడుబ్రోలు 1951
90. నిరంకుశోపాఖ్యానం 3-18 నాగార్జున ప్రెస్ నిడుబ్రోలు 1951
91. ఇందుమతీ పరిణయం 2-18 - వావిళ్ళ ప్రతి 1914

నొకపరి గేల్పెందు నురులిం దనరుచు
గోమలతో వామనగుంటలాడు

దోయముల్ సరిబేసులు దొరయు నల్లు
గంటములయాట లచ్చనగండ్లు మొదలు
గాగలశైశవగరిమ శృంగారమలర
బాలికలతోడ నాడు భూపాలపుత్రి"[92]

'వెన్నెల కుప్పలాట'ను గూర్చి డా॥ యం. కె. దేవకిగారు ఇట్లు వ్రాసిరి, "వెన్నెల రాత్రుల్లో చాల మంది ఆడపిల్లలు చేరి ఆడే ఆట ఇది. ఆడ పిల్లలంతా ఉద్దీలు వేసుకొని రెండు జట్లుగా విడిపోయి ఒకరి జట్టుకు ఇంకొకరి జట్టు కనిపించనంత దూరం చెరోవైపుకు వెళ్లిపోతారు. చెట్ల నీడల్లోనో, ఇండ్ల గోడల ప్రక్కనో, అరుగుల క్రిందనో తొందరగా కన్పించని స్థలాల్లో మట్టితో గాని, ఇసుకతోగాని కుప్పలు పెడతారు. వెన్నెలకుప్పలు వందకుపైగా పెట్టిన తరువాత ఇక చాలనుకున్న జట్టు 'ఎన్నిలో-సన్నాభీ' అని కూతలు పెడుతూ ఎదుటి జట్టువైపు పరుగెత్తి వస్తారు. వారి అరుపులు విన్న వెంటనే ఇటువైపువారు కూడా కుప్పలు పెట్టడం ఆపేసి అటువైపు పరుగెడతారు. వెదకి వెదకి ఎదుటి జట్టువారు పెట్టిన కుప్పల్ని చెరిపేస్తారు. మళ్లీ ఏదో ఒక జట్టువారు చెరపడానికి వెన్నెలకుప్పలు కన్పించనపుడు 'ఎన్నిలో-సన్నాభీ' అని అరుస్తూ ఎదుటి జట్టు వైపు పరుగెడతారు. చివర రెండు జట్లూ కలసి పరస్పరం చెరపగా మిగిలి పోయిన వెన్నెలకుప్పల్ని లెక్క పెడతారు. ఏ జట్టువారివి ఎక్కువ వుంటే వారిది గెలుపు."[93] 'వామనగుంటల' ఆటను ఆడే విధానాన్ని డా॥ ఆర్వీయస్. సుందరంగారు ఇలా వివరించారు. "వామనగుంటలు కొయ్యతో చేసి ఇంట్లో పెట్టుకుంటారు. చేప ఆకారంలో రెండు వరుసల్లో ఏడేడు గుంటలుంటాయి. ఒక్కొక్క గుంటలో అయిదేసి చింతగింజలు వేయాలి. ఏదో ఒక గుంటలోని గింజలు తీసుకొని పక్క గుంటనుంచి ఒక్కొక్క దానిలో ఒక్కొక్క గింజ చొప్పున వేసుకుంటూ పోవాలి. అరవ గుంటలోని కాయలెత్తుకొని మళ్ళీ అట్లే వేసుకుంటూ పోవాలి. ఇలా చేస్తూ ఉంటే మధ్యలో గుంట ఖాళీ వస్తే, దాన్ని

92. ఇందుమతీ పరిణయం : 2-148 - వావిళ్ళ ప్రతి : 1914
93. తెలుగు బాలగేయ సాహిత్యం : పుట - 245 : 1988

చేత్తో తట్టి తరువాతి గుంటలో కాయలు తీసుకోవాలి. దీన్ని లబ్బి అంటారు. అంటే ఐశ్వర్యం అన్నమాట. ఒకవేళ ఆ రెండు గుంటలు ఖాళీ వస్తే ఆటను రెండవవారు ఆడాలి."[94]

**గణపవరపు వేంకటకవి :** "ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసంలోని నాగదత్తోపాఖ్యానంలో నాగదత్తుడు ఆడిన ఆటల్ని వర్ణించిన పద్యం ఇది :

గుడిగుడి గుంజాలు చిడిగుడి చింకణా
బిల్లగద్దెన బొడ్డి చిల్లగోటి
చిరిసింగణావత్తి బంతి తరుముడుజెండును
వెన్నెలకుప్పలు కన్నుకట్టు
చీకటి మొటికాయ చింతాకు చుణుదులు
పులియాటలును జిట్లపొట్లకాయ
దూరనదుంకముల్ దోపిడియాటలు
బంతియాలంకి దీపమ్మనములు

పొట్టగిరనగింజలు బొంగరములు
గచ్చకాయలు దాగిలిమ్రుచ్చులాట
బంతిమొకమాట జిందరపురవులాట
ననెడి శైశవ దుర్వృత్తి నధిగమించి"[95]

మరియు నాగదత్తుడు చదరంగం, సొగటాలు, కొబ్బరిపందేలు, సరిబేసులు, చెరుకుపందేలు ఆడి గెలిచేవాడని వర్ణించాడు :

"నిరతము జదరంగంబున
గిరిజల సొగటాల నారికేళ ఫలములన్
సరిబేసి యొద్దువిటపులు
చెరుకు పందెమిడి గెలుపు........"[96]

---

94. ఆంధ్రుల జానపద విజ్ఞానం-పుటలు : 359, 60 : ఆ.ప్ర.సా.అ 1983
95. ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాసము 613 ఆ ప్ర సా. 1977
96. ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాసము 615 ఆ.ప్ర.సా. 1977

**పొన్నగంటి తెలగనార్యుడు :** 'యయాతి చరిత్ర'లో విద్యాభ్యాసాన్ని ముగించుకొని ఇంటికి వెళ్తున్న సమయంలో కచుని ప్రేమించిన దేవయాని ఆట లాడుట మాని విచారంలో ఉన్నదని వర్ణిస్తూ వివిధములైన ఆటల్ని ప్రస్తావిం చాడు :

"ముదురు వెన్నెలగాయు ముత్యాలతిన్నెపై
పైడియప్పనగండ్లు పాఱవైచి
మఱియాడియాడి తామరకెంపు టీటపై
నోమనగుంటల నుజ్జగించి
పాపమే వదివచ్చు పన్నారు లోవుల
గులుకుగుజ్జెన గూళ్లుకడుచు టుడిగి
తనయీడు వారైన తలిరాకు బోండ్లతో
సిరిబొమ్మపెండ్లిండ్లు సేయుకడలి"97

**చేమకూర వేంకటకవి :** "విజయ విలాసం" లోని పురవర్ణనలో వెన్నెల రాత్రుల్లో బాలికలు తమ బంగారు మేడలపై ఆడుకొనేవారని వర్ణిస్తూ 'గుజ్జెనగూడు' ఆటను పేర్కొన్నాడు :

"రేలామృతాంశులో శశము రెమ్మదమంచు దలంచి బాలవా
మేలి పసిండి సోయగపు మేడలగుజ్జెనగూళ్ళ సందడిన్"98

**అయ్యలరాజు నారాయణకవి :** "హంస వింశతి"లో పేర్కొన్న ఆటల్ని మరే ఇతర కవి పేర్కొన్నలేదన్న సత్యదూరం కాదు. సుమారుగా నూటముప్పై ఆటల్ని ఒక పెద్ద సీసమాలికలో పేర్కొన్నాడు. దీనినిబట్టి నారా యణ కవికి గల లోకజ్ఞత వెల్లడవుతుంది. కావున శతావధాని సి. వి. సుబ్బన్న గారు "గ్రంథములను జదివి నేర్చుకొన్న విషయ పరిజ్ఞానం వేరు. లోకమును జొదివి నేర్చుకూర్చుకొన్న విషయ పరిజ్ఞానం వేరు. మొదటిది చాల మందికి సుగతము కావచ్చు. రెండవది దుర్లభము. ఈ కవిలోకజ్ఞతా విశేషమునకు ఈ ప్రబంధము పంటపొలమని అన్నారు."100

---

97. యయాతి చరిత్ర - 3-151 ఆ.ప్ర.సా. అ 1961
98. విజయ విలాసం - 1-6 వావిళ్ళ ప్రతి - 1965
100. హంసవింశతి - పీఠిక - పుట 41 ఆ.ప్ర.సా.అ. 1977

ధూర్త విద్యార్థి చేష్టల్ని వర్ణించే సందర్భంలో బాలక్రీడల్ని ఇలా వర్ణించాడు :

"దూఁడియు జాబిల్లి బూచికన్నుల కచ్చి
గుడిగుడి గుంజాలు కుందెనగిరి
చీఁకటి మొటికాయ చింతాకు చుణుచులు
పులియాటలను జిట్లపొట్లకాయ
తూరన డుక్కాలు తూనిగ తానిగ
చిడుగుడు మొకమాట చిల్లకట్టె
దాగిలిమూఁతలు తనుబిల్ల యాలాకి
గుప్పిటి గురిగింజ కొండకోతి
చిక్కణబిల్లయు జెల్లెము గౌడుగును
బిల్లబిద్యయు లక్కిబిక్కి దండ
గడ్డెనటోడి యొక్కసికొక్కు బరిగాయ
పోటు గిరనగింజ బొంగరములు
పెంచులబేరి దోపిల్లు గాలిపటంబు
సరిబేసి పుటచెండ్లు చాకిమూట
గోట గొర్లుడుకాయ గొబ్బిళ్ల మోపిళ్ల
సీగ పొగిస బంతిదూగిలాట
వెన్నెలకుప్పలు వ్రేలు బొట్టగసిరి
సింగన్న వత్తియు జిందుపరువు
గచ్చకాయలు కిఱ్ఱుగానుగ త్రిప్పళ్ల
గుఱ్ఱపెక్కుడు మంటిగూళ్లసూళ్ల
కాలి కంచంబును గట్టె గుఱ్ఱము వినా
యకు తిరితూనె కోట్లాట చెమట
కాయత్తు గౌడుగు బొంగరము రామన్నాట
పొడుగుళ్ల నుయ్యాల బోర్లపక్క
బండ్లికలును జొప్పబెండ్లు మంచంబులు
గంగెద్దులాటలు గనికె కుండ

లీనెగాజులు పోతుటీనె గుజ్జంబులు
నాల్గుకంబాలాట సట్టకోతి
దంటుకిన్నెర మంటిగంటి పోట్లాటలు
సింగన్నదాటులు జిరుకురాతి
దాడాటలును మంచి తాటాకు చక్ర చ
క్రాల త్రిప్పుడు తోచిగాయ పదుపు
పొడు పాతరమాళ్లు పాతరల్ బంతులు
చిమ్మనగ్రోవులు ఓజ్జబుజ్జు
లాకుపికెలు జంద్రలాటలు చుంద్రాళ్ల
గిలకలు చిటికెలు కీచుబుఱలు
కోలాటములు పిల్లగ్రోవులు గుమ్మడి
క్రోవి కూతలు నూదుక్రోవులొడ్డు
విడుపు నెట్టుడు గాయ వింద్లమ్ము లాటలు
పులిజూదములు కట్టెపుట్ట చెండ్లు
దాయాలు, సొగటాలు దాటాయి చదరంగ
మును టోటురాళ్లను మూతపొడుపు
వామనగుంటలు వడిగుప్పి గంతులు
చెఱుకుపందెముల్ ఓమ్ముజాయి
తుమ్మెద రేపుళ్ల కుమ్మరసారెలు
బందారు బసవన్న పత్తికాయ
తిరుగుడు బిల్లల త్రిప్పుళ్లు జరుగుళ్ల
చిటితాళమీళలు నెటికెతట్లు
తాటియాకుల చిలుకలు తాళ్లపాము
లకట! యగదాట్లు ప్రాతనై యాడుకొనుచు"[101]

16వ రాత్రి కథలో రెడ్డిసాని ఇంటిని వర్ణిస్తూ—

"ముంగిట బులిజూదములు గీయించియుండిన
రచ్చబండలు గొప్ప ప్రహరిగోడ" (4-124) అంటూ పులిజూదాన్ని మరలా ప్రస్తావించాడు.

101. హంసవింశతి : 8-147 ఆ.ప్ర.సా.అ. 1977

మరోచోట వారవనిత విరహాగ్ని బారిపడి తత్పూర్వం ఆడిన ఆటల్ని ఆడుటకు ఇష్టపడలేదని వర్ణించుచు మరికొన్ని ఆటల్ని ప్రస్తావించాడు :

బొమ్మల పెండ్లిండ్లు బువ్వపు బంతులు
పుణికిళ్లు నిట్టుక్కి బొమ్మరిండ్లు
గుజగుజరేకులు గొబ్బిళ్ల సీగలు
బుడిగించు జాబిల్లి పుక్కటిల్లు
గుజ్జెనగూడులు కోటకోలన్నలు
గిరనగింజలు పొరుపట్లు
పిప్పిళ్ల త్రొక్కిళ్ల బేసిసెలిరుగుళ్ల
నచ్చనగండ్లు దాయాలు పొళ్ల

లదరువామన గుంటలాడైన దట్టి
యాటపాటల ప్రొద్దువో నను గుజెంల
బాయక చరించు బాలకి ప్రాయమేల
వచ్చె విరహాగ్ని యిటులేల హెచ్చెననుచు[102]

పూర్వకవులు వాడిన ఆటల్ని తన కావ్యంలో పేర్కొనడమే కాక తన కాలంలో ప్రచారంలో ఉన్న అనేక ఆటల్ని ప్రస్తావించాడు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో కూడా ఆటల ప్రస్తావన చేసిన కవులు కొందరు కలరు. మచ్చునకొకటి రెండు పరిశీలింతం

ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు 'ఆంధ్రావళి' యందు 'ప్రబోధము' అనే ఖండికలో తెలుగు వారి ఆటల్ని పేర్కొన్నారు

బువ్వమ్మ బంతులన్ కవ్వించి పయసుకా
వరముబ్బ పడతులు పాడలేరు
గబ్బితస్తైను వేళ గూడ ప్రాయపు కన్నె
లరమర లేకాడ మరచినారు

102. హంసవింశతి - 5-155 ఆ ప్ర.సా.అ. 1977

తద్దేపండుగ సైతముయాలలూగుట
మోటుగా ముగ్గులు మూసినారు
రుక్మిణి మొదలుగా రుచిగొన్న బొమ్మల
పెండ్లిండ్లు బాలలు విడిచినారు" 103

విశ్వనాథ సత్యనారాయణగారు 'ఆంధ్రప్రశస్తి'లోని 'వేగీక్షేత్రం'లో వేగీ క్షేత్ర పురావైభవాన్ని వర్ణించే సందర్భంలో తెలుగు తల్లులు ఉగ్గుపాలతోనే శౌర్యరసమును రంగరించి బొడ్డు కోయని కూనలకే పోసేవారట అందుకే తెలుగు బాలులు బాల్యంలోనే ఆటలాడుకొనే సమయంలో అనేక విషయాల్ని నేర్చుకున్నారని రమణీయంగా వర్ణించారు.

"వేగిరాజ్యపు పల్లెవీధుల జెడుగుళ్ళ
రిపుల గవ్వించు నేరుపులు తెలిసి
ఎగురు గోడిబిళ్ళ సొగసులో రిపు శిర
స్సుల బంతులాడు శిక్షలకు దాసి
చెణ్ణాడి యుప్పు తెచ్చిన నాడె క్షాత్రవ
వ్యూహముల్ పగిలించు నేరపుగఱచి
కోతికొమ్మచ్చిలో గోటగోడల కెగ
బ్రాక లంఘించు చంద్రకళ మెఱిగి" 104 అంటూ ఆటల్లోని అంతర తత్త్వాన్ని చక్కగా వ్యక్తం చేశారు.

తెలుగు శిష్టసాహిత్యంలోని జానపదుల ఆటల్ని సాధ్యమైనంత వరకు పరిశీలించుటకై ప్రయత్నం జరిగింది.



103. ఆంధ్రావళి : లలితా కుటీరము - 1953
104. ఆంధ్రప్రశస్తి - 6 వ ముద్రణం - 1978

# జానపదుల సాంఘిక ఆచారాలు

ఆచారాలు ప్రతి సమాజంలోనూ ఉంటాయి. అయితే ఒక్కొక్క సంఘానికి ఒక్కొక్క రకమైన ఆచారాలుంటాయి. ఆచారాలనేవి ఒక తరం నుండి మరో తరానికి సంక్రమిస్తుంటాయి. తాతతండ్రులు ఆచరించిన పద్ధతుల్ని ఆ తర్వాతి వాళ్లు వాటిని తమ ఆచారంగా భావించి అనుసరిస్తుంటారు. కాలగమనంలో పాత ఆచారాలు పోయి కొత్త కొత్త ఆచారాలు ప్రజలచే ఆచరించబడవచ్చు. సమాజానికి మేలు కలిగించే ఆచారాల్ని పాటించాలి. కీడు కలిగించే ఆచారమైతే దాన్ని వదలివేయాలి. లేదా సమాజానికి అనుగుణంగా మార్చుకోవాలి. ఆచారాలు అనేవి సమాజాన్ని కట్టుదిట్టంచేసి సక్రమమార్గంలో నడిపించడానికి ఉపయోగపడతాయి. సదాచారాలు సమాజానికెంత మేలు కలిగిస్తాయో దురాచారాలు అంత కీడును కలిగిస్తాయి.

"ఆచారముల వలన దీర్ఘాయువు, పుత్రపౌత్రాదులు ధనము ప్రాప్తించుటయేగాక అవలక్షణములన్నియు నశించిపోవును".[1]

"అనంతర కాలమందలి పూజలు, వ్రతాలు, నోములు కూడా వీని నాశించియే ఆచరించుట జరుగుచున్నది. కనుక ఆచారము లావశ్యకములైనట్టివని ఋజువగుచున్నది."[2]

ఆచారాల్లో వ్రతాలు, నోములు, పెండ్లి, గర్భధారణ, ప్రసవం, పిల్లలకు చేసే సంస్కారాలు మొదలైనవి పేర్కొనవచ్చు.

**వ్రతాలు - నోములు :** 'వ్రతం' అన్నా, 'నోము' అన్నా ఒకటేనని వివిధ నిఘంటువుల్లోని అర్థాలు సూచిస్తాయి. శబ్దరత్నాకర నిఘంటుకారుడు 'వ్రతం' అనగా ఉపవాసాది పుణ్యకర్మం అనీ, నోము అనీ రెండర్థాల్ని సూచిం

---

1. "పల్లె పదాలలో ప్రజాజీవనం" పుట. 262లో ఉదాహృతం.
2. "పల్లె పదాలలో ప్రజాజీవనం" పుట 262లో ఉదాహృతం.

చాడు. 'నోము' అనే పదానికి 'వ్రతం' అని సూచించడాన్నిబట్టి చూడగా వ్రతమన్నా, నోము అన్నా ఒకటే అని భావం. కాని వ్యవహారంలో కొన్నింటికి చివర వ్రతం అనీ, ఉదా : చాంద్రాయణ వ్రతం, చాతుర్మాస్య వ్రతం, తులసీ వ్రతం, సత్యనారాయణ వ్రతం; కొన్నింటికి చివర నోము అనీ ఉదా : శ్రావణ మంగళవారము నోము, లక్షవత్తుల నోము, కార్తీక సోమవారము నోము అని కలదు. అయినా రెండూ ఒకటేనని ఆచరించేవాళ్ల అభిప్రాయం కూడా. "హిందువుల పండుగలు" అనే గ్రంథంలో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రతమనగానేమో విపులంగా చర్చించారు.

"వ్రజఘజస్యతః, భక్షణభేదే ఉణాది పుణ్యసాధనే ఉపవాసాది నియమభేదేచ, (ఆంధవాచస్పత్యము) అనగా పుణ్యసాధనమునకై యుపవాసాది నియమములచే జేయు కార్యమనకు వ్రతమని పేరు."[3]

"వ్రతమన సంకల్ప పూర్వకముగా సమ్యగనుష్ఠానము చేయుట. ఈ వ్రతము ప్రవృత్తి నివృత్తి రూపములని రెండు విధములు. భోజన పూజాదికములతో గూడినది ప్రవృత్తి రూపము. ఉపవాసాదికమైనది నివృత్తి రూపము."[4]

అనుసరించు కాలమునుబట్టి "వ్రతములు మూడు విధములు 1. నిత్య వ్రతములు - ఎల్లకాలమున జేయదగినవని భావం; 2. నైమిత్తికాలు - నిమిత్తమునుబట్టి చేయునవి; 3. కామ్యములు - ఆయా తిథులందుపవాసముండి చేయునవి."[5]

మానసిక వ్రతాల్నిగూర్చి వరాహపురాణంలో చెప్పబడినవి. "వ్రతములు మానసికములు, కాయికములని రెండు విధములు. అందు అహింస, సత్యము, దొంగతనము చేయకుండుట, బ్రహ్మచర్యము, అకల్మషత్వము ఈ గుణములు కలిగియుండుట మానసిక వ్రతములనబడును. ఇక ఒక్కప్రొద్దు రాత్రికాలమందు పవాసముండుట మున్నగునవి కాయిక వ్రతము లనబడును"[6]

---

3. హిందువుల పండుగలు - పుట. 1 ఉదాహృతం.
4. హిందువుల పండుగలు - పుట. 1 ఉదాహృతం.
5. హిందువుల పండుగలు - పుట. 1, 2 ఉదాహృతం.
6. హిందువుల పండుగలు - పుట 2 ఆ. సా. పరిషత్తు 1987

వ్రతముయొక్క ఫలితాన్ని చర్చిస్తూ శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "సాధారణముగా నన్ని వ్రతముల ఫలములు దీర్ఘాయువు, ధనధాన్య సమృద్ధి, సుఖ సంపద, సర్వపాపవిముక్తి కలుగునని వ్రాయబడినది. మఱికొన్ని వ్రతములకు స్వర్గప్రాప్తియై యున్నది. కొన్ని వ్రతముల ఫలము అనంతమని వర్ణింపబడి నదని పేర్కొన్నారు."[7]

వ్రతాలు కానీ, నోములు కానీ కేవలం స్త్రీలకు మాత్రమే సంబంధించినవి. కాబట్టి ఆచార్య బి. రామరాజుగారు "వ్రతములు, నోములు స్త్రీల ప్రతీకపు సొత్తు"[8] అని అన్నారు.

**నన్నయయుగంలో వ్రతాలు:** వ్రతాలు, నోములు నన్నయనాటికే ఉండేవని భారతంలోని పద్యం వెల్లడిస్తుంది.

"నుదుపులు వేయు నింకేల యిప్పాటి నోములు దొల్లి
కడగి నోచితిని గాకేమి యనుమను గందెడెందమున"[9]

దుష్యంతుడు తిరస్కరించినపుడు శకుంతల అన్న మాటలివి. ఫలానా నోము అని చెప్పకపోయినా, నోముల్ని ప్రస్తావించింది కాబట్టి అనాటికే ప్రజల్లో 'నోము' పాటించే ఆచారం ఉండేదని భావింపవచ్చు.

**పాల్కురికి సోమన:** 'బసవపురాణం'లో నందికేశ్వరుని మాదిరాజు, మాదాంబలు సంతానప్రాప్తికై నందికేశ్వరుని నోము నోచారట. సంతానం కోసమై భార్యాభర్తలు కలిసి నోములు నోమడం, పుణ్యక్షేత్రాల్ని దర్శించడం, పుణ్యతీర్థాల్లో స్నానం చేయడం, వివిధ దేవతా పూజల్ని జరిపించడం కలదు. నందికేశ్వర నోమునుబట్టి ప్రజలు సంతానం కోసమై నోములు, వ్రతాలు పాటించడం ఆచారంగా సోమన కాలంనాడు ఉండేదని తెలుస్తుంది. సోమన వర్ణించిన నందికేశ్వర నోము ఇది :

7. హిందువుల పండుగలు : పుట. 8 ఆ.సా. పరిషత్తు 1987
8. తెలుగు జానపద గేయ సాహిత్యం. పుట. 444
9. ఆంధ్ర మహాభారతము : ఆది. 4-102

"కొడుకులు లేమికి గడు దుఃఖియగుచు
పెద్దనోములన్నియు వేసరనోమి
యాద్యంతు లాత్రంబులందెల్ల వెదకి
హృద్యంబుగా నందికేశ్వరునోము
కామ్యార్థసిద్ధికి గారణంబనుచు
సమ్యగ్వ్రతస్థితి సతికి జెప్పుటయు
సమ్మహాత్ములు సెప్పినట్లుగా గుడికి
నిమ్ములజని నందికేశ్వరు జూచి
సర్వాంగము ధరసంధిల్ల మ్రొక్కి-
సర్వజ్ఞ నందికేశ్వర! దయాంభోధి!
యంచు బ్రస్తుతిచేసి యతిభక్తి మ్రొక్కి-
యంచిత వ్రతచర్య లాచరింపుమను
నిమ్మల సోమవారమ్మాదిగాగ
దొమ్మిది దినములుత్సుక వృత్తినోచి
తుఖునాడు నందిని మజ్జనంబార్చి
సురుచిరైన చందన కుసుమంబులిచ్చి
పొత్తని వస్త్రముల్ మెయినిండగప్పి
యుత్తమాభరణంబులు రుగ్మియలును
సందెలు గంటలు సలవడగూర్చి
పొందుగా బసిడికొమ్ములు గొరిజయలు
వెట్టి, పాలంబున బట్టంబువెలయ
గట్టి, నందికి నలంకారంబుసేసి,
యక్ష ధూపదీపాదులొనర్చి,
యాక్షణంబున బంచభక్ష్యముల్ కుడిపి,
పులగంబు ముందట బ్రోవుగా బోసి,
పులకందమును నెయ్యి గలిపి యర్పించి
పరమ మాహేశ్వర వ్రతతికి నెల్ల
బరిణామ మంద సపర్యలుసేసి
నందీశ! నందీశ! నవనందినాథ!

జందు కళాధరునెక్కుడు గుజ్జు !
నాయన్న! నా తండ్రీ! నాయాలతోడ!
నీయట్టి సద్భక్తు నీయట్టి పుత్త్రి
ఖ్యాతిగా నొక్కని కరుణించితేని
ప్రతియొలర్ప నీ పేరిడుదాన !" (పుటలు 22, 23)

**శ్రీనాథుడు :** 'శివరాత్రి మాహాత్మ్యం'లో సంతానార్థమై సుశీల వ్రతం చేసిందని చెప్పబడింది. యజ్ఞదత్తుని భార్య సుశీల సంతానం లేక ఏడ్చుచుండగా భర్త ఏడ్చుట ఎందులకు? అభీష్ట శుభాభివృద్ధికై శంకరుని పూజించమని అంటాడు :

"ఊరక కుందనేమిటికి నోంకృతినాథుడు నర్మదానదీ
తీరనివాసి భక్తజన దివ్యమహీరుహ మున్నవాడు న
రేరుహ నేత్ర తత్పదపరిష్టి యభీష్ట శుభాభివృద్ధికిం
గారణమౌ దెఱుంగవె వికారమదక్కు భజింపు శంకరున్" (2-32)

అభిమతార్థసిద్ధికై గురుజనులను కూడా సేవింపుమని హితాన్ని చెబుతాడు.

"గురుజనంబుల సేవింపు కువలయాక్షి
కమలలోచన ముక్కంటి కరుణజేసి
మున్ను గురునుపదేశంబు మొనయగాంచి
రభిమతార్థంబులందతే నను దినంబు" (2-34)

గురువుల్ని పూజించి కుమారుల్ని పొందినవాళ్ళు కలరని యితిహాసాన్ని గుర్తు చేస్తాడు. "తొల్లి చండకౌశికు వరప్రసాదంబున మగధాధిపతియగు బృహద్రథుండు, జనార్దను గెలువం దగినట్టి శౌర్యనిధి జరాసంధుంగాంచె; దశరథుడు విభాండక తనయుండగు ఋశ్యశృంగు నారాధించి దిగ్గజంబులం బోలిన కుమారుల నలుగురం బడసె" (2-35) ఇంకా "దేవిశోకంబు విడువుము ధైర్యంబవలంబింపుము, ధర్మంబు నడుపుము దానంబు సేయుము, వ్రతంబులు సలుపుము" (2-37) అని అంటాడు.

సంతానార్థమైన సుశీల ఆచరించిన పుణ్యకార్యాల్ని వ్రతాల్ని శ్రీనాథుడు ఇలా వర్ణించాడు :

భక్తితో మాతృకా భవనంబులకునేగు
గావించు నతి దిశాదేవతలకు
వాయసంబులకు నిర్వర్తించు దధిబలి
గొలుచు జ్యేష్ఠాదేవి నలఘు మహిమ
ఆదివించుకొను బుణ్యసంహితా వ్రాతంబు
మూలికా మాణిక్యములు ధరించు
తాంబూల గంధాక్షతలు చిరంటులకిడు
విప్రపశ్నికలగా రవించు దఱచు

గుమ్మరావంబు కడవలు కొల్లవిడుచు
బాలురకు దియ్యపండులు పంచియిచ్చు
జెలులు దానును రేలు పోడిన్నునోపు
దామరస నేత్ర పుత్రసంతానకాంక్ష" (2-40)

"ఇవ్విధంబున బుణ్యోపవాస వ్రత దాన ధర్మ దేవతారాధనంబుల" (2-41)
అంటూ ఉపవాస వ్రతాన్ని పేర్కొన్నాడు.

శ్రీనాథుడు 'పల్నాటి వీరచరిత్ర'లో సంతానార్థమై ఐతాంబ చేసిన నోముల్ని, వ్రతాల్ని గూర్చి విపులంగా వర్ణించాడు. సంతానం కొరకై పడ్డ కష్టాల్ని నోచిన వ్రతాల్ని ఐతాంబ బాలచంద్రుడికి వివరించింది :

"సంతానమే లేక చాల కష్టించి
అవనిలో గల నోములన్నియు నోచి
తరచుగా జేసితి దాన ధర్మములు
తాంబూలములను సద్భక్తి దక్షిణలు
కూర్చి చూరవిడిచి కుమ్మరామములు
ఆడెకు గానుగలవి కొల్లపెట్టి
పెండ్లిండ్లు చేసితి పేదవిప్రులకు
పాడైన దైవత భవనంబులందు

పూజాధికంబుల పొందించి భక్తి
అమడామడ మీద అన్నసత్రముల
వెలయంగ జేసితి విస్తారమైన
వనములోపల చలిపందిళ్ళు నుంచి
శ్రీగిరికేగెడు శివభక్తి తతికి
చెలగ ఇచ్చితి రాగిదే నిర్మితముల
ఘన కమండలువులు కప్పెరచయము
శ్రీ భ్రమరాంబకు శ్రీశైలపతికి
రజత కాంచనముల రంజిల్లునట్టి
కూష్మాండ ఫలముల గూర్చి దక్షిణలు
కానుకలిచ్చితి కడు భక్తితోడ
గౌరీ మహేశ్వర ఘననామ శిఖరి
ఎక్కియు నోమితి నేలేశ్వరంబు
దిగి వచ్చి నోచితి తిలపర్వతమున
మొగివిష్ణు కాంత నోమును సలపితిని
తగ నొనర్చితిని సంధ్యావర్తి నోము
అలయక నోమితి ఆ జగజ్జ్యోతి
ఏడుగురు వనితల నింపుగగూర్చి
యేక బాణము నోము నెంచినోచితిని
పదుగురు వనితల బాగుగ గూర్చి
పచ్చపిల్లుల నోముపట్టి నోమితిని
నందికి పులగంబు నయతనిచ్చితిని
శ్రీశైల పజ్జల అభివృద్ధిజేసి
రజత కాంచనమయ రమ్యతంతువుల
అశ్వత్థ తరువుల కలరజుట్టించి
పెంటి పోతులకును పెండ్లిండ్లు చేసితిని
చీకటింటినోము చేసితి భక్తి
నియతి కేదారేశు నిల్పనోమితిని
గొనకొని కనుగొన్న గుంటికినెల్ల

చేయెత్తి మ్రొక్కితి చెప్పనే సిగ్గు
కరమెత్తి మ్రొక్కితి శ్రాద్ధేనికేను
పలు నోములీ రీతి భక్తితో జేయు"

(2వ భాగం. 44, 45 పుటలు)

ఇంకా తాను నోమిన నోముల్ని వ్రతాల్ని గూర్చి వివరించింది :

"వింటిని వచనంబు వినువీధియందు
గజనిమ్మ నోమిన గలుగుసంతాన
మనువాక్యమున కప్పు డానందమొంది
పెద్దతా విప్రుల పిల్వగబంపి
ముకుళిత హస్తనై మ్రొక్కి ఆ మీద
వారితో జెప్పితి వాక్యలక్షణము
విని వారు సంతోష విశ్రాంతమతిని
వ్రతకల్పములనెల్ల వడి విచారించి
శోధించి చెప్పిరి శుభముహూర్తమున
శాస్త్రమందున్నది చాన యీ వ్రతము
సంవత్సరము నిండ సల్పగావలయు
ఇది విష్ణుదేవున కింపైన వ్రతము
శాస్త్రోక్త దినమున స్నాన కృత్యమును
వ్రాకుచ్చుచున్నది వ్రతవిధానమ్ము
చంద్రభాగానది సదృశ శైవలిని
కలుగదు పలునాటి గడ్డయందెల్ల
కృష్ణకు సమమిది కీర్తనీయంబు
ఎడమ భాగమ్మున నెనయు చెన్నునికి
దాపుగబారు నుత్తర ముఖంబుగను
స్నానమానదిజేసి సరిగంచుపట్టు
కోకలు ధరియించి కుంకుమపసుపు
బొల్చి గంధమును తనువునబూని
సంతోషమున బోయిస్వామియైనట్టి
చెన్నకేశవునకు జోహారు

దీపనైవేద్యముల్ తీరుగానిచ్చి
వైకుంఠ శృంగార వనములోపలను
చెన్నారు ఆ నిమ్మచెట్టునకేగి
చుట్టులెస్సగ జేసి శుద్ధిచేయించి
అలికించి ముగ్గులు అచట బెట్టించి
వనదేవతను భక్తివర్ణనచేసి
నయముగ ఆవాహనంబు గావించి
పలకల బావిలోపల నీరుముంచి
పాదులోపల గడు భక్తితోబోసి
సకల ప్రకారోపచారముల్ చేసి
భూసురులందరు భుజియించు కొరకు
తగిన వస్తువులిచ్చి తప్పకయుండ
ఫలముల ఫలహారపటిమ తగ్గించి
పరమేశు చెన్నుని భావించుకొనుచు
ఎడపక దినముల నీలాగు జరుప
కొన్నాళ్ళకానిమ్మ కొమ్మలిగిర్చి
ఫలకతుల్గన్పించి పరిపక్వమౌను
వర్షాంతమందనివార్యభావపు భక్తి
చెట్టుఫలంబుల చెన్నునకిమ్ము
సంతానమబ్బును సంశయపడకు" (పుట. 44, 2వ భాగం)

అంటూ బ్రాహ్మణులు 'గజనిమ్మ వ్రతాన్ని' చేసే విధానాన్ని బతాంబకు తెలియజెప్పారట.

**పోతన:** భాగవతంలో రుక్మిణీదేవి ఆచరించిన గౌరీవ్రతాన్ని ప్రస్తావించాడు. తల్లులు బాంధవసతులు వెంటరాగా, రుక్మిణి నగజాతకు మ్రొక్కుటకై బయలుదేరి పార్వతి మందిరానికి పోయి రుక్మిణి గౌరీని పూజించింది :

"ఇందుధర సుందరీమందిరంబు చేరి, సలిలధారా ధౌతచరణ కరారవిందయై, వార్చి, శుచియై గౌరీ సమీపంబునకుం జనియె. అంత ముత్తైదువులగు భూసురోత్తముల భార్యలు భవసహితయైన భవానికి మజ్జనంబు గావించి గంధా

క్షతంబులిడి, వస్త్రమాల్యాది భూషణంబుల నలంకరించి, ధూపదీపంబు లొసంగి, నానా విధోపహారంబులు సమర్పించి, కానుకలిచ్చి, దీపమాలికల నివాళించి రుక్మిణీదేవిని మ్రొక్కించిరి" (పూర్వ 10-1740)

గౌరీదేవిని పూజించిన పిదప రుక్మిణీదేవి బ్రాహ్మణ భార్యలకు వాయన మిచ్చిందట. మంగళగౌరి వ్రతాలు చేస్తే వాయనము లిచ్చు పద్ధతి కలదు అట్లే రుక్మిణి "పతుల తోడం గూడిన బ్రాహ్మణ భార్యలకు లవణా పూపంబులును, దాంబూల కంఠసూత్రంబులును, ఫలంబులు నిక్షుదండంబులు నిచ్చి రుక్మిణీదేవి వారల బూజించినదట" (పూర్వ. 10-1742)

**నంది తిమ్మన :** "పారిజాతాపహరణం"లో పుణ్యకవ్రతాన్ని విపులంగా వర్ణించాడు. పుణ్యకవ్రతం వల్ల కలుగు లాభాన్ని నారదుడు సత్యభామకు వెల్లడించాడిలా :

ధనకనక వస్తు సంతతియు
దనయు సమృద్ధియును గల్గి తానుం బతియున్
మనమున నలగొలలెఱుగక
యనితర సులభైక సుఖములందుదురసుచున్ (5-62)

ధనకనక వస్తు లభ్యం, పుత్రప్రాప్తి. అంతకంటే భార్య మనస్సుకు వచ్చునట్లు భర్త ప్రవర్తించడం పుణ్యకవ్రత ఫలమట. స్త్రీలు ఏ వ్రతం చేసినా తన భర్త, తన పిల్లలు, తాను క్షేమంగా ఉండాలనీ, ఆర్థిక ఇబ్బందుల్లేకుండా కుటుంబం సాఫీగా జరిగిపోవాలనీ, భార్యాభర్తలు కలిసి అన్యోన్యంగా ఉండాలనీ భావించి చేస్తారు. ఇట్టి ఫలితానిచ్చే పుణ్యకవ్రతాన్ని గౌరీదేవి చేయగా, తాను చూశానని దాన్ని నీవు అచరింపుమని సత్యభామతో చెప్పి అ వ్రత విధానాన్ని వివరిస్తాడు.

ఏ వ్రతం చేసినా ముందుగా స్త్రీలు ఉదయాన్నే తలంటు స్నానం చేసి శక్తికొద్దీ మంచి చీరల్ని ధరించి, ఉన్న ఆభరణాల్ని వేసుకొని, చక్కగా అలంకరించుకొని భగవంతుని పట్ల భక్తిశ్రద్ధలు కలిగి, పెద్దలపట్ల వినయ విధేయతల్ని చూపుతూ వ్రతాన్ని ప్రారంభిస్తారు. సత్యభామ కూడ వ్రత ప్రారంభానికి సన్నద్ధం అయిందని క్రింది పద్యం చెబుతుంది :

తెలతెల వాఱమౌనవియతి స్నదికిం జని తీర్థమాడిని
ర్మల వసనంబుగట్టి, నవరత్న విభూషణ ముద్ధరించి మై
గలపమలంది క్రొమ్మడిని గమ్మవిరుల్సవరించి యత్తమా
మలకను నాత్మ భర్తకు నమస్కృతి సేసి తదీయసమ్మతిన్"

(6-66)

సత్యభామ ముందుగా భర్త సమ్మతిని పొంది వ్రతాన్ని ప్రారంభించేదట.

ఏ వ్రతం చేసినా బంధువుల్ని, స్నేహితుల్ని, చుట్టుపక్కల నున్న వాళ్లను వ్రతానికి రావలసిందని పిలవడం సంప్రదాయం. ఇదే విషయాన్ని నారదుడు సత్యభామతో చెబుతాడు :

"కువలయనేత్రి! తొంటి తన కోపము గర్వంబు మత్సరంబు మా
ని వినయముం బ్రమోదమును నిండి తొలంకెడు నెమ్మనంబున
న్నవతుల యింట్లకెల్ల దొలునాడు క్రమంబుననేగి తద్వ్రతో
త్సవమున కామతించి యతిసంభ్రమ లీలల దోడితేవగున్" (6-67)

పేరంటానికి పిలిచిన తర్వాత ఆనాటి వ్రతం అయిన వెంటనే వచ్చిన స్త్రీలను పలుపు కుంకుమలతో పూజించి, శక్తికొలది కానుకలిచ్చి పంపడం ఆచారం. సత్యభామను కూడా అలాగే ఆచరించమంటాడు నారదుడు :

"దినదినమట్లు తత్పరమతిం బదివేవురు పేరంటాండ్రక
ర్చన లొనరించి సారఘనసార సుగంధములు న్విచిత్ర నూ
తన పటరత్న భూషణ వితానము లిచ్చుచు వేడ్క జైత్ర శు
ద్ధనవమి యాదిగా నెల్వ్రతం బొవరించిన యంత మీదటన్"

(6-68)

అట్లు వ్రతాన్ని పూర్తి చేశాక సకల సద్గుణ సంపన్నుడైన బ్రాహ్మణుని ఆచార్యునిగా నియమించి అసంఖ్యాకంగా కానుకలిచ్చి వానితోపాటు ఆత్మేశుడైన భర్తను ధారపోయాలని నారదుడు పుణ్యకవ్రత విధానాన్ని చెప్పాడు.

**అయ్యలరాజు నారాయణకవి :** "హంసవింశతి"లో సంతాన ప్రాప్తికై విజయుడను గొల్లడు సంతాన కాంక్షతో భార్యాసహితుడై కొంగుముడి

వేసుకొని తిరుమల. కంచి పుష్పగిరి మొదలైన పుణ్యక్షేత్రాల్ని, పుణ్యతీర్థాల్ని దర్శించాడట, కానుకల్ని సమర్పించుకున్నాడట :

"తిరుమల కంచి పుష్పగిరి తీర్థములుంజని కొంగుముళ్లతో
వరములు దంపతుల్ పదయవారిగ గాన్కలపైచి యంతటన్
బరికలు దృష్టిదీపములు బన్నిన గద్దెలు పెట్టి యేమిటన్
గరమగు పుత్రవాంఛ కడగానగలేక విచారఖిన్నులై (2-86)

అయినా సంతానం కలుగలేదు. సంతానం లేక విచార హృదయులై ఉన్న గొల్ల దంపతుల ఇంటికి గొల్ల సుద్దులవాళ్ళు వచ్చి

"కులము పెద్దల కతలాము కొనగ జెప్పి
సిపము పుట్టించి పుత్రుల జెందగలరు
వీరులను గొల్వుడని" (2-89) చెప్పారట.

అపుడు ఆ దంపతులు మిక్కిలి భక్తితో కాటమరాజు కథను చెప్పించి, భక్తితో పూజించి గంగదేవతకు వేటను. బోనాల్ని సమర్పిస్తారని క్రింది పద్యం వెల్లడి చేస్తుంది :

"కొలిచెన్ గాటమరాజు సన్నుతులు చేకూర్చెన్ మహావీరకున్
బోలమున్ రాజులనెంతో భక్తిపరతన్ బూజించె వాగంగకున్
వెలయన్ వేటలు బోనమున్ సిడులు గావించెన్ సుతోత్పత్తికై
చెలియాలాగున సల్పదైవకృపన్ సిద్ధించె దద్వాంఛయున్" (2-91)

వీరుల్ని కొలిచారనగా వీరవ్రతాన్ని ఆచరించారని భావింపవచ్చు.

**పెదపాటి ఎఱ్ఱనార్యుడు :** "మల్హణ చరిత్ర" లో యజ్ఞదత్తుడను బ్రాహ్మణుడు భార్యాసమేతుడై సంతానకాంక్షతో ఉపవాసాలు, దానధర్మాలు, వ్రతాలు చేసినట్లు వర్ణించాడు.

"ఉపవాసంబులు సత్య ధర్మమహితోద్యోగాది కృత్యంబులున్
జపముల్ విప్రకుటుంబ భోజనములున్ శాంతుల్ పయస్స్రతముల్
తపముల్ దైవత పూజక్రియలు తీర్థస్నానముల్ దానముల్
విపరీత వ్రత బంధమోక్షణవిధుల్ వేమారు గావించుచున్
(ప్రథమ - పుట. 18)

సంతాన ప్రాప్తికై పడ్డ కష్టాల్ని క్రింది సీసపద్యంలో వర్ణించిన విధం చూడుడు :

"బహువిధ స్తోత్రముల్ పఠియింప బఠియింప
బొలుపరి నోరెల్ల బొరటవోయె
మొగి వేల్పులకు జాగి మ్రొక్కంగ మ్రొక్కంగ
బొప్పక నొసలెల్ల బొగసుగట్టె
ధర ప్రదక్షిణములు దిరుగంగ దిరుగంగ
నెల్ల వెంటలనుగాళ్ళి చవోయె
విధులకై ధనములు వెచ్చింప వెచ్చింప
జెలువేది జేయెల్ల జెరటయయ్యె

బూని యుపవాసములచేత బొగిలిపొగిలి
కోలుకొనలేక యొడలెల్ల గ్రుస్సిడస్సి
చాలునన్నింట డెందము చల్లనయ్యె
నింకమేమిట దోడెస గెట్టుమనుదు" (ప్రథమ - పుట. 18)

మదసేన అను బాలిక వేశ్యల్లో రత్నంలా ప్రకాశిస్తున్నదని చెబుతూ,

"ఆయక్క యెన్నినోములు
పాయక కడునోచి కన్న బాలిక" (ప్రథమ - పుట. 17)

అంటూ నోమును గూర్చి ప్రస్తావించడంవల్ల ఆనాటి జనుల ఆచారాల్లో నోములు, వ్రతాలు కలవని చెప్పవచ్చు.

**నమ్మకాలు :** "కార్యకారణ వివక్ష చేయకుండా ఒక విషయాన్ని విశ్వసిస్తే అది నమ్మకం"[10] అని డా॥ పి. నరసింహారెడ్డిగారి అభిప్రాయం.

నమ్మకాలు మతాన్నిబట్టి, కులాన్నిబట్టి ప్రజల ఆచరణలోకి వస్తాయి. ఇతరులు అనుసరించే విధానాన్నిబట్టి కొన్ని నమ్మకాలు ప్రజల్లో వ్యాపిస్తాయి. ఆచారాల్నిబట్టి కూడ విశ్వాసాలు ఏర్పడుతాయి.

పాలవేకరి కదిరీపతి 'శుకసప్తతి'లో బలియిస్తే ధనపిశాచి ధనాన్ని వదలిపోతుందనే నమ్మకాన్ని ప్రస్తావించాడు :

---

10. తెలుగు సామెతలు - జనజీవనం : పుట. 298.

"ధనము పిశాచులు ఘంటా
ధ్వనితో గాచుకొని యుండు ధనమననినమే
కనుగొంటి మిగద గంటలు
చనునే బలివెట్ట కర్థచయమిలు చేర్పన్" (8-221)

ధనపిశాచిని వదలించుటకై కష్టాన్ని కూడా లెక్కచేయక, కాపు ఇంటికి వెళ్లి కోడిని తెచ్చి బలి పెట్టాడని వర్ణించాడు :

"ఇంకినైనను బలిదెచ్చి యీయకున్న
బొసగదని వల్కి నాతడు కాబోలు ననుచు
గాఢ్టనొప్పియు జూడక కాపుటింటి
గోడి గొనితెచ్చి బలివెట్ట కోర్కెజెంద" (8-222)

పాము కన్పిస్తే శుభమనే నమ్మకాన్ని 'క్రీడాభిరామకర్త' గోవిందమంచన శర్మచేత చెప్పిస్తాడు. పాములాటను చూచిన గోవింద మంచనశర్మ "ఇమ్మహా నాగంబు మనకు కార్యసిద్ధి యొసంగుగాక యని" తన స్నేహితునితో అంటాడు. పాము కనిపిస్తే శుభం కలుగునని జానపదుల్లో నమ్మకం.

దృష్టిదోషం తగులుతుందని చిన్న పిల్లలకు బుగ్గన నల్లచుక్క పెట్టడం, క్రొత్తగా ఇల్లు కట్టేటప్పుడు దిష్టిబొమ్మను పెట్టడం ప్రజల నమ్మకాలకు గుర్తులు. దిష్టిబొమ్మను పెట్టే ఆచారాన్ని ధూర్జటి 'శ్రీకాళహస్తి మాహాత్మ్యం'లో ప్రస్తావించాడు. ఎఱుకలు తమ చేనికి దృష్టిదోషాన్ని నివారించడానికై ఏనుగు తలల బొమ్మల్ని, పశువుల తలల్ని దిష్టిబొమ్మలుగా తయారుచేసి పెట్టేవాళ్లని క్రింది పద్యం చెబుతుంది :

"ఏనుగుల తలలు కొమ్ముల
తో నారబములకు దృష్టిదోషము వాయం
గా నెత్తుదు రెఱుకులు దమ
చేనికి బసరంబు తలలు చెలువంబెసగన్" (3-8)

పుణ్యతీర్థాల్లో స్నానం చేస్తే, పుణ్యక్షేత్రాల్ని దర్శిస్తే, దానధర్మాలు

చేస్తే, గద్దెలు చెప్పించుకొని దాని ప్రకారం నడచుకుంటే సంతానం కలుగుతుం దని ప్రజల నమ్మకం.

ఇలాంటి విశ్వాసాన్ని అయ్యలరాజు నారాయణకవి తన "హంసవింశతి" లో ప్రస్తావించాడు. గొల్ల దంపతులు కొంగు ముడివేసుకొని తిరుమల, కంచి, పుష్పగిరి మొదలైన తీర్థాల్ని సేవించారట :

"తిరుమల కంచి పుష్పగిరి తీర్థములుం జని కొంగుముళ్లతో
వరములు దంపతుల్ వడయవారిగ గాన్కలు పైచి యంతటన్
బరికలు దృష్టిదీపములు బన్నిన గద్దెలు పెట్టి యేమిటన్
గరమగు పుత్రవాంఛ కడగానగలేక విచారఖిన్నులై" (2-85)

**పెండ్లి :** ప్రజల ఆచారాల్లో పెండ్లి ఒకటి. పెండ్లి ఆచారానికి సంబం ధించిన వావివరుసలు, మేనరికం, ముహూర్తం, పెండ్లి ఏర్పాటు, పెండ్లి తంతు, తలంబ్రాలు మొదలైన అంశాలు తెలుగు సాహిత్యంలో సమయానుకూలంగా వర్ణించబడ్డాయి.

పెండ్లిండ్లలో పెండ్లి కూతురు తండ్రి తన కూతుర్ని పెండ్లి కుమారుని చ్చి వివాహం చేయడాన్ని కన్యాదానం అంటారు. కన్యాదానం ఈనాటికీ ప్రజల్లో కనిపిస్తుంది. కన్యాదాన వృత్తాంతాన్ని రామరాజభూషణుడు తన 'వసు చరిత్ర' యందు ప్రస్తావించాడు పర్వతరాజు తన పుత్రికను మునులు తెల్పిన శుభముహూర్తానికి వసురాజునకు ధారవోశాడట :

"సుముహూర్తంబని సన్మను ల్దెలుపనచ్చో దివ్యశైలేంద్రుడా
యమరాధీశు హితక్రియా నిరతు నాయమ్లానమాలాకలా
ప మనోహారి నకుంతి విక్రమునిగా భావించి లక్ష్మీగురు
త్వము దీపింపగ ధారవోసె దనయన్ వర్ధిష్ణు సంపన్నిధిన్ (6-26)

పెండ్లిలో కట్నకానుకలిచ్చే ఆచారం ఉంది కట్నకానుకల ఆచారాన్ని రామరాజభూషణుడు చక్కగా వర్ణించాడు మామగారు అల్లునికిచ్చిన బహుమా నాల్ని వర్ణించిన పద్యాల్ని చూడుడు :

"పీడు చదివించె నయ్యెడ
పీడనివేడుక బలారి విబుధులతోడే

పీడుమణులనగ దగుతన
పీడునగల మానికములు వివిధాంబరముల్ (6-35)

మరియు

గండశైలములకు గరపాదములు వచ్చె
    నోయన మెఱయు నాగాయుతములు
హరిణజాతికి మరున్ని రసనోద్ధతిగల్గె
    నోయనదగు సైంధవోత్కరములు
నంభోదములకు బాయని మించు లొదవె
    నోయన మించు మణిమయస్యందనములు
నవలతావళికి యాన విలాస మెసగె
    నోయన బొల్చు సరసకన్యాయుతంబు
లాత్మ మణిహేమరజతంబు లపుడయుచిత
తనువులు వహించెనో యన దనరు వివిధ
శయన పాత్రాసనములు భూజానికొసగె
హరికృపాలబ్ధ శుభశాలి యచలమౌళి (6-36)

వివిధ సుగంధ ద్రవ్యాల్ని, మణులను, వస్త్రాల్ని ఇచ్చాడట.

కస్తూరి మెకములు కమ్మ జవ్వాదిపి
    ల్లులు సుమ్మివి మదంక విలసితములు
ఘనసార కదళి కల్గంధద్రువులు సుమ్మి
    వి మదీయ జీవన సమధికములు
కిన్నర ద్వంద్వము లీక్కరరాజములు సు
    మ్మివి మదీయ క్రోడవివళితములు
మాణిక్యసారంబు లాణిముత్యములు సు
    మ్మివి మదాకరవంశ హిండితంబు
లవి మృదుల దివ్యవసనంబు లివి యమూల్య
భూషణము లివి యమ్లాన పుష్పములు మ
దగ్రసంతానజములు సుమ్మనుచు దెలిపి
యల్లునికి నిచ్చెవెండియు నాదరమున (6-37)

పెండ్లికి వచ్చినవాళ్లూ కట్నకానుకల్ని వధూవరులకిచ్చే ఆచారం కలదు. వసురాజునకు దేవతలు కానుకలిచ్చారని క్రింది పద్యం చెబుతుంది.

"సురభి సంతాన విస్ఫురణమిచ్చె నగారి
యిష్టార్థ సంసిద్ధి నిడియె వహ్ని
యహత ధర్మగుణంబు లర్పించె సమవర్తి
కామరూపత గూర్చె క్రవ్యభోజి
భువన వశీకారము ఘటించె సలిలేశు
డసమదివ్యామోద మొసగెగాడ్పు
కల్యాణ సామాగ్రి ఘటియించె నిధిరాజు
జితదర్పకత్వంబు చేర్చె శివుడు
ప్రబల దీర్ఘాయురారోగ్య భాగ్యకరము
లగు వరంబులు సమకూర్చి రఖిలమునులు
నూతన వివాహ కౌతుకద్యోతమాన
మానసీయా కృతికి జేది మనుజపతికి" (6-43)

వసురాజుకు పెండ్లి సమయంలో కానుకగా ఇంద్రుడు వేణుయష్టిని ఇచ్చాడట :

"వెండియు నాఖండలుడరి
ఖండన జయసాధన ప్రకాండము సమిదు
ద్దండ మొక దివ్యవైణవ
దండము దయనొసగి........" (6-44)

అత్తవారింటికి పంపుతూ కూతురుకు తల్లిదండ్రులు బుద్ధులు చెప్పడం చూస్తే రామరాజభూషణునికి గల సమకాలీన సామాజిక పరిజ్ఞానం వెల్లడవుతుంది. పర్వతరాజు తన కూతురును దగ్గరగా పిలుచుకొని కౌగిట చేర్చుకొని బుద్ధులు చెప్పిన తీరును పరిశీలించుడు :

నీ తమ్ముల శుభవాసన
నీ తలిదండ్రులగు గభీర నిశ్చలగుణ వి
ఖ్యాతియును దలచి మెలగుము
నా తల్లీ! కులపధూజనము తల్లివవై (6-55)

తల్లిదండ్రులకు పేరు తెచ్చి పెట్టాలంటూ తండ్రి కూతురునకు బుద్ధులు చెప్పడం సహజంగా వుంది :

మాఱు మాటాడదు మఱచియైనను గుటు
హ్యాహారమున కీయహార్యతనయ
యానక్రమగతి బూను మానంపు సవతు తె
ల్లైన నీ దివ్యరత్నాను జాత
జాగయై మేర మీఱ దొకప్పుడును ఘన
శ్రీల బొంగియును నీ సింధుకన్య
యేకాకృతి వహించు నినురాగవృత్తికి
నపరాగ వృత్తికి నబ్జసహజ
యచ్చెరువు వింతయబ్బురం బదిరి యనుచు
విశ్వధాత్రీశ్వరులు మెచ్చ వెలయవమ్మ
యమ్మ ! భవదీయ చిత్రగుణాతిశయము
వలన మాకెల్ల వన్నెరా మెలగవమ్మ ! (6-56)

కూతురు అత్తవారింటికి పోయేటప్పుడు కన్నీరు నింపి ఏడ్వడం సహజం. అపుడు తల్లి కూతురును ఓదార్చుతుంది. అశ్రుధారాపూరితయైన కూతురును జూచి తల్లి ఓదారుస్తూ పలికిన విధం కన్నులకు కట్టినట్లు వర్ణించాడు :

"తమ్ముల బంపుదునమ్మణి శతమ్ముల బంపుదు రాజహంస పో
తమ్ముల బంపుదున్ బరిచితమ్ముల గానన దేవతాలి జా
తమ్ముల బంపుదున్ ద్రుత గతమ్ముల నేనును సారణిప్రపా
తమ్ముల వత్తు విశ్వవిదితా ! ముదితా ! మదితాపమేటికిన్ (6-60)

పెండ్లిండ్లలో 'మేనరికం' ఆచారం వుంది. ఈ ఆచారాన్ని కొందరు పాటిస్తారు. మేనత్త కూతుర్ని, మేనమామ కూతుర్ని వివాహం చేసుకోవడాన్ని మేనరికం అంటారు. మేనరికం ఆచారాన్ని చేమకూర వేంకటకవి 'విజయవిలాసం'లో ప్రస్తావించాడు.

సుభద్ర ఒక తీరుగా ఉండగా తల్లి మేనత్తయైన కుంతీదేవి కోరి పెండ్లి చేసుకున్నదనీ, నీ భర్త లోకోత్తరుడని చెప్పు సందర్భంలో 'మేనరికం' సంప్రదాయాన్ని ప్రస్తావించడం జరిగింది :

"వింతటేయేమి? మేనత్త గొంతిదేవి
కోరి వెండియు బెండ్లాడినారు మీర
లొండొరులు నీ విభుండు లోకోత్తరుండు
దొరకెను, సుభద్ర మంచికాపురము నీకు" (3-136)

తల్లి కూతురును ఓదార్చిన తీరు రమణీయంగా వుంది:

"ఈలోన జూడవచ్చెద
మేలే చింతిల్లె? దనుచు నెంతయు బ్రేమన్
గేలం గ్రొమ్ముడి దువ్వుచు
బాలన్ దీవించి తల్లిపనుపన్ వేడ్కన్" (3-137)

సుభద్రార్జునుల వివాహాన్ని వర్ణించే ఘట్టంలో ముత్తైదువులు ఐరేనికుండలు తెచ్చి పాటలు పాడిరని చెప్పబడింది. 'ఐరేనికుండల' ఆచారం ఈనాటికి మనకు తెలంగాణా ప్రాంతంలో విశేషంగానూ ఇతర ప్రాంతాల్లో అరుదుగానూ కన్పిస్తుంది. ఐరేనికుండల ఆచారాన్ని గూర్చి డాక్టరు నాయని కృష్ణకుమారిగారు "ఐరాళ్లను వివాహమునకు ముందే ముత్తైదువలు మేళతాళములతో పైన నుల్లెడ పట్టుచు కుమ్మరి యింటినుండి కొనివత్తురు. వానిని పూజాగృహమున నుంచి పూజించిన వెనుక వివాహవేదికపై స్థాపించి యఖండమును వెలిగింతుర"ని పేర్కొన్నారు. (జానపద గేయగాథలు - పుట. 317).

"ఐరేని గొనివచ్చిరైదువల్ పాటలు
పాడుచు శుభవేళ వేడుకలర" (2-95)

పెండ్లిలో వధూవరులు 'తలంబ్రాలు' పోసుకొనే ఆచారం చూచేవాళ్లకు ఆనందాన్ని, పోసుకొనేవాళ్లకు ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఈ ఆచారాన్ని శ్రీనాథుడు హరవిలాసంలోనూ, చేమకూర వేంకటకవి విజయ విలాసంలోనూ ప్రస్తావించడం జరిగింది:

శ్రీనాథుడు హరవిలాసంలో పార్వతీ పరమేశ్వరులు తలంబ్రాలు పోసుకునే సన్నివేశాన్ని ఇలా వర్ణించాడు:

"పట్టుతెర చీరచాటున బ్రహ్మమంత్ర
తారపూర్వముగా తలంబ్రాలు హస్త
కమలములు దోయిలించి శ్రీకంధరుండు
గౌరి శిరమున బూన్చెను గౌతుకమున (4-95)

"పార్వతీదేవియు బంధుజనోప దేశంబునం గాలకంధరు శిరంబున ముత్యాల బ్రాలునించె" (4-96)

'విజయవిలాసం'లో సుభద్రార్జునులు ఒకరిపై నొకరు ముత్యాల తలంబ్రాలను పోసుకొన్నారని వర్ణించాడు.

"తమ తమ వారలొండొరుల దండగరంబుల ముత్తియంపు బ
ల్తైములిడి చేయి మీఱగవలెం జామినీకని యెచ్చరింపగా
నమితముగా సుభద్రపయి నర్జును డర్జునుపై సుభద్రయుం
బ్రమి దలబ్రాలు వోసిరెల నవ్వును సిగ్గునులో ద్రొలంకగన్" (3-116)

గర్భవతికి సీమంతపుంసవనములు చేయడం ఒక ఆచారం సీమంత పుంసవన ఆచారాల్ని శ్రీనాథుడు 'శివరాత్రి మాహాత్మ్యం'లో పేర్కొన్నాడు. సుశీలాదేవి గర్భవతి కాగానే సీమంతపుంసవనాలు చేశారట :

"సీమంతోన్నయనంబు బుంసవనముం జేయించె శ్రీయజ్ఞ ద
త్తా మాత్యాగ్రణిచే నృపాలకుడు విద్యాధీశ్వరుండర్థిలి
న్సామంత క్షితిపాల మంత్రుల సమానంబైన ప్రేమంబునన్
భామా హేమతురంగ రత్నములు పైపై బావడల్దేరగన్" (2-52)

సీమంత పుంసవనాలు ముఖ్యంగా స్త్రీలకు సంబంధించిన వేడుకలు. అందుచేత కర్ణాట కమలముఖులు సశీలాదేవి సమంతపుంసవనోత్సవాల్లో పట్టణాన్ని అలంకరించి నృత్యాలుచేసి పాటలు పాడారని శ్రీనాథుడు వర్ణించాడు :

"కమ్మగొజ్జగి నీటగలయంపి చల్లిరి
మేగి మెత్తిరి క్రొత్తమృగమదమున
రంగవల్లులు కప్పురపు ధూళితీర్చిరి
కీలించిరొగి మాల్యతోరణములు

తరుణ రంభాతరు స్తంభంబు లెత్తిరి
కట్టిరెల్లెడబట్టు కలువడములు
కమల చందనమాలికలు వినిర్మించి రు
త్తంభించి రున్నత ధ్వజపతాక
లాలిఖించిరి గేహకుడ్యములయందు
సర్వతో భద్రమకరికా స్వస్తికములు
పరిజనంబులు రాజాజ్ఞ బట్టణమున" (2-58)

మరియు

వేడ్క నృత్యంబులాడిరి వీధులందు
బాడిరెత్తిలిపిక కుహూ పంచమమున
బంజళంబున ధవళ ప్రబంధగీతి
కనుమ యవ్వలి కర్ణాటకమలముఖులు (2-54)

వేదమంత్రాల్ని చదువుచూ బ్రాహ్మణులు హోమాల్ని చేస్తూ సీమంతోత్సవాన్ని జరిపించారని చెప్పబడింది :

"చెలిక త్తెల్ చిటునవ్వు చెక్కులపయిం జెల్వారవీక్షింప నో
జ్ఞులు మంత్రంబులుసెప్ప బ్రెగ్గడళరత్సంపూర్ణ చంద్రాస్యకు
న్వలిచన్నుంగవమీ దముత్పల కముల్వర్ధిల్ల గేల్వంచుచు
న్నలలీ కంటకమెత్తి యొదలపయిన్ సంధించె సీమంతమున్" (2-59)

సీమంతోత్సవంలో కానుకలిచ్చే ఆచారం వుందని క్రింది పద్యం వెల్లడి చేస్తుంది :

"తగవులిచ్చిరి పుట్టింటి తల్లిప్రజలు
వీళ్ళోసంగిరి చుట్టాలు వేనవేలు
కట్ట నిచ్చె నృపాలుండు కన్నుదనియ
బరమహీపాలు రిచ్చిరి పావడములు" (2-62)

ప్రసవానంతరం పురుడు పోవుటకై పుణ్యాహం చేయడం, నామకరణం చేయడం మొదలైన ఆచారాలు శ్రీనాథుని 'శివరాత్రి మాహాత్మ్యం'లో కలవు.

సుశీలకు పుత్రోదయం అయ్యాక పుణ్యాహాన్ని, నామకరణోత్సవాన్ని జరిపారని క్రింది పద్యం చెబుతుంది :

"పురుడు చెల్లంగ బుణ్యాహమును నొనర్చి
నిలయ దైవతముల గొల్చి నిజసుతునకు
మారసన్నిభునకు సుకుమారు డనెడి
పేరువెట్టె ప్రధాన బృందారకుండు" (2-75)

**శకునాలు :** జానపదుల ఆచార వ్యవహారాల్లో శకునాలకు విశిష్టస్థానం ఉంది. ఏ పని చేసినా శకునం చూడందే చేయరు. శుభకార్యాలైతే శకునం కుదిరితేనే చేస్తారు. శకునం సరిగా లేకపోతే ఏ పని ప్రారంభించరు. దుశ్శకునం కనిపిస్తే చేసే పని మానేయడమో, వెళ్లేవాడు తిరిగిరావడమో జరుగుతుంది. "పెండ్లికి పోతూ పిల్లిని చంకలో బెట్టుకొని పోయినట్లు", "పిల్లి ఎదురైతే తల్లి అయినా శత్రువవుతుంది" అనే సామెతలు శకునాల పట్లగల విశ్వాసాన్ని సమర్థిస్తాయి. సాహిత్యంలో శకునాల ప్రస్తావన కన్పిస్తుంది.

శ్రీనాథుడు 'పల్నాటి చరిత్ర'లో శకునాల్ని గురించి విశేషంగా ప్రస్తావించాడు. కోడిపోరుకై తగిన శకునం కోసం శకునజ్ఞుల్ని విచారించినట్లు క్రింది పాదాలు చెబుతాయి :

"శకునజ్ఞులెల్ల విచారించి చూచి
మునుపటి పందెంబు మోసంబుకాదు
మనము గెల్తుము వేరె మరుపందెమైన
జయము దుర్లభం విచారించి చూడ" (1వ భాగం - పుట. 1)

శీలమనాయుడు గోపన్నతో శకునాల్ని గూర్చి

"నీకును శకునముల్ నేడెట్టులయ్యె
ఓడక వెరవక యున్నట్టు చెపుమ" అని అడుగగా గోపన్న అతనితో ఇట్లన్నాడు :

"బల్లివాయసమును బ్రాహ్మణోత్తముడు
గాలిగాడును ఎరుకలపోత పయిడి

కంటియు వరదును కనుబెంటిపాల
పసిడిమూగయు నేల పాము నుప్పెనయు
ఇవియాదిగాగల విన్నియు నాకు
మిక్కిలి పొడసూప మేలుగాకనుచు
పయనమై వచ్చితి" అంటూ శకునాల్ని వివరిస్తాడు.

బ్రహ్మనాయుడు తనకు కనిపించిన అపశకునాల్ని గూర్చి గోపునితో ఇలా వివరిస్తాడు :

"దండంబుపెట్టిన తనరి యంతంత
తోమాలె చయ్యన తునకలై పడియె
ఎదురుగా తెరువున నేతెంచు నిండు
కడవ చూడగ విచ్చేకడు చోద్యమయ్యె
తోటలోపల మంచి తోరంపుటాను
గంపకాయను తునకలుగా చేసిపట్టు
కొని తోటవాడు నగుచును నపుడు
వివని ముందర నాకు కట్టెదురయ్యె
ఒంటిబడి యకోచ్చట నొనరంగ వేగ
కొనిపోవు శవము కన్గొంటిని నేను
మైల చీరలమూట మరియేనుగంటి
ఊరిముందర రావినోత పులుగుపిట్ట
మ్రాకుపై నుండ కావలపోయె నెగసి
చంద్రవంకయు దాటి చనుదెంచునంత
వంట కట్టెలబండి పడినటుదోర్తి
పడుటయు పొడగండి వచ్చుచు నేను
మలపరపు కోడెలు మరి తేగలెన్నొ
కోరాడగ గ్రాంటి కొమరొప్ప నచట
నక్తము లప్పుడు నను చుట్టివచ్చె
ఎండినమ్రానిపై నేపున పులుగు
నిలచి యసత్తువై నెత్తురుక్రక్కి
పట్టిను తంటలో వరదువాపోయె

మనుబోతు లీవల మలయును త్రోవ
కుత్తరమున కూడియుండగ వెరచి
మరి దక్షిణమునకు మనుబోతులేగ
నెరిమంటతో నొకసీలంపు పోతు
తెరువు చంగున దాటి తెరువమై వాని
తాకిన నవి కొన్ని తడబడెనందు
కారుపోతులు వచ్చి క్రమ్మిపోనీక
పొడచిన ఆ యొంటి పోతవుడు చన్పె
ఇరువది ముప్పది యేబదిరెండు
ఏపుతో కదుపులనే పొడగంటి
ఇబ్బంగి శకునంబు లిట్లయ్యె నాకు
శకున భావములు విచారించ చూడ
అపశకునంబులే యధికంబులాయె" (1వ భాగం - పుట. 10)

"క్రీడాభిరామం" నందు పల్లభరాయుడు జనుల వ్యవహారంలోని శకునాల్ని గూర్చి ప్రస్తావింటాడు.

గోవింద మంచనశర్మ టిట్టిభునితో "వేకువ యగుచున్నది గావున నదియ మనకు ప్రస్థాన కాలంబని నిమిత్తం బనుసంధించి" అని (49 వచనం) చెబుతాడు. ఆ తర్వాత శుభశకునాల్ని గూర్చి టిట్టిభునితో ఇలా అంటాడు :

"చుక్క యొకింత నిక్కి బలసూదను దిక్కున రాయుచుండుటన్
జక్కగవేగ దిప్పుడు నిశాసమయం బది బ్రస్ఫుటంబుగా
ఘుక్కని మాటిమాటికిని గోటడు పల్కెడు వామదిక్కునన్
జొక్కటమై ఫలించు మన శోభనకార్యము తెల్లడిట్టిభా" (50వ పద్యం)

వైశ్యునకు గెలుపు గలిగించే శకునాలు క్రింది పద్యంలో వున్నాయి.

మాగిలి మాగిలి వృక్షము
పూగొమ్మున నుండి షడ్జము ప్రకాశింపన్
బేగొదమనె మరిపల్కెడు
గేగోయని వైశ్యునకు గెలుపగు జుమ్మీ (51వ పద్యం)

కోడి, యేట్రింత, కొంకనక్క, నెమలి కన్పిస్తే ప్రజలకు శుభమని అంటాడు.

కొనకొనం గోడి యేట్రింత కొంకనక్క
నమలి యీ నాలుగిటి దర్శనంబుతెస్స
పీనివలతీరు బలుకు నుర్వీజనులకు
గొంగు బంగారమంత్రుడు శాకునికవరులు (52వ పద్యం)

"ఇమ్మహానాగంబులు మనకుం గార్యసిద్ధి యొసంగుగాక" (222వ వచనం) అంటూ కార్యసిద్ధికి సర్పదర్శన మంచిదంటాడు.

గోధూళి లగ్నసమయం కార్యప్రయోజనం చేకూరునని "గోధూళిలగ్నంబు నం బురంబు ప్రవేశింపవలయు విశేషించి యుషఃకాలంబు సర్వప్రయోజనారం భంబులకు ప్రశస్తంబు" (66వ వచనం) గోవిందమంచనశర్మ అభిప్రాయం

మరియు

గార్గ్యసిద్ధాంత మతముషః కాలకలన
శకున మూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనః ప్రసాదాతిశయము
విప్రజన వాక్యమరయంగ విష్ణుమతము" (66 పద్యం)

అని చెప్పబడింది.

పై పద్యమునందలి మూడవ పాదాన్ని తప్పించి మిగిలిన పాదాలన్నీ శ్రీనాథుని భీమేశ్వర పురాణంలో (3-41). కన్పిస్తాయి. మూడవ పాదంలో శ్రీనాథుడు "సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు" అని ప్రయోగించాడు.

కొఱవి గోపరాజు తన "సింహాసనద్వాత్రింశిక"లో విజయపాలుడను రాజకుమారుడు వేటకు బయలుదేరగా అతనికి ఎదురైన శకునాల్ని వరుసగా సీసపద్యంలో వివరించాడు :

"పిల్లులు పోరాడె బల్లి యూరకత్రుళ్లె
దమ్మళి పొదసూపె దుమ్మి రెదుట

దొఱగవోయిన లేగ కొఱలుచు నొకకుఱ్ఱి
పఱతెంచె గ్రంపనై నఱచెగాకి
యులుమ దొక్కఁడు నూనె తలతోడ నేతెంచె
మైల చీరలచాకి మ్రోలనెదిరె
గాకియును గొరవంకయును జెక్కలపోతు
నేటిరింతయు దాటె నెడమ దిశకు

బైట వెరవుదప్పు బాలగుమ్మయు బాఱె
నొంటి పాట బైడికంటిపిచె
నెలుగు చేసె బెద్దపులుగు పాముటుదోచె
దబ్బి బొబ్బిలిడియె నుబ్బులదర" (1-231)

పిల్లులు పోరాడడం, బల్లి పలుకడం, తంబళి వాడెదురు రావడం, ఎదు రొచ్చి తుమ్ముడం, దూడను పోగొట్టుకొన్న ఆవు అరచడం, కంపమీదికాకి అరవ డం, కుష్ఠుకోగి తలకు నూనె రాసుకొని రావడం, మైలబట్టలతో చాకలి ఎదు రవ్వడం, కాకి, గోరువంక, భరద్వాజపక్షి ఎడమవైపునకు పోవడం, పాలపిట్ట, భరద్వాజపక్షి, పైశికంటి, గుడ్లగూడ కూయడం, పాము ఎదురవ్వడం మొద లైనవన్నియు దుశ్శకునాలు. కావుననే విజయపాలున్ని వెంటనే తిరిగి రమ్మ నగా విజయపాలుడు వానిలోని నిజానిజాల్ని తెలిసికొంటానని వెళ్లిపోతాడు.

"వానిగనుగొని పరివారమ్ము గలగుచు
శకున బలములేదు చనకుమనిన
విజయపాలుడివియు నిజములో కల్లలో
తెలిసికొందమనుచు దిరుగదయ్యె" (1-232)

**కలలు :** మనిషికి నిద్రలో వచ్చే స్వప్నాల్నిబట్టి మంచిచెడుల్ని తెలిసి కోవచ్చునని శాస్త్రం చెబుతుంది. కొఱవి గోపరాజు "సింహాసన ద్వాత్రింశిక"లో ఆ కాలమునాటి స్వప్నాల్ని వాటి ఫలితాల్ని పేర్కొన్నాడు.

విజయపాలుడు తాను రాత్రి నిద్రలో కనిన కలను గూర్చి తన హితు లతో ఇట్లంటాడు :

"వినుడేను రక్త చందన
మున నంగము దోగ మేషమున కెనయగుకా
రెనుబోతు నెక్కి యామ్యము
చనుచుంటి నొాకండనంచు స్వప్నముగంటిన్" (9-52)

కాలాన్నిబట్టి కలయొక్క ఫలం వేరువేరుగా ఉంటుందని క్రింది పద్యంలో కొఱవి గోపరాజు సూచించాడు :

"కలకు మొదటిజాము ఫలమొకయేటిలో
నందుకొను ద్వితీయ యామఫలము
అష్టమాసములకు నబ్బు మూడవజాము
ఫలము చూడ మూడునెలల గలుగు" (9-71)

మరియు

"తొలివేకువగా దూప్పన
దెలుపెక్కగ గన్నకలలు దిన దశకమునన్
ఫలయించు బసులవిడువం
దలకొనుకల సిద్ధి బొందు దద్దివసమునన్ (9-71)

స్వప్న ఫలితాన్ని వరుసగా వర్ణించాడు. ఏనుగు, గుఱ్ఱము, పచ్చని మాను, మేడ, మగపశువును ఎక్కినట్లు కలవచ్చినచో అది మనిషికి సుఖాన్ని, రాజ్యప్రాప్తిని కలిగిస్తుందని క్రింది పద్యం చెబుతుంది :

ఏనుగు గుఱ్ఱము బచ్చని
మ్రానును మెడయును మెట్టు మగపసరంబుం
బూని కలలోన నెక్కిన
మానవునకు సుఖము రాజ్యమహిమయు గలుగున్ (9-78)

పాములు, తేళ్లు, జలగలు కరచినట్లు వచ్చినచో ఆకలి చావునకు చిహ్నమనీ, శరీరానికి మలం పూసుకున్నట్లు, స్త్రీలతో రమించినట్లు కల వచ్చినచో పుత్రలాభమని క్రింది పద్యం చెబుతుంది :

కలలో బాములు దేళ్ళును
జెలగలు గఱచుటయు జావుజెప్పెడు బొరిమై

మలమంటుట పొందదండగు
లలనల బొందుట సుతార్థలాభము చుమ్మీ (9-74)

తలను పేను కొరకడం, ప్రేగులు చుట్టుకున్నట్లుండడం, నెత్తురు కండలు, పాలు, బురుగు, నెయ్యి, కల్లు త్రాగినట్లుగ కల వచ్చినచో అవి శుభాలనీ, సంతోషదాయకాలనీ క్రింది పద్యంలోని భావం :

తలబేను దినుటయు బ్రే
వుల జుట్టగ బడుట మానవులనెత్తుప గం
డలు బెరుగు బాలమద్యం
బులు నెయ్యిని ద్రావుటయును ముదమగు కలలన్ (9-75)

కలలో నీటిని, రక్తాన్ని చూస్తే దీర్ఘాయువు కలుగుననీ, మంట, గంట, పచ్చని పంట, తెలుపురంగు మేలు కలిగిస్తుందనీ, బూడిద, ఎముక, ధాన్యపు పొట్టు, ప్రత్తి, ఉప్పు కనబడడం అశుభమని క్రింది పద్యంలో వర్ణించబడింది :

నీరు నెత్తురు గనిన నిడదగు నాయువు
మంటగంట పసిడి పంట గంట
తెలుపుతెల్ల మేలుకలలోన వెలమిడి
యొముక ప్రత్తిలవణముక దక్క (9-76)

ఎద్దు, గాడిద, ఎనుబోతు, ఒంటెను ఎక్కినట్లునూ, అన్నమును, పిండిని నువ్వులను తిన్నట్లునూ కలవచ్చినచో కీడు జరుగుతుందట :

"ఎనుమిక మొద్దును గాడిద
వెనుబోతును లొట్టిపిట్ట నెక్కిన నన్నం
బును బిండియు నువ్వులు గల
దినగననగు గీడు వసుమతీ వర తిలకా" (9-77)

నూనె, కలిసిళ్ళు, క్రొవ్వు, తేనె త్రాగినట్లు కలవచ్చినచో అది వ్యాధి సూచకమనీ, కోతి, పొగ, కాకి కనిపించినచో అది కీడు కలిగించునని క్రింది పద్యంలో చెప్పబడింది.

"నూనెయు గలియును గ్రొవ్వును
దేనెయుగల ద్రావెవే వతి వ్యాధియగున్

వాసరము బోగయుగాకియు
గానంబడెదేని గీడు గానగ వచ్చున్ (9-78)

మదించిన ఏనుగు, దేవుడు, కస్తూరి, గోపురం, నీలమణులు మేఘాలు, భూమి, యమునానది, కుండలు తప్ప మిగిలిన నల్ల వస్తువులు కలలో కన్పించి వచ్చో అశుభాన్ని కలిగిస్తాయట.

"మదగజము దేవరయు మృగ
మదమును గోపురము నీలమణులున్ఘనసీ
రదములు ధరణియు యమునయు
నుదకుంభము దక్క నలుపులొప్పవు గలలన్" (9-79) అనే

పద్యం సమర్థిస్తుంది.

**మందుపెట్టు ఆచారం :** ఇతరులు తాము చెప్పే మాటలనే వినాలనీ, తమ చేతి కీలు బొమ్మగా చేసుకోవాలనీ తలంచి కొందరు ఇతరులకు మందు పెడతారనే ఒక విశ్వాసం ప్రజల్లో కన్పిస్తుంది. దాన్నేమర్లు మందుపెట్టడం అంటారు. మర్లు (మరులు) తీగెను తొక్కినా తమను తాము మరచిపోతారని 'ఆముక్త మాల్యద'లోని మాల దాసరి కథలో శ్రీకృష్ణదేవరాయలు పేర్కొన్నాడు.

మాలదాసరి తెల్లవారు జాముననే లేచి గుడికై బయలుదేరి దారిలో మరులు తీగను తొక్కడంవల్ల దారి తప్పి తిరిగాడట !

"మరులు దీగ మెట్టి యిరులన్ననోయని
యెడుతమిస్రగాడు పడి వోలంబు
తెల్ల దిరిగి తూర్పు దెల్లనౌతతి నొక్క
శూన్య గహనవాటి జొచ్చె చనుచు" (6-12)

ధూర్జటి "శ్రీకాళహస్తి మాహాత్మ్యం"లో వార వనితల స్వభావాల్ని చెబుతూ మందుపెట్టు ఆచారాన్ని ప్రస్తావించాడు :

"వేకువల యందు విటునిచే పీడియంచు
బుచ్చుకొన దగదింతికి, బుచ్చుకొన్న
నూరనూరంగ దద్రవ్యపంబు మీయవలయు
వెలదులకు మందు వెట్టెడు వేళగాన" (3-82)

మరియు "మణి మంత్రౌషధ శక్తిచే విటుల ప్రేమగ్రస్తులం జేసి తన్మణి భూషాదులు పుచ్చుకోగోలు పదమ్మా" అని అంటాడు మందుపెట్టి వివశునిచేసి వారివద్ద నున్న ధనాన్ని తీసుకోవాలని భావమన్న మాట.

అయ్యలరాజు నారాయణామాత్యుడు "హంసవింశతి"లో వల్లవుడను వానికి వారవనిత మర్లు మందుపెట్టగా ఆతడామె మోహంలో పడ్డాడని వర్ణించాడు.

"గంటూరమును జాజికాయలు మ్మొత్తవి
త్తులు మర్లు మాతంగి కలువగడ్డ
పచ్చయెన్నులు కోష్ఠు పచ్చిక మంచేను
గుముదము గుళ్ళ సున్నము రుద్ర
జడవేరు వస ఖురాసాని వాము పుడు
కల పోలుగాడు మైగారు చెమట
సీ రావు గజ్జల చేరిన మష్టును
గాల్మడి జాతంటుగాను నూరి

కలయ గురిగింజలం తీసి గుళికలమర
జేసి నీడనె యూరించి తీసి దాచి
యున్న మందింత మడుపుతో నాసగే నతని
కధికతర మోహముష నా హంసయాన" (5-152)

మందు ప్రభావంవల్ల తన జ్ఞానాన్ని కోల్పోయి మందుపెట్టిన వారి వెంట బడి తిరగడం, వాళ్లు చెప్పినట్లే చేయడం జరుగునని వల్లవుని ప్రవర్తన చెబుతుంది.

"ఈబాళిమందు మసగొని
యాబిడ తన కండ్లు గట్టినట్లుండ నతం
డే బుద్ధి లేక యచ్చెలి
సోబెంకెడ జిక్కిచిక్కి చొక్కుచు దిరుగున్" (5-158)

ఇష్టంలేని భర్తతో కాపురం చేయలేక గడుసరి అయిన భార్య భర్తకు మరులు మందు పెడితే చస్తాడని వేమన అంటాడు.

ఊసరిల్లి పిచ్చి యుపమున రసమున
చేర్చి నూరి సతులు చెలువముగను
వశ్యమగును మగని వరియించి పెట్టంగ
రోగమ మరి నీల్లు రూఢివేమ"

(ఆంధ్రుల సాంఘిక చరిత్ర : పుట - 397)

**జాతరలు :** జానపదుల పండుగలంటే వెంటనే స్ఫురించేవి జాతర్లు, కొలుపులు, తిరుణాళ్లు తప్ప దసరా, దీపావళి, విజయదశమిలాంటి పండుగలు కావు. నగర ప్రజలు కూడా జాతర్లను, బోనాల పండుగల్ని ఆచరించడం కలదు. భాగ్యనగరంలో ప్రతియేటా సామూహికంగా జరుగుచున్న మహంకాళి జాతర, బోనాల పండుగ, ఎల్లమ్మ, పోచమ్మ జాతరలే ప్రజల తార్కాణం. ప్రజలత్యంత ఉత్సాహంతో సామూహికంగా సాంఘిక ఉత్సవాలుగా వీనిని పాటిస్తారు. జానపదుల పండుగల్లో జాతర్లకు ఒక విశేషం ఉంది. అందుకే జానపదుల పండుగలు అంటే జాతర్లే అని ఒక ప్రసిద్ధి ఏర్పడింది. ఇదే విషయాన్ని డాక్టరు నాయని కృష్ణకుమారిగారు సమర్థిస్తూ "నిత్య జీవితంలోన సామాన్య హైందవుడు మిక్కిలి యుత్సాహముతో నిర్వహించు దసరా, దీపావళి, ఉగాది, సంక్రాంతి వంటి పండుగల ప్రసక్తియే యిందు కానరాదు. జానపదుడు సమధిక సంరంభంతో నిర్వహించు పండుగలలో నొకటి ఎల్లమ్మగారి జాతర"[1] అని వివరించారు. ఈ జాతరనే శైవభక్తులు 'పరుస' అని పిలుస్తారు. బహుశా ఇది కన్నడ సంప్రదాయం నుండి వచ్చి ఉండవచ్చు. పాల్కురికి సోమనాథుడు తన పండితారాధ్య చరిత్రలో 'పరుస' అనే ప్రయోగించాడు.

జాతర్లు, కొలుపులు, తిరునాళ్లు అని పిలువబడ్డా వీటిలో ఒకదాని కొకటికి స్వల్పభేదం ఉందంటాడు డా॥ ఖూదరాజు రాధాకృష్ణగారు. "కొలుపు ఒకే గ్రామస్థులు చేసేది. జాతర/జాత్ర అనేది పొరుగూళ్ల నుంచి కూడా జనం యాత్రకు వచ్చి పాల్గొని చేసే కొలుపు, తిరునాళ్లు/తిరునాల అలా కాదు ఏదో నిశ్చితమైన పుణ్యదినంలో మాత్రమే జరిగే వేడుక."[2]

తెలుగు సాహిత్యంలో గంగజాతరను, కాట్రేని జాతరను గూర్చి ప్రస్తావించడం జరిగింది.

---

1. జానపదగేయ గాథలు : పుట - 326
2. మాటలు మూటలు - ఈనాడు - పుట-30 - ఆదివారం 10-7-88

**తిక్కన:** ఆంధ్ర మహాభారతంలోని 'మౌసలపర్వం' లో జాతరను గూర్చి విపులంగా చర్చించాడు. సాధారణంగా గ్రామానికి అశుభాలు జరిగినపుడు కానీ, భయోత్పాతాలు పుట్టినపుడు కానీ, మారి, మశూచిలాంటి భయంకర రోగాలు ప్రబలినపుడు కానీ గ్రామాల్లో జాతరను నిర్వహిస్తారు గ్రామపెద్దలు ముందుగా సమావేశమై జాతర జరుపుటకై నిర్ణయించి ఆ విషయాన్ని. ఊరి వాళ్లందరికి తెలియజెప్పుటకై చాటింపు వేయిస్తారు. ఇదే విషయాన్ని భారతంలోని 'మౌసల పర్వం'లో తిక్కన చెబుతాడు. ద్వారకా నగరంలో మహోత్పాతాలు పుట్టినపుడు శ్రీకృష్ణుడు మిగిలిన పెద్దలతో సమావేశమై జాతర చేయడానికై నిర్ణయించి ఆ విషయాన్ని నగరంలో చాటింపు వేయించాడని క్రింది పద్యం వెల్లడి చేస్తుంది :

"జాతరసేయగా వలయు సర్వజనంబులు నంబురాశికిన్
బ్రాతిగ భక్తితోడసని బంధులకెల్లను జెప్పివీట వి
ఖ్యాతిగ నప్డు సాటుటకు నర్హుని బంచిన ఘంటికాస్వనో
ద్ఘాతముగాగ వాడెలమి బెద్ద యెలుంగు నజాటె నెల్లెడన్"

(మౌసల - 1-24)

జాతర్లందు మద్యపానం చేయడం, మాంసభక్షణం సర్వసాధారణం, యాదవులు జాతరకై బయలుదేరునపుడు తమవెంట తీసికొనిపోవుటకై వండిన వంటకాల్ని తయారుచేసే విధానాన్ని తిక్కన క్రింది పద్యాల్లో వర్ణించాడు :

'అవి గనియు వినియు నులుకక
సవరణలొప్పార నధిక సంభ్రములై యా
దవులు మనోజ్ఞములగు సీ
ధువులును మాంసములు వేడ్కతో నింటింటన్'

(మౌసల- 1-28)

మరియు

"సమకట్టి కొనుచు భోజ్యములు భక్ష్యంబులు
నానా విధముల నొనర్చి కొనుచు

క్షీర శర్కరలను ఘృత బహు భంగిక
వ్యంజనములు వివిధాన్న పాన
ములును నక్షత గంధములను బుష్పంబులు
గావించుకొని బలుగావళులును
దలమోపులను బండ్లు దమతోడ నొప్పారి
చనుదేర గరులు నశ్వములు నరద
ములు నలంకార విరచనములును దాత్త
లలిత రేఖలగు మూల్యములును భూష
ణములు నా లేపనములు వస్త్రములు వింత
చెన్ను సేయ జేష్టలు విలసిల్లు చుండ" (మౌసల 1-29)

సముద్రాన్ని యాదవులు భక్తితో పూజించిన విధం చూడుడు.

పదపడి గీత వాద్య గతి బంధుర నృత్యము లుల్లసిల్లగా
సు దధికి నంచితాక్షత మహత్తర గంధ విశిష్ట పుష్ప సం
పదలు బహుప్రకారముల బ్రస్తుతి కెక్కగ బూజ సేసి పెం
పొంతవ నివేద్యమిచ్చిరి సముజ్జ్వల హృద్య పదార్థ కోటులన్"
(మౌసలం 1-38)

సముద్రుని పూజించిన పిదప యాదవులందరు మద్యపానం చేశారనటం జాతర్లలో మద్యపాన సేవనం ఆచారమని తెలుస్తుంది :

"సాత్యకియు గృతవర్మయు జారుదేష్ణు
డును గదుండును బ్రద్యుమ్నుడును మొదలగ
గలుగు యాదవులెల్లను గాంక్ష బూన
విధి యొనర్చిరి పెల్లుగ విధి వశమున" (మౌసల 1-40)

శ్రీనాథుడు 'శివరాత్రి మాహాత్మ్యం'లో బ్రాహ్మణుడు శాకాహారాలతో చండికాదేవికి జాతర చేశాడని వర్ణించాడు :

"జాతర చేసె బ్రాహ్మణుడు చండికి గమ్మని పిండివంటతో
నేతులతోడ మద్దికడ నిర్మలినన్నముతో రసావళి

చూత ఫలాళితోడ వరసూపముతో జిలువాల తోడుతన్
నేతుల తోడ నప్పడ కనిష్ఠతరంబగు నిష్టపెంపునన్ (4-8)

బ్రాహ్మణుడు కావున నియమనిష్ఠలతో శాకాహారాలతో చండికా దేవికి జాతర చేశాడు.

జాతర్లలో దేవతకు బోనా లెక్కించడం అనే సంప్రదాయం వుంది. మహంకాళి జాతరకు బోనాల పండుగ అనే మరో పేరు ప్రసిద్ధిగా విన్పిస్తుంది. బోనాలెత్తు ఆచారాన్ని డాక్టర్ నాయని కృష్ణకుమారిగారు ఇలా వివరించారు. "బోనము భోజనశబ్ద వికృతి. రంగులతో చక్కగా చిత్రించిన 'పూజకుండ'లో ముందురోజే వండిన అన్నము నుంచెదరు. ఆకుండను 'చద్ది కలశము, 'కడు ముంత' అందురు. కడుముంతపై నుంచిన మూకుడువంటి దానిపేరు 'కంచుడు'. ఈ 'కంచుడు'నందు నూనెపోసి వత్తివేసి జ్యోతి వెలిగింతురు. ఇది దొంతిగా పెట్టుకొని యమ్మవారి గుడికడకు గొనిపోవుటయే బోనాలు గొనిపోవుట"[3] ఈ బోనాల ఆచారం తెలంగాణంలో విశేషంగా కలదు శ్రీనాథుడు తన 'హరవిలాసం'లో 'భోనాముదొంతి'ని గూర్చి ప్రస్తావించాడు :

"నానావిధ పాకములుగ
నానాలుగ జేసి నాలుగ్గై దట్టికలన్
బోనాము దొంతి బేర్చిరి
సూనాస్త్ర సమానుడైన సుతుసిరియాలున్" (2-128)

ధూర్జటి : 'శ్రీకాళహస్తిమాహాత్మ్యం'లో జాత్రేసి జాతరమ గూర్చి మిక్కిలి విపులంగా వర్ణించాడు. జాతరను గూర్చి చాటింపు వేసిన పిదప ఎఱుక లందరూ జాతరకై బయలుదేరారట.

"చాటిన మరుసటి మంగళవారంబున నివ్వరి బియ్యంబున బువ్వలవతె నుండ వండివార్చిన యుపహార భాండంబులు, చమరీమృగంబుల పాలకు నను కూలంబైన గునుకంబ్రాల పాయసంబుల కుండంబులు, కచక తండులం బింది గొట్టి కోదబోసి యప్పి గొప్పలుగా జేసి యావించిన కుడుముల బానీలు, కాశింగ

3. జానపద గేయగాథలు - పుట. 328; 1978

టంగ సంగతలశున వాసనా పిశితంబులగు పిండికూరల చట్లును, బచ్చగంధసిక పరిపాకంబులు చేసిన వసీశాకంబుల వెసళ్ళును నానావిధ మాంసంబుల యటికల, గుడాగుడగుడ పుష్పతాల హింతాల తండుల జనితాసవ కలశంబులను, గంప లను గావిళ్ళను బెట్టి బలివెట్టుటకై వనక్రోడ తామ్ర చూడమహిష జీవిక ప్రము ఖాటవిక మృగంబులం బట్టుకొని బండి కట్టుకొని, కాత్రేని గుడికి నడచునప్పుడు తప్పెట చప్పుళ్లును, వెట్టి సొరకాయల బుఱ్ఱలం గట్టినసరకట్ల కిన్నెరలు మెఱయ మొరపంచు మ్లేచ్ఛుల పాటల, తానమానంబులను, గుమ్మెటల చటులరవంబున, గొమ్ముల దిమ్మన జెలంగే" (౩-౩౬)

జాతరకు నాథనాథుడు, తండె తమ కుమారుడగు చిన్ననితో బయలు దేరాడు.

"ఒక్క ప్రొద్దుండి సెలయేట నుదకమాడి
నాథనాథుండు తండెయునై జమైన
చతురలంకారములు దాల్చి సహబభక్తి
నాత్మజుని బూచి కై సేయమున్న నతడు" (౩-౩7)

కాత్రేని పూజకై చిన్నడు తన సహజ కిరాతవేషంతో బయలుదేరారట :

"తిలకంబొడి విభూతి బెట్టుకొని రక్షమూలికా మాలికా
వలయం బుబ్దొడి, దట్టిగట్టుక, శిరోవర్ధిష్ణు నీలాలకం
బులలే దీగను జుట్టి కేల విలునమ్ములూని కాత్రేని పూ
జలు సేయన్ వెడలెన్ గుమారుడు పితృస్వాంతంబు లుప్పొంగగన్"
(౩-౩౮)

అలా బయలుదేరి కాత్రేనిని పూజించారట :

"చని మృగయాధి దైవతము సన్నిధి బాణశరాసనాదిసా
ధనములునిల్పి యెఱ్ఱ విరిదండల నివ్వరిప్రాల రక్తచం
దనమున గుగ్గిలంపు బొగదట్టు పునుంగున నెత్తు జోతులన్
ఘన వివిధోపచారముల గానుకలన్ శబరాళి గొల్వగన్" (౩-౩౯)

పూజించిన పిమ్మట కాడ్రేడికి బలిపెట్టారని చెప్పడం జాతర్లలో బలిపెట్టు ఆచారాన్ని సమర్థిస్తుంది :

"మునుపు పడిన మేకము గొనివచ్చి మిడ్రిగుడ్లు
పొడిచి, నీటశిరము దడిపి తోక
గోసి, ధూపమిచ్చి మీసంబు పెకలించి
కానుకిచ్చి కాటిజేరి గొలిచి" (8-49)

**తెనాలి రామలింగడు :** "పాండురంగ మాహాత్మ్యం"లో పశువులకు వ్యాధులు ప్రబలినపుడు జాతర చేస్తారని చెప్పాడు :

"అతటి దన్నగరీపతి
జాతర సాటించె బహు విసరమనితర సా
ధ్యాతత వాతామయ ని
ర్ఘాతాహతి దూలగాలిగంగల కెల్లన్" (8-73)

పామరస్త్రీలు అలంకరించుకొని దేవతకు బోనాలు సమర్పించేందుకై వెళ్లారట :

"గోర్వెచ్చ చేమురంటుకొనిటి మస్తకముల
జలకమాడి నిశామిళితవాలి
కట్టిరి చిలుక చౌకముల గ్రొంబుట్టముల్
కాటుకదీర్చిరి కన్నుఁగవల
దిద్దిరి సిందూర తిలకంబు బటువుగా
దిక్కు గొప్పుల విరుల్ గ్రక్కు రద్ది
నింబప్రవాళ మాల్యంబులు వైచిరి
చిట్టిబొట్టు ధరించిరిట్టునట్టు
దరుణధావన ధగధగద్ధళ సమణుల
హత్తు కొలిపిరి శేతపీఠ్యములు డాలు
పర్వదినముల బామర ప్రమదలుదిత
నియమ సంభావనారంభ నిభృతబుద్ధి" (8-74)

జాతర సమయాల్లో భక్తులు దేవత ముందు సాహసకృత్యాలు చేసి ప్రజ

లకు వేడుక కలిగించే ఆచారం కలదు. భక్తుల సాహసకృత్యాల్ని వర్ణించిన విధం చూడుడు :

"అంభోధరము క్రింద నసియాడు నైరావ
తియు బోలె సిడిక్రేలె దెలవయోర్తు
చెందమ్మి కొలన రంజిల్లు నంచయుబోలె
నిప్పుబేట జరించె నెలతయోర్తు
తొలుసంజ యెండ వర్తిలు జక్కవయుబోలె
నీగె బందిరిగుండ మింతి యోర్తు
జలనీలిపై నిక్కు కలువమొగ్గయు బోలె
ననటాకు వల్గించె నతివయోర్తు

కాంత యొక్కర్తు మూపున గండలిచ్చె
మారుగాలిచ్చె నొక సుధామధురవాణి
లలన యొక్కర్తు నోరి తాళంబులిచ్చె
శక్తి జాతర భమభక్తి శక్తులెసగ" (8-77)

దేవతముందు 'ఆత్మ హింసా' పద్ధతిలో సాహసకృత్యాలు చేయడం ఆన వాయితీగా కనిపిస్తుందని డాక్టరు నాయని కృష్ణకుమారిగారి అభిప్రాయం. "గ్రామదేవతలకు యీ 'వీరచర్య' రాను రాను, వీరశైవము ముదిరిన వెనుక వీరశైవులచే గ్రహింపబడి మిక్కిలి ప్రశస్తి వహించినది" (జానపద గేయ గాథలు - పుట. 245)

జాతర సమయంలో అమ్మవారి యెదుట మేకల్ని, కోళ్ళను, గొఱ్ఱెల్ని, బలి యిస్తారు జంతుబలి యిచ్చారని 'పాండురంగ మాహాత్మ్యం'లో చెప్ప బడింది :

"బత్తులు నునువాకత్తుల
మొత్తిరి పశు సమజముండములు చండములా
నెత్తురు ధారలు దారవి
పత్తిమిర నవారుణ ప్రభలు ప్రబలంగన్ (8-78)

నెత్తుటి ధారలు ప్రవహించునట్లుగా బలిపెట్టారట.

**పాలవేకరి కదిరీపతి :** 'శుకసప్తతి'లో 'గంగజాతర'ను గూర్చి ప్రస్తావించాడు. ధనవంతుడు, చంద్రరేఖ గంగగుడికి వెళ్లి పూజించిన విధానంలో జాతర చేయు పద్ధతిని చక్కగా వర్ణించాడు :

"కాపుగుబ్బెతలు పొంగళ్లు పెట్టిన పాల
కడవ చాలికల పొక్కళ్లజాలు
తోరలు దెప్పించి బంతులుగట్టి యర్పించు
పొట్టేళ్ళ నెత్తురు బురదరొంపి
కోర్కి చెల్లిన భుజంగులొసగ బెటికిన
కుక్కుట పటలంపు తెక్కగుంపు
మంత్రముల్ ఫలయింప మాంత్రికుల్ పయిజోలి
వన్నెయుంచిన పంచవన్నె కోళ్ళు
వరగుగ్గుల గురు ధూప పరిమళంబు
శాకినీ డాకినీ భూత సంభ్రమంబు
భరదిత ప్రాణమృత్తికాతురగ చయము
నలరు నాగంగగుడి జేరనరుగునపుడు" (2-76)

కటారితో తల ఖండించి బలియిచ్చారని క్రింది పద్యంలో చెప్పబడింది :

"తను దునుము దలచు తక్కా
మిని కన్నను మున్నె యతడు మిసిమి కటారిం
దునిమి బలియొసగె" (2-77)

**కొఱవి గోపరాజు :** "సింహాసన ద్వాత్రింశిక"లో వార వనితలు పూజించిన గ్రామదేవతల్ని పేర్కొన్నాడు :

"కామాక్షికిని మహాకాళికి జండికి
నక్కజియ్యకు గాళికంబికకును
వింధ్యవాసినికేకవీరకు మున్నుగా
నెల్లవేల్పులకు బిందించిమ్రొక్కి" (4-269)

మరో సందర్భంలో 'జాతర' అని పేర్కొనకపోయినా గ్రామదేవతకు పూజ చేయుటకై ప్రజలు తరలి వచ్చారని వర్ణించిన సన్నివేశం జాతర సంబరాన్ని గుర్తు చేస్తుంది

"ఆ నగరంబు దెసనుండి దిమ్మురేగిన యట్లు తూగొమ్ములు బువ్వనం గ్రోవులునుం దప్పెటలును డక్కలును బెక్కువిధంబుల దిక్కులు చెవుడు పఱుపుచు మ్రోయ నవ్వాద్యరవంబునకు జాసటయై తమ యూర్పులం బెద బొబ్బలును గిరిగహ్వరంబులను పఱ్ఱిహితంబులుగా గంధపుష్పార్చితుండగు నొక్కదనుని నడుమ నిడుకొని కుఱుచ కాసకోఱలు మెఱయుచు బరికె తలలు కలుకు గొండరులు సనుదెంచిన" (11-26)

"వీనిం బోవగనిండిదె
నేనుత్తమ కులుడ మాంసనిబిడుడ బ్రియస
న్మానుడ నన్నునరబలి
గానిచ్చిన దేఃమెచ్చు గరుణంబ్రోచున్" (11-28)

అనే పద్యంలో గ్రామదేవతకు నరబలి యిచ్చే ఆచారాన్ని ప్రస్తావించబడింది.

'చంద్రశేఖర శతకం'లో నాటి పల్లె ప్రజల జాతర వర్ణించబడిందని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తమ 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో ఉదాహరించిన పద్యమిది :

"ఖరిదిగ సూస్తి తీరతము లెన్నెనో అవనగొం డగంగజా
తరసరిజావు పంబలును తప్పెటలున్ కొముగాండ్ల సిండ్లసం
బరమరి దెల్పుమింకొక పజానము రంకులరాటమెక్కనే
తిరిగిన సాటిరాదని నుతించును మూర్ఖుడు చంద్రశేఖరా

(ఆంధ్రుల సాంఘిక చరిత్ర - పుట. 401)

# జానపదుల వైద్యం

జానపదుల్లో ప్రచారంలో ఉన్న వైద్య విధానాన్ని జానపద వైద్యం అని అంటారు. ఆటవికుల అనుభవం నుండి పుట్టిన మూలికావైద్యం, గ్రామీణుల అనుభవంలోని గృహవైద్యం లాంటివన్నియు జానపద వైద్య విధానంలోకే వస్తాయి. ప్రకృతిలోని ప్రతి మొక్క, చెట్టు వైద్యానికి పనికి వస్తాయన్న అతిశయోక్తికాదు. చెట్టు ఆకులు, వ్రేళ్ళు, బెరడు ఏదో విధంగా రోగనివారణకు పనికి వస్తాయి. వేపచెట్టు, తులసి చెట్టు సర్వ రోగ నివారణులన్నది జగమెరిగిన సత్యం. పొలంలో పనిచేసే రైతుకు గాయం తగిలితే ఏదో ఒక ఆకురసం ఉపయోగిస్తాడు. కోయలు, చెంచులు మొదలైన ఆటవికులు తాము సంపాదించిన మూలికలతో గ్రామీణులకు రోగచికిత్స చేయడం ఈనాటికి గ్రామాల్లో కనిపిస్తుంది. 'పెరటిచెట్టు ముందుకు పనికిరాద'నే భావం పాశ్చాత్య నాగరికతా ప్రభావం వల్ల అనేక ఆరోగ్య సూత్రాలు కల్గిన ఆచారాల్ని మనం దూరం చేసుకోవడం వల్ల జానపద వైద్యం విలువను గుర్తించలేకపోవడం జరిగింది. అయినా గ్రామీణ ప్రాంతాల్లో జానపద్య వైద్యానికి విలువ ఉందనే చెప్పవచ్చు. ఆకు పసరుల్ని ఉపయోగించడం, వివిధ చెట్ల ఆకుల్ని, వ్రేళ్లను వాడడం, కొన్ని రోగాలకు ఇనుప కడ్డీతో వాతలు వేయడం, బాలెంతలకు వివిధ మూలికల్ని ఉపయోగించడం, మిరియాల, శొంఠి కషాయాన్ని త్రాగించడం, ధనియాలు, కరివేపాకును జీర్ణకారులుగా భావించడం జానపద వైద్యానికి నిదర్శనాలు.

జానపద వైద్యానికి నమ్మకం ప్రధానం. వంశపారంపర్యంగా వచ్చేదే జానపద వైద్యం అని అంటారు డా॥ ఆర్వీయస్. సుందరంగారు: "సాంఘిక ఆచారంగా, సంప్రదాయంగా, నమ్మకం ప్రధానంగా తరతరాల నుంచి వస్తున్న అనుభవ గృహవైద్యమే జానపద వైద్యం."[1]

ఆయుర్వేదం, హోమియోపతి, యునాని, ప్రకృతి వైద్యం, కాయకల్ప చికిత్స, జలచికిత్స మొదలైన వైద్యాలన్నింటికి జానపద వైద్యం కొంతవరకు

---

1. ఆంధ్రుల జానపద విజ్ఞానం: పుట. 324

మూలమని భావింపవచ్చు. జానపద వైద్యాన్ని "ముఖ్యంగా ప్రకృతి జానపద వైద్యమని మంత్ర తంత్ర సహిత వైద్యమని"2 డా॥ ఆర్వీయస్. సుందరంగా విభజించారు భూతవైద్యం, వశీకరణ ఔషధాల్ని ఉపయోగించడం, మర్లుమందు పెట్టడం మొదలైనవి కూడా జానపద వైద్యంలో కనిపిస్తాయి. వ్యాధినివారణకై జానపదులు ఉపయోగించే ఔషధాల్ని గూర్చి డాక్టర్ నాయని కృష్ణకుమారిగారు ఇలా వివరించారు :

"కథాగత పాత్రలు రోగపీడితులగుచో వాడబడెడి యౌషధములన్నియు నాకులు, మూలికలు, జంతుమాంసము మొదలగునవిగా పేర్కొనబడినవి. వీనియం దనేకములగు వ్యాధుల ప్రసక్తికలదు కాసె, ఉక్కెరస, గంగవెఱ్ఱులు, గండమాల, వాలగౌడలు కాకిసోమాల మొదలగు రోగములు ప్రసంగవశమున పేర్కొనబడినవి. కాని వీనినన్నింటికిని భగవదనుగ్రహమేగాని శరీర రుగ్మతకాదని సిద్ధాంతము చేయబడును. కావున దైవానుగ్రహ విశేషము, భాగవత్ప్రసాదము కలిగిన వెంటనే రోగములు మాయమగును కొన్ని యెడల మంత్రములు, విభూతి, మంత్రజలమువంటి యతిమానుష శక్తిపూరితములగు వస్తువుల 'సోకు' వలన నా రోగములు నశించినట్లు వర్ణించుట కలదు."3

భక్తి ఆవేశంలో భక్తులు భగవంతుని యెదుట సాహసకృత్యాలు చేస్తూ శరీరానికి తగిన గాయాలకు భగవంతుని విభూతి, బండారు మొదలైన వాటిని పూయడం జానపదుల జాతర్లలో కనిపిస్తుంది.

జానపద వైద్య విషయాల్ని పాల్కురికి సోమన, తిక్కన ఎఱ్ఱన, శ్రీనాథుడు, శ్రీకృష్ణదేవరాయలు, అల్లసాని పెద్దన, ధూర్జటి, తెనాలి రామలింగడు, రామరాజభూషణుడు, నంది తిమ్మన, అయ్యలరాజు నారాయణకవి మొదలైనవాళ్ళు తమ కావ్యాల్లో ప్రస్తావించడం జరిగింది.

**పాల్కురికి సోమన :** 'బసవపురాణం'లో కన్నప్ప శివుని కంటికి చేసిన చికిత్సల్ని పేర్కొన్నాడు. అరచేతులతో కనురెప్పల్ని ఎత్తి కంటిలో

2. ఆంధ్రుల జానపద విజ్ఞానం : పుట. 332
3 జానపద గేయ గాథలు : పుట. 332

నెరసున్నదేమోయని ఊహాడట నాలుకతో కనుగ్రుడ్డుపై త్రిప్పాడట. వస్త్రాన్ని పొట్లంలా మడచి నోటితో ఆవిరిచేసి కంటికి తాకించాడట :

"గరతలాంగుళముల గనుఱెప్ప లెత్తి
నెర సున్నదని పొలుసిష్టించి యూదు
ఐరగ నాలున గ్రుడ్డుపై ద్రిప్పిత్రిప్పి
యొరయుచు నొరయుచు నొయ్యన జూచు
జీరావిగొని కంటజేర్చి హత్తించి
చీరెల్ల దడిసిన జక్కు, వెండియును
నీకడకంట వ్రేలిడి యొత్తనొత్త (తృతీయ - 114 పుట.)

బసవపురాణంలోనే "వాపులకు వాయుతైలాలు, వావిల చిగుళ్ళు, ఉమ్మెత్త, ఆముదపు చిప్పుళ్ళు, జిల్లేడాకులు వీటితో కాచడం మొదలైనవి చేసే వారని చెప్పబడినట్లు"4 డా॥ ఆర్వీయస్. సుందరంగారు పేర్కొన్నారు.

తిక్కన : 'మహాభారతం'లో శ్లేష్మాదిరోగ వికారాల్ని నిరూపిస్తూ వైద్యానికి సంబంధించిన విషయాల్ని ప్రస్తావించాడు :

"వినుము తెలియంగ శ్లేష్మం
బనుదోషం బారబరగి యవయవములు జా
డ్యని రూఢంబుబుగా జే
యునులోపలి బయలు నెల్లనొయ్యన కప్పు" (అశ్వ. 1-171)

శ్లేష్మం గొంతుకు అడ్డుపడి శ్వాసను ఆడనీయక ప్రాణాలు పోయే ప్రమాదం కలిగిస్తుందని అంటాడు :

"కుత్తుకు సడ్డుపడుసూ
ర్పొత్తిలి పోనీక యాగు నూర్ధ్వశ్వాసం
బెత్తగ జేయును జీవుం
డత్తనువున నుండనేరకంతట వెడలున్" (అశ్వ. 1-178)

4. ఆంధ్రుల జానపద విజ్ఞానం : 324

శ్లేష్మరోగాది దోషాలు శరీరానికి వస్తే చివరకు సన్నిపాతంగా మారి ప్రాణమే పోతుందట :

"ఎక్కటి యిట్టి దోషము
లొక్కొక్కక మరి రెండుమూడు నొదలి బెరయు దా
నక్కడు సన్నిపాతం
బక్కజముగ దనువు బాపునది జీవాత్మున్" (అశ్వ. 1-177)

కపం చేరడంవల్ల మనిషికి కలిగే నష్టాన్ని క్రింది పద్యంలో చక్కగా వెల్లడి చేయబడింది :

"స్రోతోమార్గములు కఫము
చేత నిరుద్ధంబులైన జెడునింద్రియ జా
తాతీతశక్తులు దానను
పీతములగు జేష్టితములు వినుమనుజులకు" (అశ్వ. 1-175)

శరీరంలో వాయువు చేరడంవల్ల వికారాలు కలుగుతాయట :

"వాయువంగంబులందు దుర్వ్యాప్తి గదిరి
నొవ్వుదెవులను బుట్టించు గ్రొవ్వుసెఱచ
సందు వెదలించు గ్రమమున నెందుబరగి
తనువుగ్రమానుగ జేసి జీవుని వెలార్చు" (అశ్వ. 1-176)

ఎఱ్ఱన : 'ఆరణ్యపర్వం'లో వశీకరణ ఔషధాల్ని గూర్చి ప్రస్తావించాడు. మంత్రతంత్రాల వల్లను, వివిధౌషధాలతో భర్తలు భార్యల మనస్సుల్ని లోబరుచుకుంటారని ద్రౌపది చెబుతుంది :

"అలయక మంత్రతంత్ర వివిధౌషధ భంగులజేసి యెంతయున్
వలతురు నాథులంట మగువా కడు బేలతనంబు దానమున్
గలిగిన ప్రేమయుం బొలియుగాని యొకండును సిద్ధిబొంద ద
ప్పొలతులతోడి మన్కియహిపొత్తుగ జూచు విభుడెఱింగినన్"
(అరణ్య. 5-296)

భర్తల్ని వశవర్తులుగా చేసుకోడానికి భార్యలు మందులు పెట్టేవాళ్లనీ,

అందువల్ల అనేక రోగాలు వచ్చేవట :

"మగువ యొనర్చు వశ్యవిధి మందులు మాయలు నొందుచందమై
మగనికి దెచ్చు రోగములు మానక మూకజడాది భావముల్
మొగినొనరించు నద్దురితముల్ దనచేసిన చేతలై తుదిన్
జగమునకెక్కు నిందయును సద్గతి హానియువచ్చు నింతికిన్"
(అరణ్య. 5-287)

**శ్రీనాథుడు :** "పల్నాటి వీరచరిత్ర"లో మూర్ఛనుండి తేరుకొనుటకు చేసిన చికిత్సను వర్ణించాడు. బాలచంద్రుని బొంగరం తాకి అన్నమ్మ యను వైశ్యకాంత స్పృహ తప్పి పడిపోగా కర్పూర పొడిని బాగుగా నూరి కాళ్లకు చేతులకు పూశారట, కస్తూరి గంధం కలిపి పట్టించారట.

"కర్పూర రజమును గలయంగనూరి
పదతలంబులయందు పాణులయందు
కస్తూరి గంధంబు గలిపి పట్టించి
చానలు శైత్యోపచారముల్ సలిపి
చింతింపబోకుడి చెలిలేచునిపుడు
అనుపల్కునంతలో ఆ మూర్ఛదెలిసి" (౭వ భాగం - పుట. 40)

కర్పూరం, కస్తూరి, గంధం స్పృహనుండి తేరుకొనుటకు తగిన ఔషధాలని తెలియవచ్చును.

**శ్రీకృష్ణదేవరాయలు :** "ఆముక్తమాల్యద" అను గ్రంథంలో జానపద వైద్యానికి సంబంధించిన అనేకాంశాలు కన్పిస్తాయి.

వేసవి కాలంలో శరీరారోగ్యానికి చల్లదనాన్ని కలిగించే ఆహార పానీయాల్ని తీసుకోవడం చాల అవసరం. ఈ విషయాన్నే రాయలు క్రింది పద్యంలో వివరించాడు :

"తెలినులి వెచ్చయోగిరము దియ్యనిచారులు, దిమ్మనంబులున్
బలుచని యంబళుల్చెఱుకు పాలెడసీళ్లు రసావళుల్ఫలం
బులును సుగంధి శీతల జలముల్వడ పిందెలు నీరుజల్లయు
న్వెలయగ బెట్టు భోజనము వేసవి జందన చర్చమున్నగన్ (1-81)

శీతాకాలంలో వేడివేడి పదార్థాల్ని తింటే శరీరారోగ్యానికి చాల మంచిదనే విషయం అందరికీ తెలిసిందే. అందుకే విష్ణుచిత్తుడు తన యింటికి వచ్చిన అతిథులకు శీతాకాలానికి అనుగుణమైన ఆహారాన్ని పెట్టాడట :

"పునుగులదాని నవోదనంబు మిరియంపుం బొళ్లతో జట్టి చ
య్యను నాదాలని కూరగుంపు ముకుమందై యేర్చునావం జిగు
ర్కొను వచ్చళ్లను, బాయసాన్నములు నూరుంగాయలున్ జేసుబు
క్కనునేయుం జిలుపాలు వెల్లువగ నాహారం బిడున్సీతునన్" (1-82)

మిరియాల పొడి, కషాయం శీతాకాలంలో శరీరానికి చాల మంచిది. ఊరగాయలు, పచ్చళ్లలాంటి కారపు పదార్థాలు వేసవిలో అనారోగ్యానికి కారణం కాగా అవే శీతాకాలంలో ఆరోగ్యానిస్తాయని పై పద్యం చెబుతుంది.

శరీరం ఆరోగ్యంగా ఉండాలంటే పుష్టికరమైన ఆహారం, మంచి విటమినులు కల్గిన పండ్లు తినడం చాలా అవసరమని వైద్యుల అభిప్రాయం. పండ్లను తినడంవల్ల శరీరంలో రోగనిరోధక శక్తి పెరుగుతుంది. సమతుల ఆహారం (Balanced diet) శరీరారోగ్యాన్ని కాపాడుతుంది. ఇందుమించుగా సమతుల ఆహారాన్నే రాయలు క్రింది పద్యంలో పేర్కొన్నాడు :

"పరిపక్వ సురభిరంభా ఫలంబులతోడ
దళమెక్కు పనస పెండొలలతోడ
ఘృత పిండనిభ కర్కరీఖండములతోడ
బలుదెబ్బంగుల మావిపండ్లతోడ
గోస్తన మృదుగుళుచ్ఛ స్తోమములతోడ
గప్పులేటిన వడప్రప్పుతోడ
సుమధుర స్థూలదాడి బీజములతోడ
దనుపారు రసదాడిగ నెలతోడ
బానకం బతిథులకిడ్డ దాసుగ్రోలి" (2-78)

"మంత్రపాని
బొడ్డుగోసిన కొడవలివోలె" (5-112) అను సందర్భంలో శస్త్రీ

చికిత్సను ప్రస్తావించినట్లయింది. బొడ్డు కోసేటప్పుడు మంత్రసాని వాడిన కొద వలి పరిశుభ్రంగా ఉంటుంది ఎర్రగా కాల్చి శుభ్రంచేసి ఉపయోగిస్తే ధనుర్వాతం లాంటి వ్యాధులు రావు. శస్త్రచికిత్స సమయంలో వైద్యులు శుభ్రమైన పరికరాల్ని వాడుతారు. లేకపోతే చీము పట్టి పుండై "సెప్టిక్" అవుతుంది. రాయలు క్రింది పద్యంలో శస్త్రచికిత్సనే ప్రత్యక్షంగా పేర్కొన్నారు :

"కొంగవాల్నలకు లంగళుల జట్టుక జబ్బ
లంట గుట్టెడ వెజ్జునరయువారు" (7-21)

కొంగలాగా వంకరగానున్న కత్తితో భుజాలు చీకినపుడు అంటుకొనేట్లు వైద్యుడు కుట్లు వేస్తున్నాడని భావం.

**అల్లసాని పెద్దన :** "మనుచరిత్ర"లో బ్రహ్మమిత్రుడు శిష్యులకు ఆయుర్వేదాన్ని చెబుతుండెనని వర్ణించాడు, "....బ్రహ్మమిత్రుండు శిష్యులకున్ గంటను వత్తి బెట్టుకొని యాయుర్వేద మోరంత ప్రౌఢుంజెప్పన్" (5-7).

వరూధిని పుత్రుడైన స్వరోచి బ్రహ్మమిత్రుని వద్ద ఆయుర్వేద వైద్య విద్యల్ని నేర్చుకున్నాడట.

"కాయ బాలగ్రహోర్ధ్వాంగకములు నాల్గు
శల్య దంష్ట్రి జరావృష సంజ్ఞనాల్గు
నైన యష్టాంగక ములావులార గల్గు
వైద యెనిమిది నెలల సర్వమును నేర్చి" (5-15)

షడ్రుచులవల్ల కలుగు దోషాలవల్ల వచ్చే జ్వరాది వ్యాధులకు తగిన చికిత్సను కూడా నేర్చుకున్నాడని చెప్పబడింది :

"ఇరుమూడు రుచుల దోషపు
విరసత మానన్ జ్వరాది దృష్ట్యంతంబై
పరగు చికిత్సయుగని శాం
బరి బాసి తపస్వితోడ ముదమున నంటిన్" (5-16)

ఆహారలోపం వల్లనే శరీరంలో అనారోగ్యం ఏర్పడుతుంది. అందుకే

"లంఖనం పరమౌషధం" అనే సామెత వ్యాధి వస్తే నిరాహారమే వ్యాధి నివారణమని చెబుతుంది.

ధూర్జటి : "శ్రీకాళహస్తి మాహాత్మ్యం" అనే గ్రంథంలో అచ్చమైన జానపద వైద్యాన్ని ప్రస్తావించాడు. తిన్నడు శివుని కంటికి పసరు వైద్యం, నాటు వైద్యం, గృహవైద్యం చేశాడు.

"కోక పొట్లం బావిగొన నూది యొత్తుచు
గపణోష్ఠ కరభ భాగమున గాచి
నెత్తి తంగేడాకుమెత్తి రేచకి నిమ్మ
పంటిసీరున నూటి పట్టువెట్టి
తెల్లదింటెన పువ్వు దెచ్చి ద్రదసమిడి
కలివె పువ్వులుగోసి నలచిపిడిచి
క్షీరిననేయి వెట్టి పెరుగువత్తులు వైచి
చనుబాలతో రాచి సంకు చమిరి

విన్నమందులు లాసరికన్నమందు
లడిగి తెచ్చిన మందులు నడవిమందు" (8-110)

పై పద్యంలో చెప్పిన చికిత్సల్ని గ్రామ ప్రాంతాల్లో చూడవచ్చు. ఇదే విషయాన్ని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు తమ "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"లో ఇలా వివరించారు :

"జనులు సాధారణ జాడ్యాలకు చికిత్సలు కొంతవరకు తెలిసియుండిరి. నిన్నమొన్నటివరకు ప్రతి గ్రామములో కొందరు ముసలమ్మలు వాము, మిరియాలు, దుంపరాష్ట్రము పిప్పళ్ళు, సొంటి మున్నగునవి మూటగా కట్టియుంచుకొనెడివారు తులసిచెట్లు చాలా యిండ్లలో నుండెడివి. వాటి రసము జ్వారాలకిచ్చెడివారు ఇంకా కొంత తెలిసినవారు దుప్పికొమ్ము, గోరోజనము, కస్తూరి కుంకుమపువ్వు, వైష్ణవి, భైరవి మాత్రలు ఉంచుకొనెడివారు గడ్డలకు గోధుమపిండి యుడికించి కట్టిరి. నెత్తి నొప్పులకు గుళకరాళ్ల ఆవిరి యిచ్చిరి. నొప్పులకు వేపాకు మున్నగునవి కాచికాక తీసెడివారు " (పుట. 284)

"వేకివెచ్చనియైన వెచ్చని మందుల
గాదె మానునట్లు గంటికిక
గంటికంటె మందుగలదె ముక్కంటికి" (8-114) అనే పద్యంలో "ఉష్ణం ఉష్ణేన శీతలం" అన్న ఆరోగ్య సూత్రం ఇమిడి ఉండడమే గాక కన్ను తొలగించి దాని స్థానంలో మరో కన్ను అమర్చడం నేటి అవయవ మార్పిడికి సంబంధించిన శస్త్రచికిత్స వంటిదని భావించవచ్చు.

**తెనాలి రామలింగడు :** 'పాండురంగ మాహాత్మ్యం'లో గృహవైద్యానికి సంబంధించిన అంశాల్ని పేర్కొన్నాడు.

"గోర్వెచ్చ చమురంటు కొనిరి మస్తకముల
జలకమాడిరి నిశామిళితవారి" (8-74) అనే పాదాల్లో తలంటు స్నానం వేడిని తగ్గించి ఆరోగ్యాన్ని కాపాడే వైద్యసూత్రం ఇమిడి ఉంది.

"నింబ ప్రవాళ మాల్యంబులు వైచిరి" (8-74)

వేపమండల మాలను ఇంటికి తోరణంగా కట్టారట. వేపచెట్టుకు హిందూ సంప్రదాయంలో ఒక విశిష్ట స్థానం ఉండడానికి కారణం అది సర్వరోగనివారిణి కావడం. గ్రామ దేవతల పండుగల్లో వీటి విని యోగం ఎక్కువ. మారి మశూచిలాంటి భయంకర వ్యాధులకిది ఔషధం. వేప చెట్టులోని ప్రతి భాగం ఔషధంగా పని చేస్తుందని ఆయుర్వేద వైద్యుల అభిప్రాయం. బాలెంతలకు కూడా వేపాకు రసాన్ని పూసి స్నానం చేయిస్తారు.

**రామరాజభూషణుడు :** 'వసుచరిత్ర'లో ఔషధ రస ప్రస్తావన కన్పిస్తుంది.

"పిడుగుకైవుదు పెట్టు తడకట్టగా బయో
ధి మహౌషధి రసంబు చముదెననగ" (5-86)

మరోచోట

"మున్నీటిపెన్నీటి ముదురం బిల్వల యల
జడికి బచ్చెజోడు దొడిగెననగ" (5-86) అంటాడు.

గరుడపచ్చలు ధరించాడని చెప్పాడు. గరుడపచ్చలు ధరించిన వానికి సర్ప విష భయం ఉండదని ప్రసిద్ధి.

**నంది తిమ్మన :** "పారిజాతాపహరణం"లో సత్యభామ కోప గృహంలో ప్రవేశించినప్పటి వేషధారణను "వాసెన కట్టుగట్టి నిడువారికి కస్తురిపట్టవెట్టి" (1-99) అని వర్ణించాడు. తలనొప్పి వస్తే పట్టువేయడం ఈనాటికి కనిపించే గృహవైద్యం.

**పాలవేకరి కదిరీపతి :** "శుకసప్తతి"లో ఎరుకలసాని వేషాన్ని వర్ణిస్తూ

"ముంజేతులను మఖాలు జమునొక వింత
పొలుపు దెశ్పెడు పచ్చబొట్టులెసగ" (1-99) అని అంటూ

'పచ్చబొట్టు'ను ప్రస్తావించాడు. పచ్చబొట్టు పొడిపించుకోవడంలో వ్యాధి నిరోధక చికిత్స లేదు. పచ్చబొట్టు పొడిపించుకొనడం నేటి "ఆక్యుపంచర్" వైద్యచికిత్స లాంటిది. సాధారణంగా మానిపోని నొప్పులకు పచ్చబొట్టు పొడిపించుకొనే ఆధారం కనిపిస్తుంది.

**అయ్యలరాజు నారాయణకవి :** 'హంసవింశతి'లో వైద్య విధానంలోని రకాల్ని, వైద్యుల వేషధారణ, భూతవైద్యం, స్త్రీవశీకరణ ఔషధం, ఆయుర్వేద వైద్యం మొదలైన వాటిని గూర్చి ప్రస్తావించాడు.

వైద్యులు "నరవైద్య, గజవైద్యాశ్వవైద్య పశువైద్య" (5-88) అని నాలుగు విధాలుగా ఉంటారట. ఆయుర్వేద వైద్యుని వేషధారణ వర్ణించబడ్డ విధాన్ని చూడుడు :

"మెలివడు తీగచుట్ల జిగిమించిన పాగ జినుంగుపచ్చడం
బలవడు చల్వదోవతి యొయారపు గందపుబూత దొల్లు పో
గులు మణిముద్రికల్ వలపు నెడు విద్యము చంక వ్రాత మా
ప్రముల తుదముచ్చెలున్ వెలయగుప్త (?) బుడుడు వైద్యుడొప్పగన్"
(1-282)

భూతవైద్యుని వేషధారణ, భూత చికిత్సలో గల నైపుణ్యాన్ని వర్ణించడం జరిగింది :

"భూతియు గావిబొట్టుపై బూనిన మూల్కెలు జొక్కు కత్తె మలీ
చేతగడెంబు దాయెతుల జేర్చిన మందు మంత్ర తంత్రకో

పేతపు నాగబెత్తముఁ బెట్టెలు నొప్పగ రౌద్రకర్ముడన్
భూత చికిత్సకుం డొకడు పొల్పుగ నచ్చట నుండుమానిని" (8-62)

పిశాచాలూ, దయ్యాలూ, భూతాలు, దుష్టగ్రహాలు భూతవైద్యుని చూచి నంతనే పారిపోతాయట :

"పైగాలిసోకిన బాలు పిశాచక
తండంబులెల్లను దల్లడిల్లి
పొలకువ గనుగొన్నబోవు దయ్యంబుల
విసరముల్ భీతిచే విస్తరిల్లి
పేరు విన్నప్పుడే దూరమై చను భూత
చయములు దిగులున సరభసిల్లి
తొడరి నిల్చిన యంత దొలగు దుష్టగ్రహ
ప్రచయముల్ భయమున బరిభవిల్లి

యలుకు నారౌద్రకర్ముని కరముసోక
ప్రేత బేతాళ మోహినీ పిశితభోక్తృ
కావినీ శాకినీ ఢాకినీ మదాంధ
భయద బ్రహ్మ రాక్షసుల్ పల్లటిల్లి" (8 63)

ఎట్టి దుష్టగ్రహమైనా భూతవైద్యుని తలంచినతో పారిపోవునట :

"క్రూరగ్రహ ఘోరగ్రహ
చారగ్రహ కూర్మశాక చంద్రిగ్రహకా
భేరి గ్రహాంతరగ్రహ
వారి గ్రహములును బోవువాని దలంపునన్" (8-64)

దయ్యం పట్టిన వ్యక్తికి విభూదిపెట్టి యంత్రములుగట్టి భూతవైద్యుడు చికిత్స చేశాడని చెప్పబడింది :

"భూతకాపును జుట్టి విభూతిపెట్టి
యంత్రములు గట్టి వెఱవకుమనుచు దట్టి" (8-122)

స్త్రీని వశం చేసుకోవడంలో ఉపయోగించే ఔషధాల్ని, వశీకరణౌషధాల్ని తయారుచేయడంలో ఉపయోగించే వస్తువుల్ని పేర్కొనడం జరిగింది ;

"ఇంద్రగోపంబు రోచన మెట్టలు వెలి
గారము జంత్రమణములు నీరుఁగొబ్బి
విత్తనాల్ పుట్టపండు రసోత్తరముగ
నూరి మదువున బెట్టిన నారివలచు" (6-129)

"నల్లేరు కణికగంధము తేనె వగనూరి
లేపించి కూడినలేమ వలచు
గరక తాండ్ర యుసిరికలు కోష్టు పాలచే
నూరిపట్టించిన నారిచేరు
వెలిగారమును నెల్లవిసె పూలు నిజ తనూ
జలముల నూరిడ్డజెలియ కలియు
గలుగొట్టు నీరావు కాల్మడిచే నూరి
విడెములో దగిలింప వెలదిభిక్కు

గూర్మి జిల్లేడు దూదిని గోళపండ
సఖునమేదించి వత్తిగా జక్కజేసి
కుసుమ నూనెను దీపంబు పొసగబెట్టి
చూప లోనౌదు రెటువంటి సుదతులైన (6-130)

"జాజికాయలు జాపత్రి చారపప్పు
సెనగ లనుములు గసగసల్ మునగపువ్వు
మదన విత్తులు కొచ్చెర మందపాల
నూరి త్రాగిన మదమబ్బు జేరువేళ" (6-131)

స్త్రీకి వశీకరణ ఔషధంలాగా మగవాన్ని లోబరచుకోవడానికి మర్దుమందు పెడతారు. ఆ మందు తీసుకున్న వ్యక్తి ఆ స్త్రీ చెప్పినట్లుగానే వింటాడు. ఆమె చెప్పినట్లే నడచుకొంటాడు. మర్దుమందు ఎలా తయారుచేస్తారో క్రింది పద్యంలో చక్కగా వివరించబడింది:

"గంబూరమును జాజికాయలుమ్మెత్త వి
త్తులు మర్దుమాతంగి కలువగడ్డ

పచ్చయెన్నులు కోష్ఠు పచ్చికమంచేను
    గుమతము గుళ్ళ సున్నము రుద్ర
జడవేరు వస ఖురాసాని వామముపుడు
    కలపోలుగాడు మైగారుచెమట
సీరావుగజ్జలచేరిన మష్టును
    గాల్మడి జాతంటుగాను నూరి
కలయ గురిగింజలంతేసి గుళికలమర
జేసినీడనె యారించి తీసి దాచి
యున్న మందింత మడుపుతో నొసగెనతని
కధికతర మోహమూన నాహంసయాన" (5-152)

మద్దమందు పెట్టిన వ్యక్తి ఎలా ఉంటాడో, దాని మహిమను వెల్లడిజేసే విధం చూద్దాం:

"ఘటజాళి మందు మసగొని
ప్రూల్చిడ తన కండ్లు గట్టినట్లుండు నతం
డేబుద్ధి లేక యచ్చెలి
సోబ్గెలకెద జిక్కిచిక్కి చొక్కుచు దిరుగున్" (5-163)

రెండవ ధన్వంతరి అనదగిన గుప్తసుబంధను వైద్యుని చాతుర్యాన్ని వర్ణిస్తూ ఆయుర్వేద వైద్యానికి సంబంధించిన మందులను పేర్కొనడం జరిగింది:

"అశ్వగంధాది ఘృతంబును, నైలేయక ఘృతంబును షట్పల ఘృతంబును, దూర్వాది ఘృతంబును, పంచగవ్య ఘృతంబును, నార్ద్రిక ఘృతంబును, గదళీకంద ఘృతంబును, గల్యాణ ఘృతంబును దండులీయక ఘృతంబును, గూశ్మాండ ఘృతంబును మొదలైన ఘృతంబులు సేయనేర్చును .... .... ....
.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... ....
సూత్రస్థాన శారీర నిదాన శాస్త్రంబుల పరిచితియును డెబ్బదిరెండు నాడి భేదంబులును వాత పైత్య శ్లేష్మంబు లుల్బణంబులైన తిశతషష్టిరోగంబులకు దత్తచ్చికిత్సలు చేయ చాతుర్యంబును గలిగి రెండవ ధన్వంతరి యనంబరగు నతడు" (1-234) అంటూ ఆయుర్వేదంలోని తైలాల్ని, చూర్ణాల్ని, రసాయనాల్ని, దివ్యౌషధాల్ని వివిధ భస్మాల్ని పేర్కొనడం జరిగింది. ఆయుర్వేద వైద్యాన్ని

తెలుగు సాహిత్యంలో ఇంత విపులంగా చర్చించిన కవి మరొకడు లేడని చెప్ప వచ్చు.

**గౌరన:** "నవనాథ చరిత్ర"లో పశువులకు వచ్చే వ్యాధులు, వాని నివారణా విధానం చెప్పబడింది:

"మసలక వెడలంగ మందులువెట్టి
పసరంబు ప్రాణంబు పసనుగా గాతు"

"నరుదు కన్నును నీరు నాలికచేర్లు
గురుదెవ్వులును గంటికురుమ కట్టూర్పు
కప్పునావురు గాలికజ్జి పరేతిక్క
పుప్పి పంపరయీడు బొడ్డుబొల్లాత
మొలవిడె స్రుంతెవుల్ ముకుబంత్రి కవట్టు
తలయేరు తొడుకువా తముకల్లవాప్పు
నలటొబ్బ తెవులును నాదిగానెన్న
గలపసరాల రోగములకు నెల్ల
మందులు బెట్టను మంత్రంపవెవులు
కందువుగని చూడగా నేర్తు నొప్ప
.... .... .... మరిపుండుగంటైన
ఘాటించి ఘోరమేకంబులు పట్టి
కటచిన ప్రాణంబు గలిగిన జాలు
నెఱవుగా బ్రతికింప నేరుతు బసుల
బసులపాపల జ్వరభారపీడితుల
కెసరు రోగంబులు నిర్ణించుకలింక
వారికి గానని వారికి నాడు" (1 - పుట. 88, 89)

చిగురుగండెలు గాలపు జివ్వవెదురు
లాదియగు సాధనంబులు సలవరించు
కొని హటాహుటీసడలతో బిసుగులెల్ల
గదిసి నడచిరి యమ్మహీ కాంతు సఖిత (1-250)

హలాంకుడను రెడ్డి గృహాన్ని వర్ణించే సందర్భంలో ఇంట్లోని పరికరాల్ని, ఇంటి పరిస్థితుల్ని చక్కగా కళ్లకు గట్టినట్లు వర్ణించాడు :

"అచ్ఛమైవాకిట రచ్చబూఱు మెఱుంగు
పంచతిన్నెలు గొప్పపారిగోడ
కంపతెట్టులును రాకట్టు ముంగిలిమట్టె
సాతెదేవర యఱుచవికె యొకటి
కోళ్ళగూండ్లును గొడ్లు కుఱుగాడి (యేడికో
లలు) కాడిపలుపులు గలుగు నటుక
దూడలు పెనుమూవకోడెలు కుఱుకాడి
గిత్త లీనినమేటి గిడ్లదొడ్డి
యిఱుకుఱ్ఱమాను పెరంటిలో నెక్కుఱావి
మునగలును జొంపపెనువామి (జనుము) రుబ్బు
ఱోలు పిడుకల కుచ్చెలు దాగిగుంత
దనర నిరంతంబు వెలయు నాతనిగృహంబు" (2-408)

ఏలా నగరంలోని గోపాలుడను శిష్టభక్తుని ఇంటిని వర్ణిస్తూ గోపాలుని పనిముట్లను పేర్కొన్నాడు :

"పులుల వాకట్టు మందులు పాముబదనిక
ల్పొదుచు చేపుడు మంత్రములునుగోడె
దామెన పగ్గము త్రాళ్ళు నురిత్రాళ్ళు
చిక్కంబులును జల్లి చిక్కములును
మాఱుమానిషిగన్న దూఱువేపుల జోళ్ళు
కొలికి చెప్పులు జమ్మిగూడలలతి
పిల్లగోవులు నెక్కవెట్టిన విండ్లు కం
బళ్ళు దుప్పట్లును వల్లెత్రాళ్ళు
మొదలాగాగల పరికరంబుల" (2-546)

**అయ్యలరాజు నారాయణకవి:** తన "హంసవింశతి"లో గానుగవాళ్ల, కుమ్మరి, జాలరి, రైతు గొల్ల, కంసాలి, సాలె మొదలైనవాళ్ల వృత్తులకు సంబంధించిన పనిముట్లను పేర్కొన్నాడు

ఫణిహారుడను గానగవాని ఇంట్లోని వస్తువుల వర్ణన :

"గానుగ కడెంబు మోకులుగడ్డపాఱ
కాడిసిద్దెలు గూటంబు కడవజల్లి
గంప కనుగంత తక్కెడగట్టి యెద్దు
చుట్టు చవికెయు సర్వవస్తువులు దనర" (5-205)

చక్రదాసుడను కుమ్మరివాని పనిముట్లు :

"సలుప కడవరాయి సారె కలాసంబు
కట్టె యిసుము జల్లికడవ మల్లు
మంటిముంత గుబ్బమాను నావంబుసు
మన్నుమోయ బోతు మలయుచుండు" (5-9)

జాలరి సాధనాల్లో మొదట పడవల్ని పేర్కొన్నాడు :

"ఈదుకొయ్యలు, తెప్పలు సీదుకాయ
లరద లరికోళ్లు పడవలు తరులుపుట్లు
చేపడవ లోడలాదిగా జెలగునట్టి" (4-182)

"కొడమ తిట్టడ్డ కొడమ ద్రొబ్బుడు పటంబు
బాపయెత్తెం గూడయు జల్లిగూడ
బుంట గాలంబు తెరదీము బుసురుగాల
మొసుకు గొరకు పుణుకు సౌక్యలెసగుచుండు" (4-184)

అంటూ పనిముట్లను చెప్పి పిమ్మట వలల్లోని రకాల్ని వర్ణించాడు :

"మెడవల సన్నపువల త్రో
పుడువల డొంకవల మింటు ముక్కిడివలదా
టుడువల సింగిత మనుకువ
లెడవల కుండెవల లాదు లెసగెడి వలలున్" (4-185)

కృషీవలుని ఇంటి వర్ణనలో రైతుల పనిముట్లను పేర్కొన్నాడు :

"దేవర చవికె పందిరి కోళ్లగూడులు
గొఱ్ఱు గుంటక కాడి గొడ్లపల్పు
లట్టువగల కాడి కొట్టఁబు పలుగాడి" (4-124)

గొల్లవాని గృహవర్ణనలో గొల్లల పరికరాల్ని పేర్కొన్నాడు :

"కంబళి తలదుడ్డు కవ్వము మజ్జిగ
బాన గొడ్డలి నుచ్చుప్రాతలగుడి
కావడియుట్లు చిక్కము సందికడియంబు
సూకలతోప పొగాకు తిత్తి
బొప్పి మజ్జిగముంత బొటమంచి పిల్లల
గూడు దామెనత్రాడు కోతకత్తి
తోర్పుగట్టెయు జలచుబ్బ చిల్కుడుగుంజ
పూజబిందెలు వెన్నపూసచట్టి
పొలబుడిగలు వడిసెల ప్రాతమెట్లు
మలప మందుల పొడిబుఱ్ఱి మన్నెముల్లు" (2-75)

మణివరమనేటి పురంలో నున్న కంసాలి వాని పరికరాల వర్ణన :

"కమటము కట్లసంచి యొరగల్లును గత్తెర సుత్తెచీర్ణముల్
ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారు కా
ణ్ణము పటకారు మూషలువాణె పరీక్షల మచ్చులాదిగా" (2-181)

నేత వృత్తిగా గలవాళ్ల పనిముట్లు ఇలా ఉన్నాయి :

కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గఁబు
పంటె త్రొక్కుడుపట్టె పలకదోనె

పరిపరి యచ్చులు చరికుండ యూదిత
        చీడు దబ్బలు దండెనాడెక్రోవి
కోతిపుల్లలు నాల్కా కుదతరి కొయ్యలు
        జొప్పయూచలు గోత చూఱకత్తి
కారంపు బడుగులు గండెలకప్పెర
        గోలెము లాకలు నీలికడవ

గంప డొల్ల కలాసంబు కదురు చెమికె
నూలుఱాట్నంబు జాలంబు గ్రాలుగోడ" (2-11)



# జానపదుల వాద్యాలు

శ్రీనాథుడు 'పల్నాటి వీరచరిత్ర'లో యుద్ధ సమయంలో ప్రయోగించే వాద్యవిశేషాల్ని ప్రస్తావించాడు. బ్రహ్మనాయుడు కార్యమపూడి యుద్ధరంగానికి బయలుదేరినపుడు,

"నాయుడు రాజులు నయముతోచనగ
ముందు డమాయిలు మురజసంఘంబు
బూరలు భేరీలు పోటుధారలును
కాహళ వంకిణి కాలికొమ్ములును
శంఖ సమూహంబు సన్నాయిజోళ్ళు
మురళిచయంబును, ముఖవీణవితతి
నరగలు తప్పెటల్ నయమైనడోళ్ళు
తమ్మటమ్ములు నెంచదగు వీరణములు
ఘనమైన రుంజలు కకకతప్పెటలు
బేగంటలును మరి చిరుగంట చయము" (2వ భాగం - పుట. 8)

మొదలైన వాద్యాలు వాయిందారట.

**శ్రీకృష్ణదేవరాయలు :** 'ఆముక్తమాల్యద'లో మాలదాసరి చండాలికను మీటాడని వర్ణించాడు :

"చండాలేతర శీలుడుత్పులకితుడై చండాలి కన్మీటుచున్" (6-7)

మరోచోట,

"మృదంగంబు పొంగం బావజంబుదండె తాళంబురుమ కిన్నెర సన్నగాళె వీణె ముఖవీణ ప్రాసే గ్రోలు డోలు మౌరి భేరి గౌరు గుమ్మెట తమ్మెటంబు డుక్క దక్కి చక్కి చయ్యంకి లోనగు నసంఖ్యాతవాదిత్రత్రితయ పరంపరలు మొరయ" (4-85) అంటూ మూడు రకాల వాద్యాల ప్రస్తావన కన్పిస్తుంది.

**పాలవేకరి కదిరీపతి :** 'శుకసప్తతి'లో భేరి, మృదంగం, శంఖం, జమలిక మొదలైన వాద్యాల్ని ప్రస్తావించాడు :

"భేరీమృదంగ శంఖానకపణవములు మ్రోగ
దస్తవార్భటుల దిక్తటము లద్రువ" (1-254)

"వచ్చి జమలిక వాయించి వరసతోడు" (2-415)

**పెద్దపాటి ఎఱ్ఱనార్యుడు :** "మల్హణ చరిత్ర"లో మల్హణ పుష్పగంధులు వాయించిన వాద్యవిశేషాల్ని ప్రస్తావించాడు :

"స్వరమండలంబును జంత్రంబు నొకవేళ
నింపుమీఱంగ వాయించుచుంద్రు
కిన్నెర వీణెయు గేలమై నొకవేళ
మ్రుట్టి చూతురు జగన్మోహనముగ
సొంపుదండెలు శ్రుతిగూర్చి యొకవేళ
పదములు జిందులు బాడుకొంద్రు" (ప్రథమ - పుట. 20)

**అయ్యలరాజు నారాయణకవి :** "హంస వింశతి"లో జానపదులకు సంబంధించిన అనేక వాద్యాల్ని పేర్కొన్నాడు :

"డమరు పురబిడ్డ మరుసహచర భయదఢక్కా హుడుక్కారవబాను కలహ పటహ తమ్మటావ ఙనిస్సాణ ఝల్లరీ మర్దళము రజషణాతుత్తుంబిక జర్ఝరీ పాశక్రోశక్రోలు మోరీ భేరీలును డోలు గౌరు గుమ్మెతమ్మెట వీరణ యురుము యొంటికంటి యురుమపంబ జిమిడిక తప్పెట గిడిబిడి తుడుము చక్కి చుయ్యంకి యును దాళ మహోత్తాళంబులును జేగంట చిటితాళంబులు జిటికెలు ముఖవీణ శంఖ కాంస్య శృంగకాహళంబులును సన్నెగాళన పీరు కరకొమ్ము నాగస్వరముమ సుతిబెంగు చేసన్నాయి సింగినాదము పిల్లగ్రోవిమ్రోలు బీకలును వీణ రుద్రవీణ స్వయంభువీణ మనోహరవీణ నారదవీణ, బాణవీణ సరస్వతీవీణ స్వరమండలంబు తంబుర రావణహస్తంబు రవాలుగిన్నెర టిపిరికిన్నెర సిద్ధకిన్నెర దండె

మొదలైన హృద్యానవద్య విశేషంబులు దిక్కులు పిక్కటిల్ల". (8-29) ఇన్ని వాద్యవిశేషాల్ని తెలుగు సాహిత్యంలో మరొకరు పేర్కొనలేదనవచ్చు.

శివదత్తయోగి వెంట శ్రీశైలమునకు బయలుదేరిన భక్తబృందాలు వివిధ వాద్యాల్ని వాయిస్తూ వెళ్లారట :

"గుమ్మెతల్ కిన్నరల్ గూడివాయించుచు
బైరవంజోగి వెంబడినెకదల
బసవగంటలు బృహత్పటు శంఖములు మ్రోయ
శివరాత్రి జంగాలు చేరికొలువ" (8-189)

మరోచోట సుద్దుల గొల్లల వాద్యాల్ని ప్రస్తావించాడు :

"కొమ్ముల్ పీరణాలు జిగిగుల్కెడు" (2-87)

"ఫెళఫెళ పీరణాల్ ఖిళిపెళి వాయించి
పాటుపో గొమ్ములు నాటనూది" (2-89)

# జానపదుల ఆభరణాలు

**తెనాలి రామలింగడు :** 'పాండురంగ మాహాత్మ్యం'లో నిగమశర్మ తన భార్య నగల్ని దొంగిలించుకొని పోయాడని వర్ణిస్తూ వివిధ ఆభరణాల్ని పేర్కొన్నాడు :

"గోమేధి కోపలాంకూర మానితములు
పుష్పరాగచ్ఛటా పుంఖితములు
వైడూర్య సంధాన వర్ణనయంబులు
హరినీల కీలనాఢ్యంచిత ములు
కురువింద సందర్భ గురుతరంబులు చతు
ర్వీథ వజ్రదళ సమావేల్లితములు
ఘహనీయతర హరిమన్మణి పరీతంబులు
సకలుషస్థూల మౌక్తిక యుతములు
పద్మరాగ పరీరంభ భాస్వరములు
దండ విద్రుమకృత సముద్గక భృతములు
మాత్తుభూషలు నత్తికామండనములు
నిజయువతిదాల్చు సొమ్ములన్నియు హరించి" (8-48)

**పాలవేకరి కదిరీపతి :** 'శుకసప్తతి'లో హాలాంకుడను రెడ్డి భార్య ధరించిన ఆభరణాల్ని ఇలా వివరించాడు :

"తిరునాళ్ళకై పోయి తిరుపతిలో గొన్న
నొక్కు పూసంబేరు టెక్కుసూప
జికుందనము గూర్చి మగడు చేయించిన
మెఱుగు కమ్మలు వింతయొఱపు నెఱప
దనుజూడవచ్చుచో దల్లితెచ్చిన యట్టి
యట్లిక నానుసోయగ మెసంగ

మొదటి కోడలిదంచు మదినత్త యిచ్చిన
చుట్టు మెట్టెలజోడు నొంచునింప
గడియములు కెంపురవల యుంగరము వెండి
కుప్పె సౌరంబు కుఱుమాపుకునలమ్మ" (2-411)

పై పద్యంలో జానపద స్త్రీల ఆభరణాల్ని సహజ సుందరంగా పేర్కొన్నాడు.

చాకలి వనిత ధరించిన ఆభరణాల్ని క్రింది పద్యంలో వివరించాడు :

"మినమిన లీనుమేను నెఱమించుల కొంగెపుటంచు గమ్మలుం
గొనబగు ముద్దుమోము సమకొన్ని మెఱుంగుల కట్లదండయు
గనుగవగల్గు తేటి యొడికంబును సందికడెంబు మించిన
వ్వనిత యువాంతరంగ మృగవాసరయై మొలంగు న్గృహంబునన్"
(8-105)

**అయ్యలరాజు నారాయణకవి :** "హంస వింశతి"లో తొగట స్త్రీ మంత్రసానికి వివిధాభరణాల్ని ఇస్తానని అంటుంది :

"నవరత్నముల కమ్మల నిత్తు
నవినీకు మనసు రావంటివేని
యాణిముత్యమ్ముల హారమ్ము లొసగుదు
వానిపై నీకిచ్ఛ పూనదేని
గరుడ పచ్చలకీలు కడియంబు లర్పింతు
నందుకు నీయాస చెందదేని
తళుకు గెంపుల సంది దండలు చెల్లింతు
వానిపై నీబుద్ధి యానదేని
నూనకము తీగ మెడనూలు నొసగునాను
గుండ్లపేరును గైకొన్క కోరిసేతు" (2-37)

మణివర పురములోని కంసాలి భార్య ధరించిన ఆభరణాల్ని చూడుడు :

"కుపె రాగిడిబిళ్ల కుంకుమరేఖ పా
పట బొట్టు కమ్మలు బావిలీలు

లలిసూర్య చంద్రవంకలు సూసకము కెంపు
రవల పల్లెరు బూపు రావిరేక
బుగడలు నాను గ్రోవులు దీగ మెడసూలు
కుంతికంటు సరిపెణ గుండ్లపేరు
సరిగె ముక్కెర బన్నసరము నుత్తండాలు
కంకణంబులు కట్లు కడియములు
సందిదండలు నొడ్డాణమందమై
ముద్రికలు హంసకంబులు మ్రోయుగజ్జె
లలరు బొబ్బిలికాయలు గిలుకుమట్టె
లాదియగు సొమ్ము దాల్చి యయ్యబల మెఱయ" (2-190)

ఇంచుమించుగా స్త్రీలు ధరించే ప్రతి ఆభరణాన్ని పై పద్యంలో పేర్కొన్నాడు.

**పెదపాటి ఎఱ్ఱనార్యుడు :** "మల్హణ చరిత్ర"లో పువ్వుగంధి రత్న కంచుకం, ఒప్పుల పెండెము, వజ్రాల, ముత్యాల ఆభరణాలు ధరించిందట :

"ఉరమున రత్నకంచుకము నొప్పుల పెండెము వజ్రమౌక్తికా
భరణములుం ధరించి" (2 ఆ. - 87వ పుట.)



# జానపదుల ఆహారాలు

మనిషి ఆహారపుటలవాట్లు పరిస్థితుల్నిబట్టి, కులాన్నిబట్టి భిన్నంగా ఉంటాయి. మనిషి నివసించే ప్రాంతంలో పండే పంటల్నిబట్టి, లభించే ఆహార పదార్థాల్నిబట్టి మారుతూ ఉంటాయి. జొన్నలు ఎక్కువగా పండే ప్రాంతంలో వాటి వినియోగం ఎక్కువగా ఉంటే, బియ్యం ఎక్కువగా పండే ప్రాంతంలో బియ్యం వినియోగం ఎక్కువగా ఉంటుంది. ఇలాగే మిగిలిన ఆహార పదార్థాల అలవాట్లు ఉంటాయి. కులాన్నిబట్టి కొందరు కొన్ని ఆహార పదార్థాల్ని తినడం తినకపోవడం జరుగుతుంది. ఆర్థిక పరిస్థితులు కూడా ఆహారపు టలవాట్లపై ప్రభావాన్ని చూపుతాయి. మాంసాహారులనీ, శాకాహారులనీ ప్రధానంగా మనకు రెండు వర్గాలు కన్పిస్తాయి. తెలుగు సాహిత్యంలో ఆహార పదార్థాల ప్రస్తావన కొందరు కవులు చేయడం జరిగింది.

శ్రీనాథుడు : "హరవిలాసం"లో వంట చేసే విధానాన్ని వర్ణించాడు :

"వంట చెఱకులు లేకున్నవాము లైన
వస్త్రములు తైలమున ముంచి వహ్నిగూర్చి
వంటకంబులు వండి యవ్వారిగాగ
బెట్టు శివభక్త తతికి నంబిప్రభుండు" (2-81)

సిరియాలునికై మేనమామ తెచ్చిన ఆహార పదార్థాల వర్ణన :

"పల్లియ చోటనుండి యెలప్రాసగు టక్కులు జక్కిలంబులున్
బెల్లపు టచ్చులున్ సెనగబేడలు జిమ్మిల నువ్వులుండలున్
బెల్లుగ నంబి వియ్యములు పెద్దటికంబు ప్రియంబు నొప్పమే
నల్లునకుం గుమారసిరియాలు నకుంగొని తెచ్చిరర్మిలిన్" (2-92)

తల్లిదండ్రులు తమ పుత్రుడగు సిరియాలుని చంపి వండిన విధానాన్ని ఇలా వర్ణించాడు శ్రీనాథుడు :

"మిరియము నుల్లియున్ బసుపు మెంతియు నింగువ జీకరంబు శ
ర్కరయును జింతపండును గరాంబువు గమ్మని నేయి తైలమున్

వెరుగును మేళవించి కడు బెక్కువిధంబుల బొక శుద్ధివం
టిరి సిరియాలునిం గటిక డెందమునం దరళాక్షులిద్దఱున్" (2-121)

షడ్రసోపేతంగా వంట వండినారని క్రింది పద్యం వెల్లడి చేస్తుంది :

"కమ్మగా గాచిన కట్టునం జుళ్ళను
సిరు వెళ్ళగ నొత్తినేతవేచి
చెక్కగా దఱిగిన సన్నమాంసంబులు
పరిపాటియై జుట్టు బదనవండి
ముల్లుటెమ్ములతోడ ముదకగా కుండగ
జాదు చేసిన నల్ల చారుగాంచి
వలయు సంబరాలు వడియాలు బలియించి
దళమైన క్రొవ్వుతో దాలిబోసి
షడ్రసోపేతములుగాగ చతురభంగి
నమృత పాకంబులుగాజేసి రాక్షణంబ" (2-122)

మాంసాహారాన్ని వండిన విధం రమణీయంగా వర్ణించబడింది.

'పల్నాటి వీరచరిత్ర'లో శ్రీనాథుడు పేర్కొన్న ఆహార పదార్థాలు :

"పెక్కు విధంబుల పిండివంటలు
పరమాన్నము మంచి పప్పుకూరలును
పానకంబులు జున్ను పచ్చళ్ల నెయ్యి
ఖండశర్కర తియ్య కందగడ్డలు" (1వ భాగం - పుట. 5)

శాకాహారాల్ని ప్రస్తావించాడు పై పాదాల్లో.

**వల్లభరాయుడు :** "క్రీడాభిరామం"లో ఆనాటి పూటకూళ్ల యింట్లో వండే ఆహార పదార్థాల్ని పేర్కొన్నాడు :

"కప్పురభోగివంటకము కమ్మని గోధుమ పిండివంటయున్
గుప్పెడు పంచదారయును క్రొత్తగా గాచిన యాలనేయ పెస

ర్పప్పును గొమ్మనల్లనటిపండ్లును నాలుగునైదు నంజులున్
లప్పలతోడ గ్రొంబెసగు లక్ష్మణ వజ్జలయింట రూకకున్"
(166వ పద్యం)

**శ్రీకృష్ణదేవరాయలు:** "ఆముక్త మాల్యద"లో వివిధ ఆహార పదార్థాల్ని పేర్కొన్నాడు.

విష్ణుచిత్తుడు వైష్ణవ భక్తులకు పెట్టిన ఆహార పదార్థాలు ఇలా ఉన్నాయి:

"గగనము నీరుబుగ్గకెనగా జరివట్టిన నాళ్ళ కార్యకన్
పొగ సొరకుండ నారికెడపుం బొటియల్లవిలించి వండన
య్యగపల ముంచిపెట్టు గలమాన్నము నొల్చిన ప్రప్పు నాలుగే
న్పొగపిన కూరలు న్వడియముల్వగురుత్పెరుగు ఘృతప్లుతిన్"
(1-80)

వేసవి కాలంలో భక్తులకు పెట్టిన ఆహార పదార్థాలు:

"తెలిమలి వెచ్చ యోగిరము దియ్యనిచారులు దిమ్మనంబులున్
బలుచని యంబళుల్చెఱుకు పాలెడనీళ్ల రసావళుల్ఫలం
బులును సుగంధిశీతజలము ల్వడపిందెలు వీరు జల్లయు
న్వెలయగ బెట్టు భోజనము వేసవి జందన చర్చమున్నుగన్"
(1-81)

శీతాకాలంలోని ఆహార పదార్థాల్ని ఇలా వర్ణించాడు:

"పునుగుం దావి నవోదనంబు మిరియంపు బొళ్లతో జట్టి చు
య్యను నాదాలని కూరగుంపు ముకుమందై యేర్చు నావంజిగు
ర్కొను పచ్చళ్లను బాయసాన్నములు నూరుగాయలున్ జేపుబు
క్కను నేయుం జిఱుపాలు వెల్లువగ నాహారం బిడున్సీతునన్"
(1-82)

విష్ణుచిత్తుడు మధుర యాత్రకు పోతూ తమ వెంట తీసికొనిపోయిన వంటకాలు ఇలా ఉన్నాయి:

"భక్తి ద్రోవకు సాధ్వపరికరంబులు వెట్టి
కట్టిన పొరివిళం గాయగమియు

నెసటి పోతలుగాగ నేర్చినించిన చిరం
తనపు కాలక్షేమ తండులములు
వడిబెట్టిలో జొకడము సాబాలూన్వ
జెలగు సంచారంపు జింతపండు
పెల్లు లోహండి కావళ్ల కొమ్ములవ్రేలు
గిడ్డిమొత్తపు నేతిలడ్డిగలును
బెరుగు వడియంబులును బచ్చివరుగుబేడ
లరుతరాచ్యుత పూజోపకరణపేటి" (2-97)

వేసవికాలంలో బ్రాహ్మణులు భుజించే ఆహారము లిట్లున్నాయట :

"పరిపక్వ సురభిరంభా ఫలములతోడ
దళమెక్కు పనస పెండొలలతోడ
ఘృత పిండనిభ కర్కరఖండములతోడ
బలుదెలంగుల మావిపండ్లతోడ
గోస్తనీమృదు గుళుచ్చ స్తోమములతోడ
గప్పులేటిన వడప్రప్పుతోడ
సుమధుర స్థూల దాడిమ బీజములతోడ
దనుపారు రసదాడిగ నెలతోడ
బానకం బతిథుల కిడ్డ దానుగ్రోలి" (2-73)

పొలాల్లో పనిచేసేవాళ్లు అంబలి తాగడం మనకు ఈనాటికి కనిపిస్తుంది. పొలంలో కావలి కాసే తమ భర్తలకు స్త్రీలు అంబలి పాత్రల్ని బుట్టలో పెట్టు కొని పోవుచున్నారని, జొన్న, సజ్జ, గోధుమ, "పిసికిళ్లు" తినేవారని వర్ణిం చాడు.

"............పొలమంబ ళ్లొమ్రయుచుం బట్టి పె
న్మసురం దగెడు కాపుగుబ్బెతల పెన్గుబ్బలుప్పు నాసత్పొలం
బిసికిళ్లుం బిసికిళ్ల హాలికుల కర్పించెన్న భస్యంబునన్" (4-188)

సామాన్య రెడ్లు వర్షాకాలంలో భుజించు ఆహారం ఎలా ఉందో చూడుడు:

"గురుగుం జెంచలి తుమ్మి లే దగిరిసాకుం దింత్రిణీపల్లవో
త్కరముల గూడ బొరంటి నూనియలతో గట్టావి కుట్టారుగో

గిరముల్మెక్కి తమింబసు ల్పోలము వో గ్రేపుల్మెయిన్నాకమే
కెరువునం గుంపటి మంచమెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్"

(4-134)

ధూర్జటి : 'శ్రీకాళహస్తి మాహాత్మ్యం'లో శాకాహార, మాంసాహారాల్ని రెండింటిని పేర్కొన్నాడు.

వేటాడిన అనంతరం తిన్నడు తోటి కిరాత కుమారులతో కలిసి వేటాడిన జంతువుల్ని కాల్చి తినేవాడట :

"క్రొవ్విన మెకలంబులను గొన్నటి కూర్చికమర్చి పెంచు ం
జివ్వుచు నెత్తమన్నలది చివ్వన నీరివురంగ నేర్చి నో
ప్పువ్విళ్ళూరబ్రేల్చి చముఃరుట్టి పడంగ గఁఅకుట్లు గాల్చిక
ట్టువ్వల నీడనొక పరిశుద్ధ శిలాతల భూమినందఱున్" (3-50)

తిన్నడు కొండల్లో తిరిగి వేటాడి చంపి కాల్చిన మాంసఖండములను శివునకు ఆహారంగా ఇచ్చాడట :

"..... ... ..... క్రొవ్విన పంది వేళ్ళదుప్పులన్
జెందన జెక్కు చందముల జిన్నక బెద్దక గారుకమ్మగా
వండుదురట్ల పిట్టలను వండుదు రిచ్చట నుండనేల" (3-66)

తిన్నడు శివునకు ఇవ్వగలనన్న శాకాహారాల్ని చూడుడు :

"ఓలింగమ విను నివ్వరి
ప్రాలును నోడిపిట్ల గునుకు బ్రాఖను వెదురుం
బ్రాలును సవరపు మెకముల
పాలును గలవచటనకు బాయసమునకున్" (3-67)

"పుట్టతేనియ పెరతేనె పుట్టజున్ను
తొఱ్ఱ తేనియగలవందు దోఁచిదోచి
కాలి దులదులనై పిండివోలె రాలు
నట్టినిఁజెట్లు గలవు నీకారగింప" (3-68)

**తెనాలి రామలింగడు :** 'పాండురంగ మాహాత్మ్యం'లో పేర్కొన్న ఆహార పదార్థాలు :

"ఒక కొన్ని వడియంబులొక కొన్ని వరుగులు
నొక కొన్ని తెలగుల యొలుపు ఒప్పు
లొక కొన్ని ద్రబ్బెడలొక కొన్ని తాలింపు
లొక కొన్ని విధముల యొట్టు జారు
లొక కొన్ని కలగల్పులొక కొన్ని బజ్జు లొ
క్కొక కొన్ని రీతుల యూర్పువగలు
నొక కొన్ని శిఖరులు నొక కొన్ని యంబళ్ళు
నొక కొన్ని వహుల పూపోత్కరములు

వివిధ ఫలకందమూలంబులవియు గొన్ని
యూరుబిండులు నొకకొన్ని యొక్క కొన్ని
యూరగాయలు బచ్చళ్ళు నొక్కకొన్ని
పెరుగు పాల్ తేనె నేతాలు పెచ్చుపెరుగు" (4-184)

**పింగళి సూరన :** "కళాపూర్ణోదయం"లో చతుర్విధాహారాల్ని పేర్కొనడంతోపాటు వివిధ పండ్లను కూడా పేర్కొన్నాడు.

"సురుచిభక్ష్య భోజ్యలేహ్య చోష్యపేయ భేదముల్
ధరణి నెన్నగలవు" (7-88)

మరియు

"కలవంటకములు బూరెలు తేనెలొలలు బా
పట్లు మండెంగ లొబ్బట్లు వడలు
కుడుములు సుకియలు కడియంపుటట్లు వె
న్నప్పాలు వడియంబు లప్పడాలు
పొంగరంబులు సొజ్జె బూరె తాగులు సేవె
లుక్కెర అరిసెలు చక్కిలములు
ఖర్జూర గోస్తనీ కదళికా సహకార
ఫలములు కొబ్బెర పనసతొలలు

తేనియలు జున్ను మీగడ లానవాలు
పానకములు రసావళ్ళు పచ్చడులును
నాజ్యములపు బప్పులు కూరలనుపమాన్న" (7-82)

**పాలవేకరి కదిరీపతి :** 'శుకసప్తతి'తో ఆటవికుల ఆహార పదార్థాల్ని వర్ణించాడు :

"నివ్వరిప్రాలు తేనియ పాలపండులు
కారెను ములపెర్గు చాఱపప్పు
పునుగు జట్టంబులు పునుగు కస్తురివాలి
కమ్మకస్తురి పచ్చకప్పురంబు
నేలకందంబులు కోఱలేనుంగు కొమ్ములు
బురుదు టింకలు పెను పులులుగోళ్ళు" (1-248)

"ఖితి యెఱుంగక తుంపురల్మిదబడగ
జొన్నకూడను వణ్ణిగ జుఱ్ఱిలేచి" (2-412)

అంటూ జొన్నలబల్లిని పేర్కొన్నాడు.

**అయ్యలరాజు నారాయణకవి :** 'హంసవింశతి'లో ఆహార పదార్థాల్ని, ఆహార పానీయాల్ని గూర్చి ప్రస్తావించాడు

భక్తులు శ్రీశైల యాత్రకు పోవుచు తమవెంట తీసికొనిపోయిన ఆహార పదార్థాలివి :

"అటుకు తిలపిష్ట చూర్ణ భాగశనమసిమి
యుల్లి పచ్చళ్ల పులిదోసె లూరుబిండ్లు
మూటలు బోటెలు చిలుగాళ్ల మోసితేగా" (3-189)

గొల్ల స్త్రీ జారశేఖరునికిచ్చిన ఆహార పానీయాల వర్ణన :

"కమ్మని జున్ను మంచినెయి గట్టి మీగడతో బెమంగు బొది
క్కమ్మగు జున్నుబాలు చిలుకమ్మిసి దీసిన వెన్నముద్ద వె
చ్చమ్ముల" (2-111)

మరియు వేసవి కాలంలో హరిశర్మ చలిపందిరిలో ఉంచిన ఆహార పానీయాల్ని వర్ణించిన విధం ఇలా కన్పిస్తుంది :

"లవణఖండ జంభల రసానుయుక్తమౌ
నీరుమజ్జిగకుండ బారులలయ
లఘుల యైలానూన లలిత సౌరభమిశ్ర
శీతల జలకుంభ జాత మమర
జీరక కైడర్యచారు గంధములొల్క
పలుచని యంబళ్ళపంట్లు దనర
రవయుప్పు నీరుల్లిరసము నించినచోళ్ల
గంజికాగుల గుంపు కడురహింప

గంధ బర్హిష్ఠలామజ్జక ప్రశస్త
కాయమాన ముహుద్మ హరాయమన
మందపవమాన ఘనసార బృందవేది
కాలయ విశాల పానీయశాల యొప్పె" (2-159)

విష్ణువాసుని విదేశీ ప్రయాణ సమయంలో వెంట తీసుక వెళ్ళిన పదార్థాల వర్ణన చాలా విపులంగా కలదు.

"గలమాన్నంబులుం గల వంటకంబులు బొంగలి పులియోగిరంబు, దధ్యోదనంబు, నానవాలు, జున్నులు, మీగడ పెరుగులు, నవీన తంపు ఘుటికలు, నౌలుపుబప్పు, నప్పడంబులు, వడుగులు, వడియంబులు పెరుగు వడియంబులు, మిరియంపు బొడి మెంతికూటువ సంబారంబు, జింతపండులు బజ్జు లుసిరికలు, బచ్చకర్పూరు బిండ్లూర గాయలు, మామిడితొక్కులు నివి మొదలుగా గల పరికరం బులును మఱియు వడపప్పు, బేసలు, వేపుళ్ళ ననుపగుగ్గిళ్ళు, బొరుగులు, బొడులు, బాకపు జలిమిడి కాయమ్ములుం జిమ్మిరుంటలు, నటుకులు, మూగలు, లాజలు, జటి కాలుకులు, నువ్వులు నాన బియ్యంబులు బేంపిండి (బేలసత్తు, దోసగింజలు, వెల్ల గిసెలు గోగులు, గరింగరుము, ఉపిళ్ళ, సెనగపప్పు, బొరుగుపప్పు, సారపప్పు, జీడిపప్పు, బాదంగి పలుకులు, గొబ్బెర, గసగసాలు, ఖర్జూరములు, ద్రాక్షలాది ఫలహారంబులు మరియు నుండ్రంబులు మండెగలు, గుడుములు, దోసెలరిసెలు,

రొట్టెలు నిప్పట్లప్పంబు లతరసములు, సుకియలమృత కలశమ్ములు, సొగులు, జక్కెర బుడగలు గరిజులు, బొరిపిళంగాయలు, దేమనంబును బాలకాయలు, చక్కిలమ్ములు, మినుప చక్కిలమ్ములు, మినుపపోకలు, మనోహరంబులు, గారెలు, బూరెలు, మోరుండ, లంగరొట్టెలు, మణుగు బువ్వాలు, బేణీలు, నరువత్తిగెలు, మడతలు బప్పుబూరె, సజ్జ బూరెలు వడలామవడ, లొబ్బట్లు, సారసత్తులు, సేవలు, ఊదమిఠ్న, సరడాలు, బరిడ గవ్వలు, జాపట్లు, నిద్దెనలు, తేనెతొలలు, బొరుగులు, నేలకికాయలు, వెన్న మెఱుంగులు, నిడికుడకలు, సదకుదకులు, ముత్తెపుజిప్పలు చంద్రకాంతలు, గరిజకాయలు, బెడదలు లడ్వాలు గోధచకి గూడు పరిగెలు, దెలుపరిగెలు బూరలు, గూళ్ళపిడ, లాడిసిగల భక్ష్యంబులు గూడలనించి"

(1-105)



# ఉపయుక్త గ్రంథసూచి


| | |
|---|---|
| అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు | పొన్నా లీలావతమ్మ, పొన్నా పబ్లికేషన్స్, పొనకం 1986 |
| ఆంధ్ర మహాభారతము | కవిత్రయం, తెలుగు విశ్వవిద్యాలయం 1989 |
| ఆంధ్ర మహాభాగవతము | బమ్మెర పోతన, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1988 |
| ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర | యస్వీ జోగారావు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు 1961 |
| ఆంధ్ర ప్రశస్తి | విశ్వనాథ సత్యనారాయణ, విద్యాలయ ప్రింటర్స్ 1978-79 |
| ఆంధ్రనాటక రంగ చరిత్ర | మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, రేణుకా గ్రంథ మాల, 1968 |
| ఆంధ్రావళి | రాయప్రోలు సుబ్బారావు, లలితాకుటీరం 1958 |
| ఆంధ్రుల జానపద విజ్ఞానం | ఆర్వీయస్. సుందరం, ఆ.ప్ర.సా. అకాడమి 1983 |
| ఆంధ్రుల సాంఘిక చరిత్ర | సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్ర సారస్వత పరిషత్తు 1950 |
| ఆముక్త మాల్యద | శ్రీకృష్ణదేవరాయలు, ఎమెస్కో ప్రచురణ 1970 |
| ఇందుమతీ పరిణయము | కుమార ధూర్జటి, వావిళ్ళ ప్రతి, 1914 |
| ఉత్తరహరివంశం | నాచన సోమన, ఆ.ప్ర.సా. అకాడమి 1979 |
| కళాపూర్ణోదయము | పింగళి సూరన, ఆ.ప్ర.సా. అకాడమి, 1980 |
| కాశీఖండము | శ్రీనాథుడు, వావిళ్ళ ప్రతి, 1917 |
| క్రీడాభిరామము | వల్లభరాయుడు, కాకతి పబ్లికేషన్స్, 1979 |
| కుమార సంభవము | నన్నెచోడుడు, ఆ.ప్ర.సా. అకాడమి, 1969 |

| | |
|---|---|
| జానపదగేయ వాఙ్మయ పరిచయము | హరి ఆదిశేషువు విజ్ఞాన ప్రచురణలు 1967, |
| జానపద కళా సంపద | తూమాటి దొణప్ప అభినందన సమితి ప్రచురణ 1987 |
| జానపద గేయ సాహిత్యం | ఎల్లోరా, దీప్తి పబ్లికేషన్, హైదరాబాదు 1982 |
| తెలుగు జానపద గేయ సాహిత్యం | బి. రామరాజు, జానపద విజ్ఞాన ప్రచురణలు హైదరాబాదు 1978 |
| తెలుగు జానపదగేయ గాథలు | నాయని కృష్ణకుమారి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, 1977 |
| తెలుగు సామెతలు | తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు 1989 |
| తెలుగు సామెతలు - జనజీవనం | పి. నరసింహారెడ్డి, శ్రీనివాస మురళీ పబ్లికేషన్స్ తిరుపతి 1988 |
| తెలుగు సాహిత్యంలో క్రీడావినోదాలు | వడ్లా సుబ్రహ్మణ్యము, 1987 |
| దశకుమార చరిత్రము | కేతన, వావిళ్ళ ప్రతి 1925 |
| నవనాథ చరిత్రము | గౌరన, ఆ.ప్ర.సా. అకాడమి, 1984 |
| నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రకవి, నాగార్జున ప్రెస్ నిడుబ్రోలు 1951 |
| పండితారాధ్య చరిత్ర | పాల్కురికి సోమనాథుడు, ఆంధ్రపత్రిక ముద్రశాల 1989 |
| ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాసం | గణపవరపు వేంకటకవి, ఆ.ప్ర.సా. అకాడమి 1977 |
| ప్రభావతీ ప్రద్యుమ్నము | పింగళి సూరన, ఆ.ప్ర.సా. అకాడమి, 1968 |
| పరిశోధన | నాయని కృష్ణకుమారి, ఆంధ్ర సారస్వత పరిషత్తు |
| పల్నాటి వీరచరిత్ర | శ్రీనాథుడు, కారెంపూడి వీరాచార పీఠాధిపతి ప్రచురణ 1984 |
| పాండురంగ మాహాత్మ్యము | తెనాలి రామలింగడు, ఆ.ప్ర.సా. అకాడమి 1984 |

| | |
|---|---|
| పల్నాటిసీమలో కోలాటం | బిట్టు వెంకటేశ్వర్లు, తెలుగు విశ్వవిద్యాలయం, 1988 |
| పల్లెపదాలలో ప్రజాజీవనం | యెల్దండ రఘుమారెడ్డి, గురుకుల విద్యా పీఠ ప్రచురణలు, 1979 |
| బసవ పురాణము | పాల్కురికి సోమనాథుడు, ఆ ప్ర సా. అకాడమి 1969 |
| భాస్కర శతకము | మారద వెంకయ్య, బాలసరస్వతీ బుక్ డిపో కర్నూలు |
| భీమేశ్వర పురాణము | శ్రీనాథుడు |
| మనుచరిత్ర | అల్లసాని పెద్దన ఆ ప్ర సా. అకాడమి 1984 |
| మల్హణ చరిత్ర | పెదపాటి ఎఱ్ఱనార్యుడు, శృంగార కావ్య గ్రంథమాల 1940 |
| యయాతి చరిత్ర | పొన్నికంటి తెలగనార్యుడు, ఆ ప్ర సా. అకాడమి 1961 |
| రాజాప్రతాపసింహ చరిత్ర | దుర్భాక రాజశేఖర శతావధాని, మారుతి ప్రెస్, ప్రొద్దుటూరు 1958 |
| రాధికాస్వాంతనము | ముద్దుపళని, శృంగార కావ్యమండలి, 1987 |
| రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుడు, ఆ.ప్ర.సా. అకాడమి 1967 |
| వసుచరిత్ర | రామరాజభూషణుడు, ఎమెస్కో ప్రచురణ, 1970 |
| వాల్మీకి చరిత్ర | రఘునాథరాయలు, ఆ ప్ర సా. అకాడమి 1968 |
| విజయవిలాసము | చేమకూర వేంకటకవి, వావిళ్ళప్రతి, 1966 |
| విష్ణుపురాణము | వెన్నెలకంటి సూరన వావిళ్ళప్రతి, 1955 |
| వేమన పద్యములు | ఎస్ వి. గోపాల్ అండ్ కో, మద్రాస్, శార్వరీ ఉగాది. |
| వైజయంతీ విలాసము | సారంగుతమ్మయ్య, వావిళ్ళప్రతి, 1960 |
| శతక సంపుటము | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి |

